# మయవాస్తు

సంపాదకుడు

గోరస వీరబ్రహ్మాచార్యులు

రచయిత

"జ్యోతిష మహార్ణవ" "వాస్తు సమ్రాట్" "దైవజ్ఞ"

**గోరస వీరభద్రాచార్యులు. ఎం.ఏ**

ప్రచురణ

శ్రీగాయత్రీ జ్యోతిష విజ్ఞాన సంస్థ

ఇం. నం : 8 - 26, మైత్రీపురము, కర్మన్‌ఘాట్,

హైదరాబాద్ - 500 074, ఫోన్ - 4067254

ప్రథమ ముద్రణము : రుధిరోద్గారి - శ్రావణం

ద్వితీయ ముద్రణము : బహుధాన్య - భాద్రపదం

ప్రతులు - 2000

విడిప్రతి వెల - రూ 80/-

ప్రకాశకులు

శ్రీ గాయత్రీ జ్యోతిష విజ్ఞాన సంస్థ

ఇ.నం : 8 - 26, మైత్రీపురము, కర్మన్‌ఘాట్,

హైదరాబాదు - 500 074. ఫోన్ - 4067254.

ప్రతులకు

మేనేజర్

శ్రీమతి జి.జె.లక్ష్మి

శ్రీగాయత్రీ జ్యోతిష విజ్ఞాన సంస్థ

ఇ.నం : 8 - 26, మైత్రీపురము, కర్మన్‌ఘాట్,

హైదరాబాద్ - 500 074, ఫోన్ - 4067254.

# విషయసూచిక

"శిల్పకళానిధి
"శిల్పకళా విద్వన్మణి"
ఎస్.ఎమ్. గణపతి స్థపతి
ఎండోమెంటు డిపార్ట్‌మెంటు
గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్
హైద్రాబాద్

చీఫ్ స్థపతి
ఫర్ హిందూ టెంపిల్స్ ఆఫ్
న్యూయార్క్ అండ్
పిట్స్‌బర్గ్ అమెరికా మరియు
శ్రీ వెంకటేశ్వరా టెంపిల్
సిడ్నీ ఆస్ట్రేలియా

"ఓం నమస్తే స్వర్ణభైరవాయ"

# పీఠిక

మన ప్రాచీన శిల్పశాస్త్ర గ్రంథములలో "మయమతము" చాల ప్రసిద్ధికెక్కినది. ఆంధ్రప్రదేశములో చాల వ్యాప్తి గన్నది. మయవాస్తువు అను పేరిట పూర్వము వావిళ్ళవారు ప్రచురించినదే ఎక్కువ ప్రదేశములలో కనుపించుచున్నది. తెలుగుదేశములో నున్న అనేక గ్రంథాలయములలో శిల్పవాస్తు గ్రంథములను వెదుకునప్పుడు నాకు వేటపాలెము గ్రంథాలయములో మయమతము కనుపించినది. తదుపరి "భారతీయ మహాశిల్పము" అను గ్రంథమును వ్రాసిన బ్రహ్మశ్రీ స్వర్ణసుబ్రహ్మణ్య కవిగారు కూడా ఆ గ్రంథము దొరకలేదని వ్రాసినారు. తెలుగుదేశములో ప్రచారములోనున్న కృష్ణవాస్తువు, సనత్కుమార వాస్తువు మొదలైన గ్రంథముల కీ మయమతమే మూలాధారము. శ్రీ ఫణీంద్రనాథబోసు ఇంగ్లీషులో వ్రాసిన "భారతీయకళ"కీ గ్రంథమే మూలము.

"మనుర్మయస్తథా త్వష్టా శిల్పీ విశ్వజ్ఞ ఏవచ
విశ్వకర్మ సుతాహ్యేతే పంచసృష్టి ప్రవర్తకాః"

అని స్కందపురాణోక్తి. ఈ సంప్రదాయములో దారుశిల్ప (వడ్రంగము) ప్రవర్తకుడైన మయమహర్షి అనేక వేద, శాస్త్ర, పురాణ గ్రంథములలో మహాప్రభావశాలిగా కనిపించుచున్నాడు.

వేదశాస్త్రములలో "వాస్తోష్పత్తి"గా ప్రసిద్ధి నొందిన పరమాత్ముని పూజించుట, అతని పేరిట శాస్త్రమును లోకములో ప్రసిద్ధిగాంచుట చూచుచున్నాము. దీనిని వేద,

ఆగమ, పురాణ, శాస్త్ర గ్రంథములలో అనేక మహర్షులు అభ్యసించి లోకములో ప్రవర్తింపజేసిన విషయము మనకు అనేక గ్రంథములలో కనుపించుచున్నది. మత్స్య పురాణములలోని 18 మహర్షులను తెలుపు "భృగురత్రిర్వశిష్ఠశ్చ" అను శ్లోకమును -

మానసారములోని

"విశ్వకర్మాచ విశ్వేశః విశ్వసార ప్రబోధకః
వృతశ్చైవ మయశ్చైవ త్వష్టాచైవ మనుర్మలః"

అను శ్లోకములోని 32 మంది మహర్షులు, మనుమహర్షి చెప్పిన 28మంది శాస్త్రకర్తలు అట్లే 64మంది మహర్షులు ఈ శాస్త్రమును ప్రచారము చేసిరన్న ఈ శాస్త్రముయొక్క విఖ్యాతి (గొప్పతనము) తెలియుచున్నది.

రామాయణములో శ్రీరామచంద్రుడు తన పర్ణశాలను నిర్మింపబోవునపుడు కూడా "వాస్తుపూజ" యొనర్చినట్లు వాల్మీకి మహర్షి వర్ణించియున్నాడు. దానినిబట్టి ఆనాడు రాజాధిరాజులు, సామాన్యులు కూడా ఈ వాస్తునియమములు పాటించుచు ధర్మమును కాపాడుచుండిరని తెలియుచున్నది.

శ్రీ గోరస వీరభద్రాచార్యులు ఎమ్.ఏ., శ్రీ గోరస వీరబ్రహ్మాచార్యులు గారలు ఈ గ్రంథమును అనేక కష్టనష్టములకోర్చి వ్రాసినారు. మయమతము మూల గ్రంథము ననుసరించి అధ్యాయములను వరుసగా వేర్పరచి మూలగ్రంథములైన మయమతమును, మానసారమును, అపరాజితపృచ్ఛలను, తర్వాత వెలువడిన గ్రంథములను కూడా పరిశీలించి వ్రాసిన విషయము చక్కగానున్నది. నేను చూచిన తెలుగు గ్రంథములలో మయమతమును ప్రమాణముగా తీసుకొని వ్రాసిన మొదటి గ్రంథమిదే. ఇంత కష్టపడి ఈ గ్రంథమును వ్రాసి ప్రజలకందించిన వీరికి భగవానుడాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక!

ఇట్లు
విధేయుడు
ఎస్.ఎమ్.గణపతి స్థపతి
ది. 30.3.83
పంజాగుట్ట, హైదరాబాద్ - 500 004.

"కళాప్రపూర్ణ
"దర్శనాచార్య
డా॥ కొండూరు వీరరాఘవాచార్య
రిటైర్డ్, తెలుగు మరియు సంస్కృత లెక్చరర్

గాంధీనగరమ్
తెనాలి - 522 201
ది. 9-6-83

# వాస్తు పీఠము

శ్రీ గౌరన వీరభద్రాచార్యులు ఎమ్.ఏ., గారిచే రచింపబడి, శ్రీ గౌరన వీరబ్రహ్మాచార్యులు గారిచే సంపాదింపబడిన "మయవాస్తు" అను గ్రంథమును చూచుటయైనది. వీరు ఉభయులు సంప్రదాయసిద్ధముగా శిల్పవాస్తు కార్యములు నెఱపుమను మయాది శిల్పబ్రహ్మల వంశమునకు చెందినవారు. ఆ కారణమున శిల్పవాస్తు రహస్యములు వీరికి వెన్నతో పెట్టిన విద్యలనవచ్చును. అంతియేగాక బహుశాస్త్ర గ్రంథావలోకనము చేసి ఆయా గ్రంథకారుల సిద్ధాంతభేదములను, వేటి వైజ్ఞానిక దృష్టితో సమన్వయించు సామర్థ్యము కూడ వీరికి కలదని ఈ గ్రంథము చెప్పుచున్నది.

శిల్పవాస్తు శాస్త్రముల విషయమున - విశ్వకర్మ, మను, మయ, త్వష్టశిల్పి, విశ్వజ్ఞ ప్రభృతులు ఆదిమోపదేశికులు. ఈ గ్రంథము "మయవాస్తు" వైనను మయునికూడ జనకుడని చెప్పదగిన విశ్వకర్మ యొక్క (విశ్వప్రకాశిక) సిద్ధాంతములను అనుసరించియే యిందు ఆయా నిర్ణయములు చేయుట గమనింపతగి యున్నది. భృగ్వంగిరః, కశ్యప, వశిష్ఠ, భరద్వాజ, అగస్త్య, నారద, మానసారాదులు కూడా ఆదిమ విశ్వశిల్పియగు విశ్వకర్మ దేవుని శిల్పవాస్తు సిద్ధాంతములను అనుసరించియే తమ గ్రంథములను కొనసాగించిరని తత్పరిశీలనముచే తెల్లమగుచున్నది. ఇట్టి స్థితిలో సమరాంగణ సూత్రధార, భువనదేవాచార్య (అపరాజితపృచ్ఛ) మండన సూత్రధార (ప్రాసాదమండనాదులు) శ్రీకుమారా (శిల్పరత్నమ్)దులైన ఆధునికులను గూర్చి చెప్పవలసినదేమున్నది. వీరు అన్ని విధములా మను మయ, విశ్వకర్మాదుల సిద్ధాంతానుయాయులే.

ఈ గ్రంథకర్త సందర్భానుసారము వాస్తువిద్య, వాస్తురత్నాకరము, పరాశర సంహిత, సకలాధికారము, వాస్తుప్రబోధము, మనుష్యాలయ చంద్రిక, జ్యోతిర్నిబంధము, కాలామృతము, శ్రీకృష్ణవాస్తు మొదలగు గ్రంథములను గూడ సంప్రదించి సమన్వయ పూర్వకముగా అనేక విషయములను వెలువరించినారు. ఇది సామాన్యకార్యము కాదు.

ఇందు దాదాపు 32 విషయములను గూర్చి విశదీకరించుటయైనది. శిల్పవాస్తు శాస్త్రకారులలో అనేకములైన సిద్ధాంత సంప్రదాయ భేదములున్నవి. సౌందర్యదృష్టితోను, ప్రయోజన దృష్టితోను, ప్రాసాదభాగాదుల స్థిరత్వ దృష్టితోను చూచినప్పుడు అన్నియు సమంజసములుగానే తోచును. తత్తద్దేశకాల భేదములను బట్టి కొన్ని మార్పులను అంగీకరించుటలో దోషము లేదు. అంతమాత్రము చేత ఒక సిద్ధాంతముగాని, ఒక సంప్రదాయముగాని, అన్యసిద్ధాంత సంప్రదాయములను ఈసడింపబనిలేదు. వేదములలోనే ఒక విషయముపై భిన్నాభిప్రాయములున్నప్పుడు అవి రెండును పరమ ప్రమాణములే అని శాస్త్రకారులు సిద్ధాంతీకరించినారు.

అసమగ్ర జ్ఞానముతో చూచినప్పుడు మాత్రమే భేదములకు, విరోధములకు, తావేర్పడును గాని సంపూర్ణజ్ఞానమెప్పుడును సమన్వయకారియే యగును. ఈ గ్రంథమున ఒక్కొక్క మండలమునను, ప్రాంతమునను, ఉన్న సిద్ధాంత సంప్రదాయములను గూర్చి గూడ గ్రంథకర్త ప్రస్తావించియే యున్నాడు.

ఇందు వాస్తుశాస్త్ర నిర్వచనము, గృహనిర్మాణ ప్రయోజనము, నామనక్షత్ర ప్రాధాన్యము, దిక్సాధన, శాలానిర్మాణ పద్ధతి, అళింద నిర్మాణ విశేషవిధులు, హస్తాది మాననిర్ణయము, శంకుస్థాపన అనగానేమి?, ఉపగ్రహములు, నీటిపారుదలలు, గృహావరణ వృక్ష విజ్ఞానము, గృహారంభ యోగ్యకాలము, ఆయాది సాధ్య సమన్వయవిధి మున్నగు విషయములను, గ్రంథకర్త బహుగ్రంథ ప్రమాణములను కడు మెలకువతో చర్చించి కర్తవ్యాంశములను నిర్ణయించి యున్నాడు. ఎట్టి పరిస్థితులలోను దిఙ్మూఢము కారాదని వాస్తువేత్తలు గమనింపవలసి ఉన్నది. గృహప్రవేశ విధానమునందు గృహనిర్మాతయైన శిల్పాచార్యుని పూజ ముఖ్యమని మరువరాదు. మయవాస్తు శిల్పాచార్య లక్షణములను గూర్చి అత్యద్భుతముగా వివరించినది. ఆ ప్రాచీన శ్లోకము లిప్పటి మయమత గ్రంథములలో తొలగింపబడుట విచారణీయము. గృహవాస్తు నిర్మాతయగు

శిల్పాచార్యుడు అపర విశ్వకర్మగా పూజింపబడెడి కాలమున భారతీయ వాస్తువునకెట్టి లోటును లేక గృహయజమానులు సర్వసంపత్తులతో తులతూగుచుండెడివారు. ఆ గౌరవము ప్రతికక్షుల తంత్రములు కారణముగా క్షీణింపగా గృహస్థుల సౌభాగ్యము కూడ దెబ్బతిని పోయినది. ఈ అంశమునే శ్రీ పులివర్తి శరభాచార్య మహాకవి

"ప్రజల యిండ్లకు లచ్చి వచ్చి కూర్చొనదేల
వాస్తు గౌరవపీఠి పగిలెనేమొ"

అని ఒక పద్యపాదమున సూచించినాడు. ఇకనైనను జారిపోయిన ప్రాచీన గౌరవాదరములు చిగురొత్తునని తలంతము. ఈ "మయవాస్తు" గృహనిర్మాతలకును, గృహస్థులకును ప్రయోజన దాయకమై బహుళ ప్రచారము నందగలదని నమ్ముచున్నాను.

ఇట్లు
కొండూరు వీర రాఘవాచార్య
ది. 9-6-83.



# ఉపక్రమణిక

శ్రీమదఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన పరమేశ్వరుని సృష్టిలో పిపీలికాది బ్రహ్మపర్యంతం గల జీవరాసులన్నింటికీ యెండ, చలి, వాన, గాలి మొదలగు ప్రకృతి సహజాలైన బాధలనుండి రక్షణ పొందడానికి యేదో ఒక విధమైన ఆశ్రయం, ఇల్లు అవసరమై ఉంది. అట్టి ఆశ్రయ నిర్మాణం కోసం ప్రతీప్రాణీ ప్రయత్నం చేయడం సహజం. ఈ ప్రయత్నం ఆయా ప్రాణులు నివసించే దేశ కాలావసరాలను అనుసరించి ఉంటుంది.

ఈ సృష్టిలో చీమ చాలా చిన్నప్రాణి. దాని జీవన విధానం కూడా చాలా ఆదర్శప్రాయమై ఉంటుంది. అది తన కుటుంబం నివసించడానికి చక్కని ఒక క్రమపద్ధతిలో చూడ ముచ్చటగా ఉండేరీతిలో నివాసయోగ్యమైన పుట్టను నిర్మించుకొంటుంది. అట్లే పక్షిజాతికి చెందిన పిచ్చుకలు అత్యద్భుతమగు శిల్పనిర్మాణ కళాకౌశలం ఉట్టిపడేలాగున తమకు నివాసయోగ్యమైన "పిచ్చుకగూళ్లను" నిర్మించుకొని నివసిస్తూ ఉండటం చూస్తూవుంటాం. అలాంటప్పుడు బుద్ధిబలం వున్న మానవజాతిని గురించి ఇక వేరే చెప్పాలా?

అనేక వేల సంవత్సరాలకు పూర్వమే మనకు పూర్వులైన కొందరు ఋషులు మానవనివాస యోగ్యమైన గృహనిర్మాణ విషయంలో చిరకాలం పరిశ్రమించి, తమకంటే పూర్వీకులైన మానవజాతులు అనుసరించిన గృహనిర్మాణ పద్ధతులను, వాటి పూర్వాపరాలను బాగా పరిశీలించి, పరిశోధించి, ఆయా పరిశోధనా ఫలితాలను, తమతమ అతీంద్రియ జ్ఞానదృష్టులతో విమర్శించి అందు నిగ్గు తేలిన పద్ధతులను సూత్రబద్ధం చేసి లోకకల్యాణ కారకాలైన గృహనిర్మాణ శాస్త్రాన్ని రూపొందించారు. ఆ విధంగా ఆవిష్కరింపబడిన గృహనిర్మాణ శాస్త్రాలే వాస్తుశాస్త్రాలుగా లోకంలో వాసిగాంచాయి. అట్టి వాస్తుశాస్త్రకర్తలలో విశ్వకర్మ, యముడు, త్వష్ట, కశ్యపుడు, భృగువు, అత్రి, అగస్త్యుడు మొదలగువారు సుప్రసిద్ధులు. వీరిలో యముడు అపర విశ్వకర్మావతారుడుగా పురాణేతిహాసాలలో పొగడబడినవాడు.

ఈ విధంగా మయ విశ్వకర్మాదుల చేత ఆవిష్కరింపబడి భారతీయ జీవన విధానాన్ని తీర్చిదిద్దిన శిల్పవాస్తు శాస్త్ర గ్రంథాలు యేయే మూలసూత్రాలపై ఆధారపడి సామాజిక జీవన విధానాన్ని సుఖతరం చేస్తున్నాయో కొంచెం పరామర్శించి చూద్దాం. భారతీయ శిల్పవాస్తు శాస్త్ర గ్రంథాలను, ఆధునిక విజ్ఞానశాస్త్రం చేత లభ్యమైన పరిశోధనా పద్ధతులను సమన్వయదృష్టితో ఆకళింపు చేసుకొని పరిశీలించిన మీదట స్థూలంగా ఈ క్రింది తొమ్మిది మూలసూత్రాల మీద భారతీయ వాస్తుకళ ఆధారపడి ఉంటుందని నిర్ణయించవచ్చు.

1. పరిసరాల ప్రభావం
2. నిర్మాణస్థలం యొక్క భౌతికస్థితి
3. ఆరోగ్యసూత్రాల సమన్వయం
4. నిర్మాణ సౌందర్య పరిరక్షణ
5. జీవితావసరాలకు, రూపకల్పన
6. భూ భౌతిక శక్తుల వలన లాభాలు
7. భూగోళంపై ఖగోళ గ్రహగతుల ప్రభావం
8. దేశకాల పాత్రతల పరిగణన
9. మానవ జీవితం మీద ఖగోళ గ్రహగతుల ప్రభావం.

**పరిసరాల ప్రభావం :** మానవునిపై పరిసరాల ప్రభావం అధికంగా ఉంటూ ఉంటుంది. పరిసరాలు అనుకూలంగా లేనిచోట మానవ జీవితం సుఖతరం కాదు. జీవితం ఆనందదాయకంగా గడవదు. అందుచేతనే వాస్తుశాస్త్ర కర్తలు గ్రామపొలిమేరల్లోను, దేవాలయాల పరిసరాలయందు, తరచుగా జన సమూహాలు గుమిగూడే చోటుల్లోను యిండ్లు కట్టరాదని శాసించారు. ఈలాంటి చోట్లలో యిండ్లు కట్టి నివసించేవారికి జీవితం ఆనందదాయకంగాను ప్రశాంతంగాను గడవదని వేరే చెప్పాలా? వివరణ వ్రాయనవసరం లేదుకదా?

**నిర్మాణస్థలం యొక్క భౌతికస్థితి :** ఏ విధమైన భూ భౌతికస్థితి గల క్షేత్రంలో యిండ్లు నిర్మిస్తే యెంతకాలం స్థిరంగా నిలిచి ఉంటాయో గమనించడమే ఈ మూలసూత్రం మనకు నిర్దేశిస్తుంది. ఆయా భూముల్లో నిర్మించిన కట్టడాలు

యెంతకాలం స్థిరంగా నిలుస్తాయి అనే విషయం శిల్పశాస్త్రాలలో నిర్దేశించిన భూ పరీక్ష యందు స్పష్టంగా గోచరిస్తుంది. నిర్మాణస్థలంలో ఒకమూర సమచతురశ్రము "ఖాతము" అనగా బిలము త్రవ్వి ఆ మట్టియొక్క రంగు, రుచి, వాసన మొదలగు విషయములు పరిశీలించి, మరల అదేమట్టితో ఖాతమును పూడ్చినప్పుడు మిగిలిన మట్టిననుసరించి ఫలితాలు నిర్దేశించుటలో గల పద్ధతుల యందు భూమియొక్క పరిశీలన ప్రాచీన వైజ్ఞానిక పద్ధతిలో నిర్దేశింపబడినట్లు గ్రహించగలం. బీటలు వారిన స్థలం, బొరియలు గల స్థలం, గృహ నిర్మాణానికి యోగ్యమైంది కాదని వాస్తుశాస్త్రాలు స్పష్టంగా ఉగ్గడిస్తున్నాయి.

ఆరోగ్యసూత్రాల సమన్వయం : "ఆరోగ్యమే మహాభాగ్య"మన్నారు పెద్దలు. మానవజీవితంలో ఆరోగ్యం ప్రముఖస్థానం ఆక్రమించుకుంటుంది. ఎన్ని సంపదలున్నా ఆరోగ్యభాగ్యం అబ్బనినాడు ఆ జీవితం వ్యర్థమనే చెప్పాలి. అట్టి ఆరోగ్యభాగ్యం చక్కని గాలి, వెలుతురు ఈ రెండింటిమీదే ఆధారపడి ఉంటుంది. ఏ యింటికి చక్కని గాలి వెలుతురు ప్రసరించే అవకాశం లేదో, ఆ యింటిలోని వారు ఆరోగ్యవంతులుగా ఉండలేరు. ఇండ్లకు నాలుగువైపుల, యేయేదిశలలో యెంతెంత కాళీ జాగా విడిచిపెట్టాలో ఈ రెండు సూత్రాలను ఆధారం చేసుకొనే విశ్వకర్మ ప్రకాశికలో నిర్దేశించబడిందని మనం ఊహించవచ్చు. మానవజీవనానికి ఆరోగ్యప్రదమైన మలయానిల (పైరుగాలి) దక్షిణదిశ నుండే వస్తుంది. ఆ దిశ మూయబడితే ఆరోగ్యప్రదమైన గాలి ఆ యింటిలో ప్రవేశించదు. అందుచేతనే

"క్రోశమేకం తు దక్షిణే"

అని విశ్వకర్మ ప్రకాశిక నిర్దేశించింది. ఇంటికి కిటికీలు వాతాయనాలు మొదలైన వాటి నియమాలు ఈ ఆరోగ్యసూత్రాలను ఆధారం చేసుకొనే వివరింపబడినవి. మరో ముఖ్య విషయం ఇక్కడ ఉటంకించడం ఉచితమనుకుంటాను. వాస్తు పురుషాంగ వివరణ చెబుతూ ఒకచోట యింటిముంగిలి వాస్తుపురుషుని ఊపిరితిత్తులుగా చెప్పబడినది. ఈ సంప్రదాయ సూక్తి ప్రకారం మనుష్యుని జీవితంలో ఊపిరితిత్తులు ఏ విధంగా ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తాయో గృహపురుష ఆరోగ్యంలో కూడ యింటి ముంగిలి అంతటి ప్రాముఖ్యాన్ని పొందుతుంది. వీటన్నింటిని సమగ్రంగా పరిశీలిస్తే వాస్తునియమాల్లో యెక్కువభాగం ఆరోగ్యసూత్రాల సమన్వయం గోచరిస్తుంది.

**నిర్మాణ సౌందర్య పరిరక్షణ :** మానవుడు సౌందర్యారాధకుడు. ఆతనికి కంటికింపైన వస్తువు, లేక వస్తుసముదాయం చూడ్డంతోనే ఆనందం కలుగుతుంది. అందుచేతనే చూడముచ్చటగా ఉండే వస్తువును తన సొంతం చేసుకోవాలని అభిలషిస్తాడు. ఆవిధంగానే ఆతని నివాసగృహం కూడ చూడముచ్చటగా ఒక క్రమపద్ధతిలో ఎగుడుదిగుళ్లు లేకుండా నియమబద్ధంగా నిర్మించుకోవాలని అనాది కాలం నుంచీ మానవుడు ప్రయత్నిస్తూ వచ్చాడు. ఎంతో చక్కని పద్ధతిలో యింటిని ముస్తాబు చేయు పద్ధతులు మన వాస్తుశాస్త్రాలలో వర్ణించబడి ఉన్నాయి.

**జీవితావసరాలకు రూపకల్పన :** నాగరిక జీవితంలో జీవితావసరాలు ఆయా దేశ, కాల, పరిస్థితులను బట్టి మారుతూ ఉంటాయి. వాస్తుశాస్త్రంలో ఈ నాగరిక జీవనానికి అవసరమైన మూలసూత్రాలు నిర్దేశింపబడ్డాయి. ఈ మూలసూత్రాలకు భిన్నంకాని రీతిలో ఆయా దేశ కాల పాత్రతల కనుగుణంగా గృహంలో అవసరానుగుణ్యమైన గదులు, వరండాలు, వంటగదులు, పడకగదులు, భోజనశాలలు, స్నానపుగదులు మొదలైనవి ఏర్పాటు చేసుకోవచ్చును. ఆ మూలసూత్రాల ప్రకారం (ఫండమెంటల్ రూల్సు) యిల్లు దేవ, గంధర్వ, మానుష అను మూడుభాగాలుగా విభజింపబడింది. ఇంటిముందు భాగం దేవభాగం. ఈ దేవభాగంలో విద్యాభ్యాసం, మీటింగ్‌హాల్, అతిథి సత్కారగృహం మొదలైనవి ఉంటాయి. మధ్యభాగం గంధర్వభాగం. అనగా గర్భగృహం. ఇందులో పడకగదులు, వివాహాది శుభకార్యాలకు సమావేశమయ్యే మండువా, లేదా హాలు, పిల్లల పడకగదులు ఉంటాయి. ఇంటికి వెనుకభాగం మానుషభాగంలో వంటగదులు, భోజనశాల, స్టోర్‌రూంలు ఉంటాయి.

**భూభౌతిక శక్తుల వల్ల లాభాలు :** ఈ నియమానికి సంబంధించిన ముఖ్య విషయము భూమిని ఆవరించియున్న అయస్కాంత వలయాల ప్రభావం. ఈ భూమ్మీద జరుగుతున్న అన్ని సంఘటనలకీ అయస్కాంత వలయాల ప్రభావంతో దగ్గర సంబంధం ఉండి తీరుతుందని నేటి సైంటిస్టులు సహితం అంగీకరించక తప్పడం లేదు.

"దిఙ్మూఢే కులనాశస్స్యాద్వక్రే దారిద్ర్యమాదిశేత్"

అనగా యింటిని సరిగ్గా దిశలకు అనుకూలంగా నిర్మించకపోతే కులనాశనం జరుగుతుందని చెప్పిన నియమం. భూమండలానికి ఉన్న ఉత్తర ధృవానికి సంబంధించిన సాంకేతిక నియమం. ఈ నియమం యెంతమాత్రం ఉల్లంఘించడానికి వీలు లేదని అన్ని వాస్తుగ్రంథాలు నొక్కి వక్కాణిస్తున్నాయి. ఈ నియమాన్ని యిప్పటికి 73,000 సంవత్సరాల నాటి నిర్మాణాలని చెప్పబడుతున్న ఈజిప్టులోని పిరమిడ్ల నిర్మాతలు కూడ పాటించారు.

గ్రేట్ పిరమిడ్ ఆఫ్ సియోప్స్ అనబడే పిరమిడ్ ఎత్తు 485 అడుగులు ఉంటుందట. అది ఆక్రమించిన స్థలం 13 ఎకరాలుంటుంది. ఈ పిరమిడ్స్ నిర్మాణం ఖచ్చితంగా నిర్ణీత ఉత్తరదిశను అనుసరించి నిర్మించారు కాబట్టి విశాల విశ్వాంతరాళంలోని "ఎలక్ట్రో మాగ్నటిక్" తరంగాలను "కాస్మిక్ తరంగాలను" తనలోనికి ఆకర్షించుకొని అందుండే వస్తువులకు శక్తిని, స్థిరత్వాన్ని యిస్తున్నాయని "యూరోపియన్ అతీంద్రియ పరిజ్ఞాన సంస్థ" వారు అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తూ ఉంది. దిశలో ఏ కొద్ది మార్పు వచ్చినా అనగా ఆ నిర్మాణంలో నిర్ణీత ఉత్తరదిశకు 5 డిగ్రీల తేడాతో నిర్మిస్తే ఆమేరకు ఆ నిర్మాణంలో ఉత్పత్తి అయ్యే శక్తి తగ్గిపోతుందని ఆ సంస్థవారు అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తూ ఉంది. సారాంశం యేమంటే గృహాది నిర్మాణాలు ఖచ్చితంగా దిక్సూచికి అనుకూలంగా నిర్మించాలని ప్రధానాంశం. అయితే మహానగరాల్లోని వీధులు దిశలకు అనుకూలంగా లేనిచోట చేపట్టవలసిన "విశేషవిధి" విశ్వకర్మ చెప్పనే చెప్పాడు.

ఈ భూభౌతిక శక్తికి సంబంధించినదే మరొక ముఖ్య నియమం. "ఆయాది సాధన" మన పూర్వపు శిల్పఋషులు "ఆయాది వర్గసాధన" గురించి "యోని ప్రాణాయేవదామ్నాం" అని చెప్పారు. అంటే ఆయాది వర్గసాధన గృహాది నిర్మాణములకు ప్రాణము వంటిదని వారి అభిప్రాయం. ఒక నిర్ణీత ప్రమాణం గల క్షేత్రీకృతం గల భూమిలో యింత శక్తి ఆవరించి ఉంటుందని పరమార్థం. ఈ విషయాన్నే పై పేరాగ్రాఫు సందలి విషయం కూడా బలపరుస్తూ ఉంది. వివరాలు చెప్పుకుంటూ పోతే యిదో గ్రంథమంత ఉంటుంది. ఏది ఏమైనా కొంత నిర్ణీత ప్రమాణం గల భూమితో కొంత శక్తి ఉత్పత్తి అవుతూ ఉంటుందనడం నిర్వివాదాంశం. ఆధునిక వైజ్ఞానికులు అంగీకరించిన సత్యం.

భూగోళంపై గ్రహగతుల ప్రభావం : మనం నివసించే భూగోళం సూర్య కుటుంబానికి చెందింది. ఆ సూర్యకుటుంబానికి చెందిన ఇతర గ్రహాలతో బాటు ఈ భూగోళం కూడ పరస్పరాశ్రయమై ఉన్నప్పుడు యితర గ్రహాల ప్రభావం ఈ భూగోళం మీద నివసించే జీవరాసుల మీద పడక తప్పదు గదా! అసలు వాస్తుశాస్త్రమంతా గ్రహరాజైన సూర్యుణ్ని ఆధారం చేసుకొనే చెప్పబడింది. వాస్తుపురుషుడంటే సూర్య తేజస్సుకు రూపకల్పన. వాస్తుపురుష పరిభ్రమణం అంటే (మాసవాస్తుపురుష నిర్ణయం) సూర్యగమనాన్ననుసరించే చెప్పబడింది. ఈ వైజ్ఞానిక సత్యం గ్రహించినవాళ్ళకు వాస్తుశాస్త్ర రహస్యం బాగా అవగతం అవుతుంది. సూర్యతేజస్సే సమస్త జీవులకు ప్రాణధారం గదా? ఈ వైజ్ఞానిక సత్యాలను మహాతపశ్శక్తి సంపన్నులైన మన పూర్వ ఋషులు తమ అతీంద్రియశక్తుల సహాయంతో ఖగోళాన్ని పరిశోధించి ఫలానా నక్షత్రమండలంలో ఫలానా గ్రహం ఉన్నప్పుడు ఫలానా విధంగా భూమండలం మీది జీవరాసులు ప్రభావితమవుతాయని నిర్ధారించి చెప్పారు. ఈ మూలసూత్రం ఆధారంగానే భూగోళము నిద్రావస్థలోనున్నప్పుడు గృహాది నిర్మాణకార్యాలు చేయరాదని నిషేధం విధించారు.

దేశకాల పాత్రతల సమన్వయం : ఏ శాస్త్రపరిశీలన యందైనను, దేశము, కాలము, పాత్రతలు, ప్రాధాన్యం వహిస్తాయి. ఉదాహరణకు ఫలానా రోగానికి ఫలానా మందు ఉపయోగిస్తుంది అని నిర్ధారింపబడి ఉంటుంది. అయితే ఆ మందును వైద్యుడు ఆ రోగి అవస్థా భేదాన్ని బట్టి చంటిపిల్లలకు ఒకవిధంగాను పెద్దలకు మరో విధంగాను మోతాదు నిర్ణయిస్తాడు. ఆవిధంగావే గృహనిర్మాణంలో ఉష్ణదేశాలలో ఒక విధమగు శైలి శీతల ప్రాంతాలలో మరోవిధమగు శైలీ అవలంబించబడుతూ ఉంటుంది.

కాలం గడిచేకొద్ది కొన్ని సమయాలలో విపరీతమైన మార్పులు వస్తాయి. ఒక కాలంలో విధివిహితం అయిన నియమం మరికొంత కాలానికి నిషేధింపబడుతుంది. దాని స్థానే కాలానుగుణ్యమైన విషయం శాస్త్రబద్ధమై ఆచరణయోగ్యమై సమాజం చేత ఆమోదింపబడుతుంది. ఉదాహరణకు పూర్వకాలంలో రజస్వల అయిన కన్యకు వివాహం చేయడం నిషేధం. ఈనాడు రజస్వల కాకుండా వివాహం చేయడం నిషిద్ధం. ఆవిధంగావే పూర్వకాలంలో అవలంబించని శ్లాబు పద్ధతి ఈనాడు మనం అవలంబిస్తున్నాము. ఇది సర్వజనాంగీకారం. కాబట్టి శాస్త్రబద్ధం అయింది.

ఈవిధంగా పై వుదహరింపబడిన అంశాలను బాగా పరిశీలించి మన పూర్వ ఋషులచేత వాస్తుశాస్త్రాలు రూపొందింపబడ్డాయి. అంతేకాక మానవజీవితం మీద ఖగోళ గ్రహగతుల స్వభావానికే అత్యధికమైన ప్రభావం ఉంటుందని శాస్త్రవేత్తల అభిప్రాయం. అంతేగాని మానవజీవితంలో ఎదురయ్యే ఒడుదుడుకులన్నింటికి గృహమే మూలం అని ఈనాటి కొందరు "వృత్తిసిద్ధాంతులు" తమ తమ అనుభవమే గొప్పదని ఋషిప్రోక్తాలైన శాస్త్రాలు బూటకాలని చిలుక పలుకులు పలుకుతూ ప్రజల్ని మోసం చేస్తున్నారు. మన అనుభవం శాస్త్ర విజ్ఞానానికి సమన్వయపరచుకోవాలే గాని శాస్త్రమే బూటకం అనడం దురహంకారమే అవుతుంది. స్వార్థగంధం యేమాత్రము అంటని మనపూర్వ ఋషుల వాస్తుశాస్త్ర విజ్ఞానం లోకకల్యాణదాయకమైనది.

ఇట్టి పరిస్థితులలో అనేక శిల్పశాస్త్ర గ్రంథముల యందుగల గృహనిర్మాణ రహస్యములను ఒకచోట క్రోడీకరించుట అలవిగాని పని. ఏమందురా? మానవుని బుద్ధిబలము పరిమితమైనది. శాస్త్రవిజ్ఞానమా, అపార జలనిధి. అయినప్పటికి విజ్ఞాన సంపాదనమే ప్రధానాశయముగాను లోకకల్యాణమే పరమావధిగాను భావించి మాకుగల అల్పపరిజ్ఞానముతో మాయోపినంత వరకు శ్రమించి అనంతశిల్ప విజ్ఞాన సర్వస్వమనదగు "మయమతము" నందలి గృహనిర్మాణ విధులకు సంబంధించిన విషయములకు క్లుప్తముగా సంగ్రహించి, ఆ విషయములతో సందర్భానుసారముగా, అపమానసారము, వాస్తువిద్య, సమరాంగణసూత్రధారము, రాజితప్రుచ్ఛ, విశ్వకర్మ ప్రకాశిక, విశ్వకర్మ వాస్తుశాస్త్రము, శిల్పరత్నము, వాస్తురాజ వల్లభము, సకలాధికారము, వాస్తురత్నాకరము మొదలగు సంస్కృత గ్రంథముల యందలి విషయములతో సమన్వయపరచి ఈ "మయవాస్తు" అను గ్రంథమును ఆంధ్రపాఠక లోకానికి అందించుకొనుచున్నాము. సహృదయులగు పాఠకులు, వాస్తుశాస్త్రాభిమానులు, మా యీ ప్రయత్నమును ప్రోత్సహించి యిందలి మంచిని గ్రహించి దోషములను దయతో సూచించిన తృతీయ ముద్రణావకాశము లభించినచో సవరించుకొనగలము.

మరియు శ్రీకృష్ణవాస్తు, కాలామృతము, వాస్తుశాస్త్ర వివేకము 1,2,3,4 భాగములు, జ్యోతిర్వేదము మొదలగు ఆధునిక విజ్ఞానశాస్త్ర గ్రంథములు, ఇంకను అనేక పత్రికా వ్యాసములు, లోకకల్యాణమే పరమావధిగ పరిశీలించి మేము గ్రహించిన విషయములు

ఇందు పొందుపరచితిమి. ఇందు ఉటంకించిన ప్రతి శ్లోకము ప్రమాణ గ్రంథము నుండి గ్రహించినదే గాని మా స్వకపోల కల్పితమొక్కటియు లేదని సవినయముగా మనవి చేస్తున్నాము.

మతభేదములున్నచోట్ల ఆయా మతభేదములను గూర్చి విపులముగా చర్చించి ఆయా దేశకాలావసరములకు అనుకూలముగా ఏదోయొక పద్ధతి గ్రహించుట శాస్త్ర విహితమని మా అభిప్రాయమును మనవి చేస్తున్నాము. దేశకాలములు అవశ్యము అనుసరణీయము గదా! పఠితలు యిందలి మంచి చెడులను గ్రహించి మాకృషిని ప్రోత్సహింప ప్రార్థన. కోరినదే తడవుగా దయతో పీఠికలు వ్రాసియిచ్చిన బ్రహ్మశ్రీ ఎస్.ఎమ్.గణపతి స్థపతి గారికి, శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారికి కృతజ్ఞతాభి వందనములు. మరియు ఈ గ్రంథమును చక్కగా టైపు చేసి ఇచ్చిన మనోహరీశర్మలు **(కావ్యశ్రీ గ్రాఫిక్స్)** వారికి, ముద్రించియిచ్చిన పద్మశ్రీ ప్రింటర్స్ అధినేత శ్రీమతి పద్మావతి గారికి మా ధన్యవాదములు.

ఇట్లు

రచయిత

గోరస వీరభద్రాచార్యులు

# మహాదశా పారిజాతము

ఇది భార్గవనాడి, భృగు సంహిత, బృహత్ పరాశరహోర, బృహత్ సంహిత మొదలగు ఋషిప్రోక్తములైన అనేక ప్రాచీన గ్రంధములనుండి విషయములు సేకరించి క్రమ పద్ధతిలో అనేక దశాంతర్దశా ఫలితములు వివరించబడినవి. తెలుగులో ఇటువంటి గ్రంధము ప్రస్తుతమునకు రాలేదు.

మహాదశంతర్దశలు గుణించు పద్ధతి, మహాదశాంతర్దశా విదశల పట్టికలు, దశాంతర్దశలకు దానములు, శాంతి ప్రక్రియలతో పాటుగ శాస్త్రములో నిగూఢముగానున్న అనేక విషయములతో దశాంతర్దశలను ఏవిధంగా చూడాలో విశ్లేషించి , మహాదశల ఫలితములు, దశాంతర్దశలయందు గ్రహములిచ్చు ఫలితములు, వాటికి శాంతులు, రాశిననుసరించి ఉచ్ఛ, నీచ, స్వక్షేత్రము, భావముననుసరించి గ్రహముల ఫలితములు మహాదశలయందు అంతర్దశలయందు గ్రహములిచ్చు ఫలితములు, మహాదశలయందు అంతర్దశలయందు సాధారణ గ్రహములిచ్చు ఫలితములు వివరింపబడినవి. జ్యోతిష విద్యార్థులకు అత్యంత ఉపయోగమైన గ్రంధము, ఫలితములను చెప్పుటకు దశాంతర్దశలను ఫలితములను వివరించి ఎవ్వరైనను ఈ గ్రంధము ఆధారముగా చెప్పవచ్చును.

# పురోహిత దర్శని

పురోహితుడనగా పురమునకు సమాజమునకు హితముకోరు వ్యక్తి అటువంటి వ్యక్తి పంచాంగ విషయములు, జ్యోతిషము, వాస్తు ఇత్యాది విషయములన్నియు తెలిసిన వ్యక్తిగా ఉండాలి. పురోహితులకు తెలియని ఎన్నో విషయములు ఈ గ్రంథమున పొందుపరచ బడినవి. పురోహితుడు శాస్త్ర పరిపూర్ణుడైతే ఆ ప్రాంతములో ఉండేవారందరు సరైన పద్ధతులను అనుసరిస్తారు. కాబట్టి పురోహితుడు మానవోపయోగమైన శాస్త్ర పరిజ్ఞానం కలిగి ఉండాలి. ఉదాహరణకు వర్షం అంటాము కానీ ఆ వర్షము ఎలా వస్తుంది అనే విషయము చాలామందికి తెలియదు. అటువంటి అనేక విషయములు ఈ గ్రంథములో పొందుపరచ బడినవి. ఇది జాతకఫల గ్రంధము. నక్షత్రములు వాటి విభజన

వివరములు, జాతక చక్రము గుణించు ప్రాచ్య పాశ్చాత్య పద్ధతులు, పంచాంగ గణిత విధానము, కాలపురుషాంగ విభాగము, గ్రహముల శుభ పాప కారకత్వములు, రాశికారకత్వములు, భావకారకత్వములు, రశ్మిలు - ఫలితములు, తారాబలము, చంద్రబలము చూచు విధానము, జాతకమున యోగ స్థానము, ధూమాది అప్రకాశగ్రహ నిర్ణయములు, షోడశ వర్గ నిర్ణయము, స్త్రీ జాతక పరిశీలనలో ముఖ్య విషయములు, వివాహ కాలము, వైధవ్య ప్రాప్తి కాలజ్ఞానము, ఆయుర్దాయ నిర్ణయము, యోగములు వాటి ఫలితములు, వాస్తు విజ్ఞాన విషయములు, ధర్మ శాస్త్ర విషయములు మొదలగు 194 విషయములతో పురోహితులకు అత్యంత ఉపయుక్తమైన గ్రంథము. ప్రతి జ్యోతిష విద్యార్థివద్ద ఉండవలసిన గ్రంథము.

# వాస్తు విజ్ఞాన చంద్రిక

అనంత విశ్వంలో నివసించే ప్రతి ప్రాణికి గూడు అవసరము. పశుపక్ష్యాదులతోసహితంగా తాము నివసించే నివాసాన్ని ఆకర్షణీయంగాను, సుఖశాంతులతో ఉండేటట్లు నిర్మించుకుంటాయి. జ్ఞాన సంపన్నుడైన మానవుడు ఈ వాస్తును సుఖ సంతోషాలకోసం , అతీంద్రియ శక్తి సాధనకోసము అతి ప్రాచీన కాలంనుండి ఉపయోగించుకొంటున్నాడు, ప్రకృతిలోనున్న శక్తిని నిర్మాణ ప్రక్రియద్వారా ఒక నిర్దిష్ట ప్రదేశమున రూప కల్పన చేయడమే వాస్తు లక్ష్యం. దీనికి ఉదాహరణే ఈజిప్టులోని పిరమిడ్లు. వాస్తుశాస్త్రంతో నిర్మించిన ఇల్లు అందు నివసించే వ్యక్తులకు శారీరక మానసిక బలమును చేకూరుస్తుంది. ఆనందంకోసం సశాస్త్రీయమైన వాస్తును అవలంబించడం ఎంతైనా అవసరం. వాస్తుశాస్త్రంలో కలిగే ప్రతీ సందేహానికి శాస్త్రీయమైన రీతిలో సమాధానం ఇవ్వడమే లక్ష్యంగా ఈ గ్రంథం రూపొందించ బడింది. ఇందులోనున్న విషయాలననుసరించి మానవుని ఆలోచన సాగాలని, వాస్తుఅంటే మూఢనమ్మకంగాదని గ్రహించాలి. ఈ గ్రంథములో వాస్తులో చాలామందికి తెలియని అనేక వివరణలులేని ప్రశ్నలకు సమాధానాల ఇవ్వబడ్డాయి. వాస్తును సైన్సుతో సమన్వయిస్తూ విషయాలు వివరించ బడినవి. వాస్తుఅంటే మూఢనమ్మకంగాదని ఈ గ్రంథంద్వారా తెలిసికొనవచ్చును.

## నక్షత్ర పారిజాతము

ఈ గ్రంథములో నక్షత్రాలకు సంబంధించిన అనేక వివరణలు అందరికి తెలిసే రీతిలో వివరించబడినవి. ఇందు ఏసమయమున చంద్రుడు ఏ నక్షత్రమున ఏ అంశయందుండగా ఆజీవి ఏ లక్షణములతోనుండునో మధ్యమ ప్రమాణముగా పూర్వ శాస్త్రాను సారముగా వివరించబడినది. మరియు చంద్రుడు ఆయా నక్షత్రములయందుండగా చేయవలసిన పనులు, ఆ నక్షత్రములకు సంబంధించిన అధిదేవతాది సమస్త వివరములను సుబోధకముగా వివరించబడినవి. ఏ నక్షత్రమునకు ఏవి శుభనక్షత్రములు ఏవి అశుభ నక్షత్రములు మొదలగు విషయములు వివరించబడినవి. సంస్కృతమునందుగల అపారమైన శాస్త్రమునుండి కొన్ని విషయములు గ్రహించి తెలుగున ఇటువంటి గ్రంథము లేనందువలన ప్రజోపయోగముగ వ్రాయబడినది. నక్షత్రములకు సంబంధించిన సమస్త విషయములు సంగ్రహముగా వివరించబడినవి.

## లగ్న పారిజాతము

ఇందు లగ్నమునకు శుభ పాప గ్రహములు, లగ్న ఫలితములు, నవాంశ ఫలితములు వివరించబడినవి. తేదీలయందు పుట్టినవారి ఫలితములుకూడ తెలుపబడినవి. లగ్న ద్రేక్కాణ ఫలితములు, చంద్రుడు ఆయా రాశులయందున్నపుడు కలుగు శుభాశుభ ఫలితములు ఇవ్వబడినవి.

## పంచాంగము - 2000- 2025

ఇందు రోజువారి తిథి, వార, నక్షత్ర, యోగములు, కరణము గ్రహించు విధానము, రాజాది నవనాయకులు, గ్రహణములు, రాజపూజ్యావమానములు, కందాయఫలితములు, గ్రహ ప్రవేశములు, కార్తులు, వర్జ్యము కనుగొను విధానము, దుర్ముహూర్తముల పట్టికలు, మౌఢ్యమి మొదలగు అనేక విషయములు ఇవ్వబడినవి. పంచాంగ గణితమునకు కావలసిన విషయములన్నియు కలవు.

ఓం

శ్రీ గణేశాయ నమః

శ్రీ గాయత్రీ దేవ్యై నమః

# మయ వాస్తు

## మంగళాచరణమ్

"యః కర్తా జగతాం భర్తా సంహర్తా మహసాం నిధిః
ప్రణమామి తమాదిత్యం బహిరంతస్తమోవహమ్"

అఖిల జగత్తునకు ప్రభువైనవాడును, బహిరంతరముల యందలి అజ్ఞానాంధకారమును బోగొట్టువాడును, సృష్టికర్తయునగు ఆదిత్యునకు నమస్కారములు.

"తప్త చామీక రాభాయ వహ్నయే విశ్వ కర్మణే
నమస్తమోభి నిఘ్నాయ రుచయే లోక సాక్షిణే"

కాచబడిన బంగారము వంటి కాంతి గలవాడును, అగ్ని స్వరూపుడును, అంధకారమును పారద్రోలువాడును, కాంతి స్వరూపుడును, లోకమునందలి సమస్త జీవులయొక్క కర్మలకు సాక్షీ భూతమైనవాడును, విశ్వకర్మయునగు ఆదిత్యునకు నమస్కారములు.

"వేదశ్చ లోకమాతస్యా ద్గాయత్రీ వేదమాతృకా
జాతాసౌ దేవతా నామ్నా విశ్వకర్మేతి కీర్తితా"

వేదము లోకమాతయని కీర్తింపబడుచున్నది. లోకమాతయగు వేదమునకు మాతృమూర్తి గాయత్రి. అట్టి పరదేవతయగు గాయత్రికిని ఆదిత్య స్వరూపుడగు విశ్వకర్మునకు భేదము లేదని శ్రుతులు వక్కాణించుచున్నవి.

"వాస్తోష్పతి ర్విశ్వకర్మా విశ్వశిల్ప క్రియాధిప:
స ఏవ వాస్తు పురుషో వాస్తో: పూరుషకారణాత్.
విశ్వ మంగళ మాంగళ్య విశ్వ విద్యా వినోదినే
విశ్వ సంసార బీజాయ నమస్తే విశ్వకర్మణే
విశ్వాయ విశ్వరూపాయ నమస్తే విశ్వమూర్తయే
విశ్వమాతా పితారూప విశ్వకర్మ నమోస్తుతే".

వాస్తోష్పతి యనగా విశ్వకర్మ. విశ్వకర్మయే వాస్తుపద స్థాపకుడును, విశ్వ శిల్ప క్రియాధిష్ఠాన దేవతయు అగుచున్నాడు. అట్టి విశ్వశిల్ప క్రియాధిపత్యము చేతనే విశ్వకర్మ వాస్తు పురుషుడుగా కీర్తింపబడుచున్నాడు. వాస్తు పురుష స్వరూపుడగు అట్టి విశ్వకర్మయే "విశ్వకర్మాసహస్రాంశో" అను ప్రమాణము చేత ఆదిత్యుడుగాను, ప్రాణకోటికి ప్రత్యక్ష దైవముగాను భాసింపుచు, మహర్షుల చేత ఆరాధింపబడుచున్నాడు. అట్టి విశ్వకర్మకు నమస్కారములు.

లోక కల్యాణ కారకుడును, విశ్వవిద్యా వినోదియు, విశ్వోత్పత్తికి బీజభూతమైనవాడును అగు విశ్వ కర్మకు నమస్కారములు. సమస్త విశ్వము తానుగా, తానే ఈ విశ్వముగా ప్రకాశించువాడును విశ్వరూపుడును, విశ్వమునకు తల్లియు దండ్రియునై గాయత్రీ విశ్వకర్మలుగ లోకమున కీర్తింపబడుచున్న ఆదిత్య స్వరూపుడగు విరాట్ విశ్వకర్మకు నమస్కారములు.

"శిల్పాచార్యాయ దేవాయ నమస్తే విశ్వ కర్మణే
మనవే మయాయ త్వష్ట్రేచ శిల్పిన్ దైవజ్ఞతే నమ:"

జగచ్ఛిల్పాచార్యుడవైన ఓ విశ్వకర్మ ప్రభూ నమస్కారములు మను, మయ, త్వష్ట, శిల్పి, దైవజ్ఞ స్వరూపుడవగునో దేవా ! నీ కొఱకు నమస్కారములు.

"మనుర్మయ తథాత్వష్టా శిల్పీ విశ్వజ్ఞ ఇత్యపి
విశ్వకర్మ సుతాహ్యేతే పంచసృష్టి ప్రవర్తకా:"

జగచ్ఛిల్పియగు విరాడ్విశ్వకర్మ యందు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులను

పంచశిల్ప ఋషులావిర్భవించి, సమస్త శిల్ప క్రియాధిష్ఠాన దేవతలై మానవశిల్ప ఋషి గణములకు కూటస్థ పురుషులైరి. అట్టి ఆద్యశిల్ప ఋషిశ్రేష్ఠులకు నమస్కారములు.

"త్రిపురపుర త్రయరచనా యత్కారయోః కర్మచాతురీ జాతాః
శిల్పివరం తం దనుజై రర్చిత చరణం మయం వందే"

మను, మయాదిశిల్ప ఋషులు కూటస్థ పురుషులుగా జగత్తున పరిఢవిల్లిన శిల్పగణములలో పురాణ ప్రసిద్ధుడగు "మయుడు" అపర విశ్వకర్మావతారుడు. ఈతడే త్రిపురాసురులకు శత్రు దుర్భేద్యమగు పురత్రయమును నిర్మించి యిచ్చి తన శిల్ప విజ్ఞాన మజేయమైనదని ఋజువు చేసిన శిల్పముని. అట్టి ఈ మయుడే 'మయబ్రహ్మ'గాను, 'మయ విశ్వకర్మ'గాను లోకమున కీర్తింపబడుచున్నాడు. అట్టి మయబ్రహ్మకు నమోవాకములు.

"విశ్వకర్మ సమారంభాం విశ్వరూపార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్"

మరియు

ఆద్యశిల్పి ఋషి సంప్రదాయమును జగత్తునందు వ్యాపింపచేయుటకై అనేక పరిశోధనలు జరిపి ఆయా పరిశోధనా ఫలితములను గ్రంథరూపమున భావితరముల కందించిన ప్రాచీన శిల్ప ఋషులగు భృగువు, అత్రి, వశిష్ఠుడు, నారదుడు, నగ్నజిత్తు, అగస్త్యుడు, శుక్రుడు, బృహస్పతి, నంది, అగ్ని మొదలగు శిల్పాచార్యులకు నమశ్శతములు.

ఇంకను ఆధునికులగు సమస్త శిల్ప శాస్త్రకోవిదులకు వందనమాచరించి లోకహితమే పరమావధిగా ఈ "మయ వాస్తు" అను సంకలన గ్రంథరచన కుపక్రమించుచున్నాము. ఆ జగచ్ఛిల్పియగు విశ్వకర్మ భగవానుని ఆశీస్సుల మా ప్రయత్నమును సఫలీకృతమొనర్చి లోకకల్యాణ కారకముగా ఈ గ్రంథమును రూపొందించుగాక.

లోకాస్సమస్తాః సుఖినో భవంతు.



# మయుడు

"మనుర్మయస్తథా త్వష్టా శిల్పీ విశ్వజ్ఞ ఏవచ
పంచైతే దేవ ఋషయో విశ్వకర్మముఖోద్భవా:"
(స్కాంద పురాణము)

వేద ప్రతిపాదితుడైన విరాట్ పురుష స్వరూపుడగు, విశ్వకర్మ యొక్క అయిదు ముఖముల నుండి అయిదుగురు శిల్పబ్రహ్మలు ఆవిర్భవించిరి. వారే మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులను వారు. ఈ మను మయాది శిల్ప ఋషులు కృతయుగము నందలి మానవ శిల్పగణములకు కూటస్థ పురుషులై

"గృహం యంత్రం రథో భూషా: ప్రతిమా వసనాదికం
యత్కించిత్ దృశ్యతే శిల్పం తత్సర్వం విశ్వకర్మజమ్"

అను పద్మపురాణ వచనము ననుసరించి మానవ సుఖ జీవనమున కవసరములగు గృహము, యంత్రములు, రథములు, భూషణములు, శిల్పములు, వస్త్రాద్యలంకారములు, వేయేల కంటికి కనుపించు శిల్ప కార్యమంతయు విశ్వ కర్మీయమైనదేనని చాటి చెప్పుచు లోకహితమే పరమావధిగా గల శిల్పాచార్యులను జగత్తున వర్ధిల్లజేసిరి.

ఈ పైనుదహరించిన పంచ బ్రహ్మలలో ద్వితీయుడైన మయబ్రహ్మ వంశమునందు "మయవిశ్వకర్మ" యని ప్రసిద్ధిబొందిన శిల్పఋషి యవతరించెను. అది కృతయుగమునకును, త్రేతాయుగమునకును సంధికాలము. ఆ కాలమున -

"బ్రహ్మణోర్థేకృతం దివ్యం దివియద్విశ్వకర్మణా
విమానం పుష్పకంనామ సర్వరత్న విభూషితమ్"

అని వాల్మీకి రామాయణమున ప్రశంసింపబడిన పుష్పక విమానము మొదట బ్రహ్మదేవుని కొరకు మయవిశ్వకర్మ చేత నిర్మింపబడి, రామాయణ కాలము నాటికి బ్రహ్మ

సంతతివాడైన రావణబ్రహ్మకు వాహనమై లంకాపురి చేరినది. ఈ మయవిశ్వకర్మ ముద్దులపట్టి మండోదరి రావణుని పట్టపు రాణియై మహాపతివ్రతగా కీర్తింపబడుచున్నది.

ఈ మయవిశ్వకర్మయే త్రిపురాసులకు శత్రు దుర్భేద్యములగు త్రిపురములను నిర్మించి యిచ్చి అద్భుతమగు వాస్తు విద్యా నైపుణ్యమును లోకమున నిల్పిన మహనీయ మనీషి. అట్టి ఈ మయవిశ్వకర్మ వంశమునందు జనించిన శిల్పఋషివరేణ్యు లనేకులు వంశపారంపర్యముగా తమకు సంక్రమించుచూ వచ్చిన శిల్ప విజ్ఞానముతో లోకహితార్థముగా మానవ కల్యాణమే పరమావధిగా అహర్నిశలు పరిశ్రమించుచు అనేక క్రొత్తక్రొత్త శిల్ప రహస్యములను పరిశోధనా పూర్వకముగ రూపొందించి, ఆయా శిల్ప రహస్యములను భావి తరముల వారికి శిల్ప గురుకులముల ద్వారా శిష్య ప్రశిష్య పరంపరగా నందించుచూ వచ్చిరి.

ద్వాపర యుగమున ఈ విశ్వకర్మ వంశీయులగు శిల్పఋషి గణములయందు మరియొక "మయవిశ్వకర్మ" ఆవిర్భవించినాడు. ఈతడు మహా తపస్సంపన్నుడు. మహాకవి. "అహం హి విశ్వకర్మావై దానవానాం మహాకవి:

అని తమ్ము ఈ మహర్షి చెప్పుకొనినట్లు వ్యాసమహర్షి తన మహాభారతమున వివరించినాడు. ఈ కాలమున సాటిలేని ఖగోళ శాస్త్రవేత్త ఈనాటి పాశ్చాత్య వైజ్ఞానికులకు మార్గదర్శకముగా నిలచియున్న "సూర్య సిద్ధాంతము" అను ఖగోళ శాస్త్రమును రచించిన దీ మయవిశ్వకర్మయే. ఈతడు వంశ పరంపరాగతముగా తనకు సంక్రమించిన శిల్పవిజ్ఞాన వృక్షమును మూడు పూవులారు కాయలుగా పరిఢవిల్లజేసిన శిల్ప విజ్ఞాన నిధి. ఈ మహామనీషియే లోకమున "మయుడు" అను పేరుతో జగత్ప్రసిద్ధుడైనాడు.

ఈ శిల్పఋషి ఆశ్రమస్థానము "ఖాండవ వనము". అందీ మహనీయుడు అనేక శిల్ప పరిశోధనాగారములను స్థాపించి అనేకులగు శిల్పవరేణ్యుల సహకారముతో క్రొత్త క్రొత్త శిల్ప రహస్యములను ఛేదించి పరిశోధనలు సాగించినాడు. ఆయా శిల్ప పరిశోదనా ఫలితములను "మయమాయ", "మయజయము", "మయతంత్రము" అను గ్రంథములుగా రూపొందించి భావి తరముల వారికొఱకు భద్రపరచిన అప్రతిహత అస్త్ర శస్త్రాద్యనేక చిత్ర విచిత్ర యంత్ర శిల్ప నిర్మాణ శేముషీ దురంధరుడీ మయుడే.

కాని ద్వాపర యుగాంతమున ప్రపంచమున రాజకీయ కుతంత్రములు అధికము కాజొచ్చినవి. ఆర్యావర్తమున గూఢ కుటిల రాజనీతి పాటమరించినది. అప్రతిహత

అస్త్రశస్త్రాద్యాయుధ నిర్మాణ దక్షుడైన మయుడు ఎవ్వరి ననుగ్రహించునో అని రాజకీయ లోకమున భయమావహించింది. తత్ఫలితముగ "ఖాండవ వనము" దహింపబడినది. శిల్ప పరిశోధనాగారములు, శిల్ప విజ్ఞాన భాండారములు తగులబడిపోయినవి. ఈ హఠాత్ పరిణామమునకు విశ్వేష్ఠులగు శిల్పాచార్యులు కొందఱు - మయుని అనుమతి బొంది బూడిదపాలై పోగా, మిగిలిన శిల్ప శాస్త్రములను వెంటగొని దేశమును విడిచి నలు దిశలకు వలసబోయిరి. మరికొందరు దేశాభిమానమును విడువలేక శిల్పనగరమును నిర్మించుకొని దాని చుట్టును అయస్కాంత శిలామయమగు శత్రు దుర్భేద్య ప్రాకారము నిర్మించుకొని సుఖ జీవనమును గడుపసాగిరి.

ఖాండవవన దహనానంతరము మహాభారత కథ కీలకమైన "మయసభా భవనము" నిర్మింపబడినది. ఈ మయసభా భవనమున ప్రదర్శితమయిన చిత్ర విచిత్ర మాయామయ యంత్ర శిల్ప నిర్మాణ నైపుణ్యమును వ్యాసమహర్షి భారతమున వర్ణించియే యున్నాడు. ఆనాటినుండి నేటివరకు వెలువడిన సమస్త పురాణేతిహాసముల యందు మయుని అనల్ప నిర్వికల్ప శిల్పకల్పనా చాతుర్యము వేనోళ్ల కొనియాడబడుచునే యున్నది.

అట్టి మయునిచే విరచితములగు గ్రంథములు మయమాయ, మయజయము, మయతంత్రము, మయవాస్తు, మయమతము, మయశిల్పము, మయరత్నము, మయదీపిక మయ విద్యాప్రకాశిక అనునవి సుప్రసిద్ధములు. కాని యిందుకొన్ని గ్రంథములు నామమాత్రావశిష్టములై యున్నవి. మరికొన్ని అముద్రితములై తాళపత్రములుగా గ్రంథాలయములలో మరుగున పడియున్నవి. మయమాయ, మయజయము అను రెండు గ్రంథములను, శిల్ప శాస్త్రములకు ఆయువుపట్టగు అథర్వ వేదమును జర్మను దేశీయులు తమ దేశమునకు తరలించుకొని పోయిరని జనాపవాదము కలదు. అందుకు నిదర్శనముగా అథర్వవేదము మొట్టమొదట జర్మను దేశమునందే ప్రచురింపబడినది. మయుని రచనలలో ఉత్తమమగు వాస్తుశాస్త్ర గ్రంథము భారతీయుల అదృష్టవశమున 1919 సంవత్సరమున త్రివేంద్రములో నాగరి లిపియందు ముద్రింపబడినది. కాని ప్రస్తుతమాప్రతియు అలభ్యము.

మయ వంశీయులు కొందరు రామాయణ కాలమునకు ముందుగానే పాతాళమునకు అనగా నేటి దక్షిణ అమెరికా ప్రాంతమునకు వలసబోయినట్లు ఉత్తర రామాయణమున వివరింపబడినది. ఖాండవ దహనానంతరము దేశమును విడిచిపోయిన కొందరు శిల్పాచార్యులు తమ పూర్వీకుల ననుసరించి పాతాళమునకు బోయిరి. అచ్చటి "మెక్సికో"

ప్రాంతమున గల నేడు "చిషెన్ఇజా" అని పిలువబడు ప్రాంతముననొక శిల్పనగరమును నిర్మించుకొని తమ తమ యనుచర శిల్పగణములతో నివసింపసాగిరి. నేటికిని అమెరికా ప్రజలు ఆ "చిషెన్ఇజా" ప్రాంతీయ ప్రజలను "మీయ" జాతిప్రజలుగా పిలుచుచున్నారు. ఈ మయజాతి ప్రజల సంస్కృతీ ప్రాభవమును చాటిచెప్పు జయపతాకలుగా ఆనాటి ప్రాచీన శిల్ప నిర్మాణ శిథిలములు నిలిచియున్నవి.

జగచ్ఛిల్పియగు విశ్వకర్మకు సూర్యునికి భేదము లేదని చదివియుంటిమి. కావుననే ఈ మయజాతి ప్రజలకు సూర్యుడు ఆరాధ్యదైవమయినాడు. ఈ మయజాతి ప్రజలకు పరమ పవిత్రమగు తీర్థస్థానము. "చిషెన్ఇజా" అక్కడ తమ ఆరాధ్య దైవము సూర్యదేవుని సంప్రీతికై నిర్మించిన "పిరమిడ్" వలె గోచరించు సూర్యదేవుని ఆలయము, వరుణాలయము, వేయి స్తంభాల ప్రాసాదము, ఆయా నిర్మాణముల శిల్పవైచిత్రి గమనించినచో ఆనాటి మయజాతి ప్రజల వాస్తు, గణిత, జ్యోతిషశాస్త్రాల పాండిత్య ప్రతిభకు శిలారూప సాక్ష్యాలుగా దర్శనమిస్తుంది.

దక్షిణాదికి వలసబోయిన శిల్పాచార్యులు పశ్చిమ తీర ప్రాంతముననొక శిల్ప నగరమును నిర్మించుకొనిరని చదివియుంటిమి. కాలక్రమమున ఆ శిల్పనగరముననే స్కాంతరాతికోటయని ప్రసిద్ధి కలిగినది. ఇచ్చటగూడ వీరిని దుర్విధి వెంటాడినది. ఈర్ష్యాళువులైన కొందరి కుట్ర ఫలితముగా ఒక మాయోపాయముచే ఆ శిల్పనగరము దహింపబడినది. అర్ధరాత్రి ఆకస్మికముగా జరిగిన ఈ దాడికి గురియయిన శిల్పాచార్యులు చేయునది లేక తమ తమ శిల్ప శాస్త్ర గ్రంథములతో రహస్య మార్గమున బయటబడి చీనా, జపాన్, మంగోలియా, జర్మనీ దేశములకు పారిపోయిరి. శిల్పులు పరంపరాగతముగా చెప్పుకొను ఈ ఐతిహ్యము "పరిమళచోళ చరిత్ర" యను గ్రంథమున వివరింపబడినది.

ఈ విధముగా మయ వంశీయులగు శిల్పాచార్యుల అనేక కుట్రలకు కుతంత్రములకు లోనగుచు లోకహితార్థము తమ తమ శిల్ప విజ్ఞాన విధులగు గ్రంథములను కాపాడుకొనుచూ వాటిని భావి తరములవారికి అందచేయుచునే యుండిరి. అట్టి గ్రంథములలో "మయమతము" వాస్తు శాస్త్రములకే మకుటాయమానమైనది. ఈ "మయమతము" మయ వంశీయులకే గాక యావత్ భారతజాతికి గర్వకారణమై లోక హితార్థము ఆ విశ్వకర్మ భగవానునిచే ప్రసాదింపబడినది.

# మయవాస్తు

మయముని ప్రణీతమగు "మయమతము" వాస్తు గ్రంథమాలయందు నాయకమణి వంటిదని వెనుకటి ప్రకరణమున వివరింపబడినది. అట్టి మయమతము యొక్క గ్రంథారంభమున -

"ప్రణమ్య శిరసాదేవం సర్వజ్ఞం జగదీశ్వరం
తంప్రష్ట్వాస్మాదలంకృత్వా శాస్త్రిశాస్త్రం యథాక్రమమ్
తైతిలానాం మనుష్యాణాం వస్త్వాదీనాం సుఖోదయమ్
ప్రాజ్ఞోమునిర్మయః కర్తా సర్వేషాం వాస్తు లక్షణమ్"
"పితామహాద్యైరమరైర్మునీశ్వరైః
యథాయథోక్తం సకలం మయేనతత్
తథాతథోక్తం సుధీయాం దివౌకసాం
నృణాంచ యుక్త్యాఖిల వస్తు లక్షణమ్"

సర్వజ్ఞడగు జగదీశ్వరునకు శిరసాప్రణామ మాచరించి ఆ పరమేశ్వర కృపా ప్రసాదలబ్ధమగు విజ్ఞానప్రతిభతో లోకహితార్థముగా సమస్త ప్రాణులకు సుఖము ప్రసాదించునట్టి వాస్తు శాస్త్రము రూపొందించెను. మరియు పితామహుడు మొదలగు ఆద్యశిల్పముని ప్రోక్తములైన శాస్త్ర విధులన్నియు వారు చెప్పిన రీతిగనే మయునిచేత దేవమానవ కల్యాణ ప్రదములగునవి ఈ గ్రంథమున పొందుపరచబడినవి - అని మయుని చేత వ్యాఖ్యానింపబడినది. అనగా మానవ జీవితమునకు సుఖమయ మొనర్చుటయే వాస్తు శాస్త్రముల లక్ష్యమని పండితార్థముగా చెప్పబడినది.

కావట్టి అట్టి విశిష్ట లక్ష్యముగల "మయమతము" వాస్తు శాస్త్రమనుటలో వివాదమునకు

తావులేదు గదా! ఇక ఆ మయమతమునందలి వాస్తు శాస్త్ర విషయములను ముఖ్యాంశముగా గ్రహించి అక్కడక్కడ ఇతర ఋషుల అభిప్రాయములను సమన్వయ పూర్వకముగా ప్రతిపాదించుచు గృహనిర్మాణ విధులను క్రోడీకరించిన ఈ సంకలన గ్రంథమునకు "మయవాస్తు" అనుపేరు సార్థకమగుచున్నది.

వాస్తు శాస్త్ర గ్రంథములలో ప్రామాణిక గ్రంథమగు ఈ మయమతమును గూర్చి కొంత వివరింపవలసి యున్నది. ఆంధ్రదేశమున యింతవరకు ఈ ప్రామాణిక వాస్తుగ్రంథము ప్రకటింపబడలేదు. ఇందలి అమూల్యములైన నిర్మాణశాస్త్ర రహస్యములు ఆంధ్రప్రజలకు అందుబాటులో లేవు.

చాలాకాలము క్రిందట 1916వ సంవత్సరమున మద్రాసునందలి వావిళ్ళ ప్రెస్సువారిచే 33 పేజీలు గల "మయవాస్తు" అను గ్రంథము వెలువడినది. కాని అందలి విషయము శిల్పప్రధానమైనది. తదుపరి 1919వ సంవత్సరమున త్రివేంద్రమున నాగరిలిపియందు "మయమతము" ప్రచురింపబడినది. కాని ఆ ప్రతులును అలభ్యములే. అందలి అపురూపములగు వాస్తుశాస్త్ర రహస్యములును ఆంధ్రప్రజలకు అపరిచితములు.

1966వ సంవత్సరమున తంజావూరు శ్రీ శరభోజీ గ్రంథాలయమువారు మద్రాసు ప్రభుత్వమువారి సహాయముతో మూలము గ్రంథలిపియందును, టీక తమిళమునందును ముద్రించి ప్రకటించియున్నారు. ఇది 34 అధ్యాయములు గల గ్రంథము. 1 నుండి 25 వరకు గల అధ్యాయములు ప్రథమ భాగము, 26వ అధ్యాయము నుండి 34వ అధ్యాయము వరకుగల గ్రంథము రెండవభాగము. ఈ రెండవ భాగమునందే గృహనిర్మాణ విధులన్నియు కూలంకషముగా చర్చించబడినవి.

ఇట్టి "మయమతము" నందలి అమూల్యములైన గృహవాస్తు విశేషములను ఆంధ్రప్రజానీకమునకు మా ఓపినంత వరకు అందించు యుద్దేశముతో ఈ సంకలన గ్రంథరచన కుపక్రమింపబడినది. ఈ సంకలనమునందు మయమతమునందలి వాస్తు విషయములకు మానసారము, సమరాంగణము మొదలగు గ్రంథప్రమాణములు సమన్వయింపబడి ఉదాహరింపబడినవి.

మానసారము, సమరాంగణము, అపరాజిత పృచ్ఛ, సకలాధికారము, శిల్పరత్నము మొదలగు గ్రంథములన్నియు వాస్తుశాస్త్రములలో పేరొందిన ప్రామాణిక గ్రంథములు అయినప్పటికిని మయమతము వీటన్నిటి కంటె ప్రాచీనము. సమగ్ర విషయ ప్రతిపాదితము.

సార్వకాలిక ప్రమాణసిద్ధమునై విలసిల్లినది. అందలి విషయములు వైజ్ఞానిక సత్యములై ఈనాటి పాశ్చాత్య విజ్ఞానవేత్తలకు సైతము అంతుబట్టని రహస్యములై అలరారుచున్నవి. కాబట్టి ఈ "మయవాస్తు" వను సంకలనము నందు సందర్భానుసారముగా అక్కడక్కడ శ్లోకముల నుదహరించుచు మిగిలిన విషయమును సుబోధకమగుటకు వచనమున వివరింపబడుచున్నది.

అక్కడక్కడ మానసారాది ప్రామాణిక వాస్తుగ్రంథముల నుండియు విషయములు గ్రహించి పొందుపరచబడినవి. మరికొన్ని సందర్భములలో మయమతమున ప్రస్తావింపబడనట్టియు మయమతాభిప్రాయమునకు విరుద్ధము గాకుండ తరువాతి శిల్ప ఋషులచేత ప్రతిపాదింపబడినట్టియు వాస్తు విశేషములను ఆయా ఋషుల పేరుననే వివరింపబడినవి. మరియు అక్కడక్కడ దేశకాల పాత్రతల దృష్టినందుంచుకొని శాస్త్ర వచన విరుద్ధముగాని రీతిలో సమన్వయ పద్ధతులు సూచనగా వివరింపబడినవి.

ఈ సంకలనమునందు క్రోడీకరింపబడిన విషయములన్నియు శాస్త్ర ప్రతిపాదితమైనవి. ఇందలి ప్రతిశ్లోకము ప్రామాణిక గ్రంథముల నుండి సంకలనము చేయబడినవి. శాస్త్రమునందలి గౌరవముతో లోకహితమే పరమార్థముగా ఆ జగత్పితరులకు గాయత్రీ విశ్వకర్మల సంకల్పము మేరకు ఈ "మయవాస్తు" వను వాస్తుశాస్త్రము రూపొందింపబడినది.

"కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన"



# వాస్తుశాస్త్ర నిర్వచనము

గృహనిర్మాణ విధులను నిర్మాణాత్మకమగు పద్ధతిలో వివరించు శాస్త్రమునకు వాస్తుశాస్త్రమను పేరు సిద్ధించినది. ఈ వాస్తుశాస్త్రము యొక్క నామ సార్థకతను గూర్చి మయుడు -

"అమర్త్యాశ్చైవ మర్త్యాశ్చ యత్రయత్ర వసంతిహి
తత్ వస్త్వితి మతంజ్ఞేయం తద్భేదంచ వదామ్యహమ్
భూమి ప్రాసాదయానాని శయనంచ చతుర్విధమ్
భూరేవ ముఖ్యవస్తుస్యాత్ తత్రజాతాని యాని హి
ప్రాసాదాదీని వాస్తూని వస్తుత్వాత్ వస్తు సంశ్రయాత్
వస్తూన్యేన హితాన్యేన ప్రోక్తాన్యస్మిన్ పురాతనైః ॥"

అని వివరణ యిచ్చియున్నాడు. ఆ మయమతానుసారము - దేవతలుగాని, మానవులు గాని నివసించు స్థలమునకు "వస్తువు" అని పేరు సిద్ధించుచున్నది. భూమి ప్రాసాదము, యానము, శయనము అను నాలుగు వస్తుభేదములు గలవు.

**భూమి** : భూమి అనగా మనము నివసించు గృహాది నిర్మాణముల కొఱకు గ్రహించి ప్రాకారాదులు ఏర్పరచుకొన్న కొంత పరిమితికి లోబడిన స్థలము.

**ప్రాసాదము** : ప్రాకారాదులు లేదా సరిహద్దులు యేర్పరచుకొన్న నివాసస్థలమునందు తమతమ అర్హతలకు అనుగుణముగా నిర్మించిన గృహ, సౌధ అట్టాలికాది నిర్మాణములకు ప్రాసాదము అని పేరు.

**యానము** : గృహస్థుడు ప్రయాణసాధనములుగా నుపయోగించు రథములు, బండ్లు, విమానములు, నీటిపై పయనించు ఓడలు మొదలగునవన్నియు యానము అనబడును.

**శయనము** : గృహస్థుడు సుఖజీవనము గడుపుటకై అవసరములగు మంచములు, కుర్చీలు, సోఫాలు మొదలగు వస్తు సముదాయమునకు శయనము అను పేరు చెల్లును.

ఈ నాలుగు విధములైన వస్తువులలోను మొదటిదగు భూమి మిగిలిన మూడింటికి ఆధారభూతమైనదగుచున్నది. అందుచేతనే -

"భూరేవ ముఖ్యవస్తుస్యాత్ తత్రజాతా నియానిహి" అని మయుడు స్పష్టపరచి యున్నాడు. అట్టిభూమికి "వస్తువు" అను పేరు సిద్ధించుచున్నది. ఆ "వస్తువు" నందు నిర్మించిన గృహసౌధ హర్మ్యాది నిర్మాణ విశేషములకు "వాస్తువు" అను సార్థక నామమేర్పడినది. ఆయా వస్తు వాస్తువులకు సంబంధించిన విధులను శాసించిన శాస్త్రమునకు వాస్తుశాస్త్రము అను పేరు లోకమున స్థిరపడి బహుళవ్యాప్తి నొందినది.

ఈ వాస్తుశాస్త్ర నిర్వచనము మరియొక విధముగ కూడ చెప్పుచుండుట గలదు. సంస్కృత భాషయందు "వస" ధాతువునకు నివసించు అను అర్థము గలదు. అందుచే -

"వసంతి ఇతివాస్తు:" అనగా నివాస స్థలమునకు వాస్తువు అనుపేరు గలదు. ఈ నిర్వచనము గూడ పైనుదహరించిన మయుని వాక్యములను బలపరచుచున్నవి గదా!

ఆగమశాస్త్రములు వేదములంతటి ప్రాచీనములని ఆర్యఋషుల యభిప్రాయము. అందుచేతనే -

"వైదికీ తాంత్రికీచైవ ద్వివిధా శృతికీర్తితా:"

అని శ్రుతులు రెండు విధములుగా చెప్పబడినవి. అట్టి ఆగమ శాస్త్రములయందు కూడ క్రియాపాదము నందు ఆలయ నిర్మాణ గృహనిర్మాణ వాస్తు పూజా శిల్ప విశేషాదులు నిరూపింపబడినవి. అట్టి వివరమంతయు వాస్తు లక్షణముగా పేర్కొనబడియున్నట్లు తెలియుచున్నది. కావున ఆద్యశిల్ప ఋషి ప్రోక్తమగు మయమతానుసారము గృహాది నిర్మాణ శాస్త్రమునకు వాస్తుశాస్త్రమనుట పొసగినదియున్నది.

# గృహనిర్మాణ ప్రయోజనము

మానవ జీవితము బాల్యము, యౌవనము, కౌమారము, వృద్ధాప్యము అను నాలుగు అవస్థలు పొందును. ఈ నాలుగు అవస్థలు గల మానవ జీవితమునకు నాలుగు ఆశ్రమములు విధింపబడినవి. అవి బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము అనునవి. ఇందు గృహస్థుడే మిగిలిన మూడు ఆశ్రమము లందున్న వారికి ఆధారభూతుడు. ఉత్తమ గృహస్థునకు గృహమే ధర్మ, అర్థ,కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థసాధన మగుచున్నది. అట్టి గృహస్థునకు "స్వంత గృహము" లేనిచో -

"గృహస్థస్య క్రియాః సర్వాః, నసిద్ధ్యన్తి గృహం వినా
పరగేహే కృతాః సర్వాం, శ్రౌతస్మార్త క్రియాః శుభాః
నిష్ఫలాస్యుః యతస్తాసాం, భూమీశః ఫలమశ్నుతే".

గృహస్థుడు చేయు సమస్త శ్రౌత స్మార్త కర్మలయొక్క ఫలితము అతడు యెవరి యింటియందు చేయునో వారికే చెందునని శాస్త్ర వచనము. గృహస్థుడు తనకు "నాది" అను సొంత యిల్లు లేనివాడైనచో అతనికి యే శుభప్రదములైన కర్మలును ఫలించవు. కాబట్టి అట్టి గృహస్థుని లోకులు కూడ ఇల్లూ వాకిలి లేనివాడని యానడింతురు. అట్లు యిల్లూ వాకిలీ లేనివానికి శాస్త్రమునందు గాని, సమాజమునందు గాని గౌరవముండదు. ఆ సమాజ గౌరవము మాట అటుంచుడు. నిత్యజీవితమున గూడ అనేక యిబ్బందులకు లోనగును. జీవితమున సుఖశాంతులకు దూరమగును. కావున మానవునకు ముఖ్యముగా గృహస్థునకు సొంతయిల్లు అనునది అది చిన్న కుటీరము గావచ్చును, లేదా భవనము గావచ్చును, యేదోయొక రూపమున

అవసరమగుచున్నది. అందుచే ప్రతిమానవునకు తన జీవయాత్ర సుఖముగా గడుపుకొనుటకు సొంతయిల్లు నిర్మించుకొనుట ప్రథమ కర్తవ్యము. మరియు

స్త్రీపుత్రాదిక భోగ సౌఖ్యజనకం ధర్మార్థ కామప్రదం
జంతూనాం నిలయం సుఖాస్పదమిదం శీతాంబుఘర్మాపహమ్
వాపీదేవ గృహాది పుణ్యమఖిలమ్ గేహాత్ సముత్పద్యతే
గేహం పూర్వముశన్తి తేన విబుధాః శ్రీ విశ్వకర్మాదయః ॥"

(వాస్తు రాజవల్లభమ్)

పై శాస్త్ర ప్రమాణము ననుసరించి పరిశీలించినచో ధర్మార్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములకు గృహమే ముఖ్య సాధనమని బుజువగుచున్నది. గృహస్థుడు తానాచరించు సమస్త శ్రౌత స్మార్త కర్మలను తన సొంత యింటియందు కాక యితరుల యింటియందాచరించినచో ఆయా శ్రౌతస్మార్త కర్మల యొక్క ఫలితము ఆయా గృహ యజమానికే చెందగలవని శాస్త్రములు స్పష్టముగా వక్కాణించుచున్నవి. అందుచే ప్రతి గృహస్థుడు తనకొక సొంతయిల్లు నిర్మించుకొనుట ముఖ్యావసరమగుచున్నది. అంతేగాక శీత, వాతాతపాదుల నుండి ప్రకృతి సహజముగా కలుగు కష్టనష్టముల నెదుర్కొని గృహమే గృహస్థుని సంరక్షించి సుఖపెట్టుచున్నది. అందుచేతనే మయవిశ్వకర్మ నారద సనత్కుమారాది ఋషిపుంగవులు మానవునకు గృహనిర్మాణము ప్రథమ కర్తవ్యముగా నొక్కివక్కాణించి యున్నారు.

"కోటిఘ్నం తృణజేపుణ్యం మృణ్మయే
దశసంగుణమ్
ఇష్టి కేశతకోటిఘ్నం శైలేనంతమ్ ఫలం గృహే"

అని గృహనిర్మాణ ఫలితమును గూర్చి శాస్త్రములు ఘోషించుచున్నవి. ఈ పై విషయములన్నియు బాగుగా పరామర్శించి చూచినచో ప్రతిమానవునకు యిది నా యిల్లు అని చెప్పుకొనదగిన సొంతయిల్లు ఉండుట అత్యావశ్యకము. అట్టి యిల్లు వారి వారి అర్హతలను బట్టి చిన్న కుటీరము గావచ్చును, లేదా భవనము గావచ్చును. అథవా ఏడంతస్థుల మేడ గావచ్చును. ఏ రూపములో నున్నను సొంతయిల్లనునది నిర్మించుకొనుట ప్రతి మానవునకు ప్రథమ

# వాస్తుశాస్త్రము నందు నామనక్షత్ర ప్రాధాన్యత

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని ఉపనిషద్వాక్యము. అనగా ఓంకారము పరబ్రహ్మ స్వరూపమని ఉపనిషత్తులు పలుకుచున్నవి. ఓంకారము శబ్దబ్రహ్మ స్వరూపము. అతీంద్రియ శక్తి సంపన్నులగు భారతీయ మహర్షులు ప్రణవోపాసనయందు నిష్ణాతులు. అట్టి ఉపాసనాసిద్ధులైన మహర్షులు తమ అతీంద్రియ జ్ఞానశక్తి చేత ప్రణవము నుండి జనించిన నాదము నుండి అక్షర సమామ్నాయమును, ఆయా అక్షరములను ఉచ్చరించునప్పుడు జనించిన ధ్వనుల వలన ప్రకృతియందు కలుగు సూక్ష్మాతిసూక్ష్మ శబ్ద తరంగముల ప్రభావమును బాగుగా అధ్యయనము చేసి తత్ఫలితముగా ప్రాప్తమైన శబ్ద తరంగ విజ్ఞానముతో శ్రీవిద్యా స్వరూపమగు మంత్రశాస్త్రమును రూపొందించిరి. భారతీయ మంత్రశాస్త్రముల యొక్కయు వేదమంత్రములయొక్కయు ప్రభావమును గూర్చి విదేశముల యందలి పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రవేత్తలు గూడ జోహారు లర్పించుచున్నారు.

అట్టి మహిమాన్వితమగు అక్షర సమామ్నాయమునందలి అక్షరములు ఏబది. "అ మొదలు క్ష" వరకుగల ఏబది అక్షరములకు ప్రత్యేకమగు ఉత్పత్తి స్థానములున్నవి. ఆయా ఉత్పత్తి స్థానములను బట్టి ఆయా అక్షరములను ఉచ్చరించుట చేత పుట్టిన ధ్వని తరంగశక్తిని మదింపుచేసి ఆయా శక్తులకు ప్రత్యేకమగు పేర్లు సూచింపబడినవి. ఆయా వేర్వేరు అక్షరములను వేర్వేరు సమూహములుగా నుచ్చరించునప్పుడు కలిగెడి వింతవింత శక్తులను తమతమ అతీంద్రియ జ్ఞానదృష్టులతో పరిశీలించి ఆయా పరిశోధనా ఫలితములను ఒక శాస్త్రముగా రూపొందించిన భారతీయ మహర్షులు లోకమునకే గర్వ కారణమైరి.

ఈ అక్షర సమామ్నాయము చేతనే వేదములు శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు, కావ్యములు, నాటకములు, నవలలు మొదలగు వాగ్రూపమగు సరస్వతీమూర్తి అవతరించుచున్నది. ఈ అక్షర సమామ్నాయము చేతనే

నవరసాత్మకమగు సంగీతము, సాహిత్యము, నృత్యము, జంత్రవాద్యాదులు మొదలగు లలితకళలన్నియు పుట్టుచున్నవి. ఇవి, అవి యననేల సమస్త జగత్తునందు అక్షర విద్యా ప్రభావము వ్యాప్తిపొంది యున్నది. ఏ కాలమునందైనను, యే దేశమందైనను, ఈ అక్షర విద్యాజ్ఞానము శూన్యమైనచో అచ్చటి నాగరికతయే శూన్యము కాగలదు. అందుచేతనే -

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి"

అను శాస్త్రప్రమాణము ననుసరించి శబ్దబ్రహ్మ జ్ఞానమును పొందినవాడు పరబ్రహ్మ సాక్షాత్కారము పొందగలడని మహర్షులు వక్కాణించి యున్నారు.

ఆధునిక వైజ్ఞానిక యుగమున ధ్వని తరంగముల శక్తి యెట్టిదో తెలియన వారుండరు గదా? ఈనాటి రేడియోలు ధ్వని తరంగశక్తిని తెలియజెప్పు కనీస సాధనములు మాత్రమే. మనకు ఈనాటి ఉపగ్రహముల నుండి లభించుచున్న అనేక మహాద్భుత ధ్వని ప్రసార విశేషముల మహత్తు వ్రాయుటకు ఇట చోటు చాలదు గదా?

భారతదేశమునకు సంబంధించినంతవరకు మన ప్రాచీన మహర్షులు రూపొందించిన శాస్త్రములయందు ముఖ్యముగా జ్యోతిష శాస్త్రమునందు ఈ అక్షర సమామ్నాయమునకు విశేషమగు ప్రాముఖ్య మీయబడినది. అందునను వాస్తుశాస్త్రమునందు నామ ప్రథమాక్షరమునకు మిక్కిలి ప్రాముఖ్యము ప్రతిపాదింపబడినది. గమనింపుడు -

గృహాది నిర్మాణములయందు వర్గార్యణము, క్షేత్రార్యణము, గృహార్యణము, గ్రామార్యణము, భృత్యార్యణము మొదలగు అర్యణమునకంతకు నామప్రథమాక్షరమే ప్రాతిపదికగా గణించి ఫలితము సాధింపవలసియున్నది. ఇందుకవసరమగు నామ నక్షత్రజ్ఞానము ననుసరించియే సమస్త శుభాశుభ ఫలితములను జ్యోతిష్కుడు మదింపు చేయగలడు.

అ మొదలుకొని క్ష వరకు గల యేబది అక్షరములననుసరించి వాస్తుశాస్త్రమున అ,క,చ,ట,త,ప,య,శ అను యెనిమిది వర్గులు యేర్పడినవి. ఈ యెనిమిది వర్గుల తూర్పు మొదలుకొని యెనిమిది దిక్కులయందు అధివసించి యుండును. ఈ

యెనిమిది వర్గుల ననుసరించియే వాస్తుశాస్త్రమున, గృహార్వణము, దిశార్వణము, ముఖద్వార నిర్ణయము మొదలగు విషయములు పరిశీలింపబడుచు. వాస్తుశాస్త్రములయందు "జన్మనక్షత్రము" అనుచోట నామనక్షత్రమునే గ్రహించుట ఆచారసిద్ధమగు విషయము ఎందుచేతననగా -

1. "యజమాన వస్తునామ,
జన్మర్క్షేణావిరోధికమ్ యత్తు" (మయమతం 62పేజీ)

2. దేశే జ్వరే గ్రామ గృహ ప్రవేశే
సేవాసు యుద్ధే వ్యవహార కార్యే
ద్యూతేషు దానేషుచ నామరాశిః
యాత్రా వివాహాదిషు జన్మరాశిః (గృహ రత్నభూషణమ్)

అని యున్నది. మరియు కాళిదాస కృతమగు కాలామృతమునందు

3. సంగ్రామ వ్యవహారధామ నగరీగ్రామేషు మంత్రార్వణే
జ్ఞాతేసత్యపి జన్మభేద సతతం నామార్ క్షజం స్యాత్ఫలమ్

అని వివరింపబడినది. పై శాస్త్ర వచనముల ననుసరించి గ్రామార్వణము, గృహార్వణము, గృహప్రవేశము, సేవార్వణము, వ్యవహారార్వణము మొదలగువాటియందు జన్మనక్షత్రము తెలసియున్నను, నామనక్షత్రమునే ప్రధానమైనదిగా గ్రహింపవలయునని ఋజువగుచున్నది. అందుచేతనే మయుడు మొదట నామనక్షత్రమునకు పిమ్మట జన్మనక్షత్రమునకు సరిపడి యుండవలెనని వివరించినాడు. ఇక జన్మనక్షత్రము కలిగియున్న వారిని గూర్చి అగస్త్య మహర్షి కృతమగు "సకలాధికారము" అను ప్రామాణిక గ్రంథమునందిట్లు వివరింపబడినది. గమనింపుడు -

"జన్మ నామార్ క్షయుక్ శ్రేష్ఠం, జన్మభం మధ్యమం భవేత్"

అని యున్నది కాబట్టి జన్మనక్షత్రము గలవారికి అర్వణము చూచునప్పుడు జన్మ, నామ నక్షత్రముల రెండింటికిని శుభార్వణము గలరీతిని గ్రహించుట శ్రేష్ఠము. ఆయా సాధనలయందు తారాబలము శుభప్రదముగా

మండునట్లు చూచుట శ్రేష్టము. ఒకవేళ అట్లు జన్మనామ నక్షత్రములకు శుభప్రదములైన తారలు సిద్ధింపనప్పుడు, గృహాదుల యందు నామనక్షత్రము ముఖ్యము కాబట్టి ఆ నామనక్షత్రమునకు శుభతారను సిద్ధింపజేసి జన్మనక్షత్రమునకు ఏడవతార మాత్రము రాకుండ చూచుట ఉత్తమ సాంప్రదాయము. అట్లే జన్మ నక్షత్ర ప్రాధాన్యత గల వివాహాది శుభ కార్యములయందు నామనక్షత్రమునకు నైధనతార గాకుండ గమనింపవలసి యున్నది. నైధవతార సర్వత్ర నింద్యము గదా!

ఈ నామ ప్రథమాక్షరమును గూర్చి ఒక ముఖ్య విషయమును గమనింపుడు. ఈ వైజ్ఞానిక యుగమునందు విజ్ఞాన శాస్త్రమున అగ్రగామియగు అమెరికా దేశమునందు సుప్రసిద్ధ మనో వైజ్ఞానిక శాస్త్రవేత్తలగు 'డాక్టర్ పేపర్' మరియు 'సవాలీ వెస్టన్' అనువారు మనుష్యులయొక్క పేర్లయందు మొదట గల అక్షరముల శక్తిని గూర్చి విశేష శ్రమకోర్చి పరిశోధనలు జరిపియున్నారని తెలియవచ్చుచున్నది. వారి పరిశోధనా ఫలితముల ననుసరించి ఎ నుండి **ఆర్** వరకు గల 14 అక్షరములు తమతమ పేర్లకు మొదటి అక్షరముగా గలవారు మిక్కిలి అదృష్టవంతులగుచున్నారని తెలియవచ్చుచున్నది. ఈ విషయమును పరిశీలించినచో ఈ నామ ప్రథమాక్షరమును బట్టి శుభాశుభ ఫలితములను గమనించుట సమస్త దేశములయందును ఉండియుండుననియే గ్రహింపవలయును. కాబట్టి విజ్ఞులైనవారు ఈ వాస్తు శాస్త్ర విషయమునందు నామ నక్షత్ర ప్రాధాన్యతను గమనింపవలసి యున్నది.



# స్థల పరీక్ష

గృహనిర్మాణ సందర్భమున మొట్టమొదట బాగుగా విమర్శింప వలసియుండునది స్థలపరీక్ష. గృహనిర్మాణమునకు గ్రహింపదలచిన స్థలము యొక్క ఆకృతిని, ఉచ్ఛనీచలను, నీటి పారుదల, వాటములను బాగుగా పరిశీలింపవలసియున్నది. గృహనిర్మాణ స్థలమునందలి మట్టియొక్క రుచి, రంగు, వాసనలు గూడ పరిశీలింపవలసినవని శాస్త్రముల యందున్నను ఆధునికులు పై మూడు విషయములను గూర్చియే ముఖ్యముగా విమర్శించుచున్నారు. ఇదియే ఆచరణ సాధ్యము. స్థలముయొక్క ఆకృతి పరిసరములను గూర్చి మయుడు -

"దేవానాం చ ద్విజానాం చ చతురశ్రాయతా శృతాః
వస్త్వాకృతి రనింద్యాసా వాక్ ప్రత్యగ్దిక్ సమున్నతా"
(మయమతం 8 పేజీ)

అని వివరించియున్నాడు. దేవాలయములకు గాని, గృహములకు గాని ఉపయోగింపదలచిన స్థలము చతురస్రముగా గాని లేదా ఆయతము అనగా దీర్ఘ చతురస్రముగా గాని ఉండవలయును. ఈ రెండు ఆకృతులు గల స్థలములు మాత్రమే గృహనిర్మాణమునకు శుభప్రదమైనవని మయుని అభిప్రాయము. ఈ మయుని అభిప్రాయము ననుసరించియే తరువాతి వారగు భోజుడు మొదలగు శాస్త్రవేత్తలు -

"ఆయతే సిద్ధయః సర్వాః చతురస్రే ధనాగమః"

అను ప్రమాణమును గ్రహించియున్నారు. వాస్తుశాస్త్ర గ్రంథములన్ని ఈ చతురస్ర దీర్ఘచతురస్రములను ఏకగ్రీవముగా అంగీకరించినవి. కాబట్టి గృహాది నిర్మాణములకు ఈ రెండు ఆకృతులు గల భూములనే గ్రహించుట శుభప్రదము.

## చతురస్రము :

చతురస్రము అనగా నాలుగు భుజములు అనగా నాలుగు దిశల కొలతలు సమానముగా గల స్థలము. ఉదాహరణకు -

తూర్పు సరిహద్దు పొడవు 11 గజములు, దక్షిణపు సరిహద్దు పొడవు 11 గజములు, పడమర సరిహద్దు పొడవు 11 గజములు, ఉత్తర సరిహద్దు పొడవు 11 గజములు ఉన్నదనుకొనుడు. అట్టి స్థలము చతురస్రమనబడును. అయితే యిట్టి చతురస్రాకారపు స్థలము యొక్క నాలుగు మూలలు మూలమట్టమునకు సరిపడియుండవలయును. అనగా ప్రతి మూలయు 90 డిగ్రీలు గలదిగా యుండవలయును. ఇట్టి చతురస్రాకారపు స్థలము గృహనిర్మాణమునకు మిక్కిలి ప్రశస్తమైనది, ఐశ్వర్యప్రదమైనది.

## ఆయతము :

ఆయతము అనగా దీర్ఘచతురస్రాకారము గల స్థలమని వివరింపబడినది. ఇట్టి ఆయత స్థలము యొక్క యెదురెదురు భుజముల లేక దిక్కుల కొలతలు సమానముగా నుండును. ఉదాహరణకు - ఒక స్థలము యొక్క తూర్పు పడమర దిశల కొలతలు 20 గజములు ఉన్నవనుకొనుము. దక్షిణోత్తర దిశల కొలతలు 15 గజములున్నవని భావింపుము. ఆ స్థలము యొక్క నాలుగు మూలలు మూలమట్టమునకు సరిపడియున్నచో అట్టి స్థలము దీర్ఘచతురస్రము లేదా ఆయతము అని పిలువబడుచున్నది. ఇట్టి స్థలమునందు గృహనిర్మాణము చేసుకొని నివసించు జనులు ఇష్టకార్యార్థ సిద్ధి బొంది సుఖింతురు.

"ఆయతే సిద్ధయః సర్వాః చతురస్రే ధనాగమః"

అను శాస్త్రవచనము పై విషయమునే స్పష్టపరచుచున్నది. కాబట్టి సమస్త గృహ నిర్మాణములకు పైనుదహరించిన చతురస్రము, ఆయతము - అను రెండు ఆకృతులు గల భూములనే పరిగ్రహించుట శ్రేయోదాయకము.

ఆయత వాస్తును గూర్చి మరియొక వివరణము గమనింపవలయును. ఆయతము రెండు విధములు. ఒకటి తూర్పు పడమరలు పొడవు దక్షిణోత్తరములు వెడల్పుగా గలది. రెండవది దక్షిణోత్తరములు పొడవుగా తూర్పు పడమరలు వెడల్పుగాను గల స్థలము. ఈ రెండింటియందును రెండవదగు దక్షిణోత్తరములు పొడవుగల ఆయతక్షేత్రము మిక్కిలి శ్రేష్టమైనదని "శిల్పరత్నము" నందు వివరింపబడినది.

"దక్షిణోత్తర మాయామాం వాస్తోః సర్వత్ర కీర్తితః"

అను ప్రమాణముచేత దక్షిణోత్తరములు పొడవుగల ఆయతము గృహనిర్మాణమునకు మిక్కిలి శుభప్రదమైనది.

వాస్తుశాస్త్రములలో స్థలముయొక్క ఆకృతులు మరికొన్ని చెప్పబడినవి. కాని - అందు మనము గమనింపదగినవి, మయునిచేత నిషేధింపబడినవి అగు నాలుగు ఆకృతులు గల భూములు.

"వృత్త త్రికోణ విషమా వజ్రాభా కచ్ఛపోన్నతా"

(మయమతం 10 వ పేజీ)

గుండ్రని ఆకారముగల భూమి, ముక్కోణములు గల భూమి, విషమాకారము గల భూమి, వజ్రాయుధమువలె పొడవుగల భూమి, తాబేలువలె బాదామీ ఆకారముతో నుండి మధ్య మిక్కలి ఎత్తైన భూమి మిక్కిలి నింద్యమని వివరింపబడినది. మరియు -

"చక్రే దారిద్ర్య మిత్యాహుః విషమే శోక లక్షణం
రాజభీతి త్రికోణేస్యాత్ శూర్పే ధనక్షయం విదుః"

అని భోజుడు స్పష్టముగా నిషేధించియున్నాడు. వృత్తాకారము గల భూమియందు యిల్లుకట్టి నివసించువారు దరిద్రులగుదురు. విషమకోణములు గల భూమియందు నివసించువారు దుఃఖితులగుదురు. ముక్కోణముగల స్థలమునందు యిండ్లు కట్టి నివసించువారు సివిలు క్రిమినలు కేసులయందు దగుల్కొని పీడింపబడుదురు. చేట వంటి ఆకారము గల భూమియందు యిల్లుగట్టి నివసించు ప్రజలు ఎంతటి ధనవంతులైనను క్రమముగా ఋణగ్రస్థులై దరిద్రులగుదురు. కాబట్టి వాస్తుశాస్త్రవేత్తలు ఈ స్థలాకృతి విశేషములను బాగుగా విమర్శించి యోగ్యమగు స్థలమునందు గృహనిర్మాణము చేయుట శ్రేయోదాయకము.

గృహనిర్మాణమునకు గ్రహింపవలసియున్న భూములు సహజసిద్ధముగా చతురశ్రముగానో, లేక ఆయతముగానో ఉండుట అరుదగు విషయము. కాబట్టి మనము యోగ్యముగా నున్నదని భావించిన భూమిని చతురస్రముగా గాని,

ఆయతముగాని సరిహద్దులేర్పరచుకొని శాస్త్రానుకూలమగు ఆకృతిని సాధించుట శిల్ప సమయము. ఈ విషయమును విజ్ఞులైనవారు గ్రహించవలసియున్నది.

స్థలపరీక్షయందు గమనింపవలసిన రెండవ విషయము పరిసరములు. గృహనిర్మాణ స్థలము యొక్క పరిసరముల ప్రభావము ఆ యింటిలో నివసించువారిపై ప్రసరింపగలదు. అందుచేత గృహనిర్మాణ స్థలముయొక్క పరిసరములను బాగుగా పరామర్శింపవలసి యున్నది. ఈ పరిసరముల శుభాశుభములను గూర్చి మయమతమునందు -

"సభా చైత్య సమీపస్థా నృపమందిర సంస్థితా
దేవాలయ సమీపస్థా కంటకద్రుమ సంయుతా
ఛండాలావాసగచ్ఛాయా వల్మీకా కచ్ఛపోన్నతా
ఏక ద్వి త్రి చతుర్మార్గా తరితా వ్యక్త మార్గకా
శ్మశానం చాశ్రమస్థానం కపి సూకరసన్నిభమ్
బహుప్రవేశమార్గం చ మార్గవిద్ధంచ గర్హితమ్"

(మయమతం 10 పేజీ)

అని యున్నది. సభలు, సమావేశములు జరుగు పబ్లిక్ స్థలములకు, చైత్యాలయములకు, దేవాలయములకు, రాజమందిరములకు, శ్మశాన భూములకు, సన్యాసులు నివసించు ఆశ్రమములకు, సమీపమున గల స్థలములయందు గృహనిర్మాణము చేయరాదని మయుని అభిప్రాయము. గ్రామపొలిమేరల యందు, పొలిమేరలకు సమీపముల యందునుగల భూములు నివాసయోగ్యములు గావని గ్రంథాంతరముల యందు వివరింపబడి యున్నది. గృహనిర్మాణ స్థలమునకు నాలుగు దిశలయందు వీధులున్న స్థలము, అనేక ప్రవేశమార్గములు గల స్థలము, సరియగు ప్రవేశమార్గము లేని స్థలము, ముండ్లుగల చెట్లున్న లేదా ముండ్లుగల పొదలున్న స్థలము, పుట్టలు గల స్థలము గృహనిర్మాణమునకు యోగ్యము గావని నిషేధింపబడినవి. కావున ఇట్టి స్థలములను గృహనిర్మాణములకు పరిగ్రహింపరాదు.

స్థలపరీక్షకు చెందినట్టి రుచి రంగు ధ్వని మొదలగు విషయములు గ్రంథాంతరముల చూడగలరు.

# ఉచ్ఛ నీచలు

వాస్తుశాస్త్ర పరిభాషయందు "ఉచ్ఛనీచలు" అనగా స్థలమునందలి మిట్టపల్లములని భావము. ఉచ్ఛ అనగా ఎత్తుగానుండుట, నీచ అనగా పల్లముగానుండుట యని గ్రహింపవలయును. గృహనిర్మాణ స్థలమునందలి ఈ ఉచ్ఛ, నీచల ననుసరించి అందు నివసించు ప్రజలకు గలిగెడి శుభాశుభ ఫలములను వాస్తు శాస్త్రములన్నియు విపులముగా చర్చించినవి. కాబట్టి స్థలపరీక్షయందీ ఉచ్ఛనీచల ప్రాముఖ్యమును గుర్తించి స్థలనిర్ణయమును చేయుట వాస్తుశాస్త్రవేత్తల కర్తవ్యము.

ఈ ఉచ్ఛనీచలను దృష్టియందుంచుకొని మయుడు వివరించిన స్థలపరీక్ష గమనింతము - మయమతము 6వ పేజీనందిట్లున్నది.

1. ఉత్తర ప్రవణము - అనగా ఉత్తరము పల్లముగానున్న భూమి
2. ప్రాఙ్నిమ్నము - అనగా తూర్పు పల్లముగా నున్న భూమి
3. పూర్వావనతము - అనగా తూర్పు పల్లముగా నున్న భూమి
4. ప్రాక్ప్రవణము - అనగా తూర్పు పల్లముగా నున్న భూమి.

అను నాలుగు విధములైన భూములు వరుసగా బ్రాహ్మణాది నాలుగు వర్ణముల వారికి శ్రేష్ఠములని వివరింపబడియున్నది. పై విషయమును గమనించినచో సమస్తమైనవారికి తూర్పు, ఉత్తర దిశలు పల్లముగా గల భూమి గృహనిర్మాణమునకు యోగ్యమైనదిగా తెలియుచున్నది. ఈ విషయమును గూర్చియే పండిత శ్రేష్ఠుడగు కాళిదాసు తన కాలామృతము నందు -

"ఈషత్ పశ్చిమ దక్షిణోన్నత మహీ లక్ష్మీప్రదానేతరా" అనియు
స్యాదున్నతిః పూర్వనతే నరాణాం వాస్తౌ ధనం దక్షిణభాగ తుంగే
క్షయోధనానాం వినతేప్రతీచ్యా ముచ్చైవినాశో ధ్రువముత్తరేణ॥

అని "రాజమార్తాండము", కృతితత్వ సంగ్రహము" అను గ్రంథములయందును గలదు. గృహనిర్మాణ స్థలమునందలి దక్షిణ పశ్చిమ దిశలు కొంచెమెత్తుగా నుండి ఉత్తర తూర్పుదిశలు పల్లముగా నుండినచో లక్ష్మీ ప్రదమని కాళిదాసు అభిప్రాయము. రెండవ

ప్రమాణమును ఆ విషయమువే వొక్కివక్కాణించు చున్నది. కాబట్టి సారాంశముగా యీ క్రింది విషయమును గ్రహింపవలయును.

1. తూర్పుదిశ పల్లముగానున్న స్థలము ధనధాన్య సమృద్ధిని కలుగజేయును.
2. ఉత్తరదిశ పల్లముగానున్న భూమి అష్టైశ్వర్యముల ప్రసాదించును.
3. దక్షిణము పల్లముగానున్న భూమి అపమృత్యు భయమును కలిగించును.
4. పడమర పల్లముగానున్న స్థలము యజమానుని ఋణగ్రస్తుని జేయును.

కాబట్టి గృహనిర్మాణ యోగ్యమగు -

"పూర్వోత్తరే భవేల్లక్ష్మీ రీశాన్యే శుభప్రదః"

అను భుజబలభీముని వచనము ననుసరించి తూర్పు ఉత్తర ఈశాన్యములు పల్లముగానున్న స్థలమువే పరిగ్రహించుట సర్వశ్రేయోదాయకము. ఇట్టి భూమి యజమానునకు సమస్త సిరి సంపదలను ప్రసాదించగలదు.

గృహనిర్మాణ స్థలమునందలి మిట్టపల్లములను అనుసరించి ఆయా స్థలములకు కొన్నిపేర్లు వాటి శుభాశుభ ఫలములు 'వాస్తువిద్య', 'శిల్పరత్నము' మొదలగు గ్రంథముల యందు విపులముగా చర్చించబడినవి. అందలి ముఖ్యమగు కొన్ని విషయములు మాత్రమే వివరింపబడుచున్నవి. మిగిలినవి గ్రంథాంతరమున చూడవగును.

***1. గోవీధి :*** తూర్పుదిశ పల్లముగను పడమరదిశ ఎత్తుగను ఉన్న స్థలము. ఈ స్థలమునందలి నీటిపారుదల తూర్పుదిశగా నుండును. ఇందు నివసించు జనులు వంశవృద్ధి గలవారై పాడిపంటలు గలిగియుందురు. గృహ యజమానుడు మంచి కీర్తి ప్రతిష్ఠలు గలవాడై రాజకీయాధికారములను అనుభవింపగలడు. ఇందు నివసించువారి సంతానము మంచి ఉచ్ఛస్థితి నందుకొనగలదు.

**2. అగ్నివీధి :** ఆగ్నేయదిశ పల్లముగను వాయవ్యదిశ యెత్తుగను ఉన్న స్థలము. ఇట్టి స్థలమువందు నివసించు జనులు సంతానహీనులగుదురు. అట్టి స్థలమునందు నివసించు వారికి శత్రువుల బాధ, అగ్నిభయము, దొంగలభయము తరచుగా సంభవించుచుండును. గృహ యజమానుడు నిత్యము మనస్తాపమునకు లోనై యేదోయొక విచారముతో బాధ పడుచుండును.

**3. యమవీధి :** దక్షిణదిశ పల్లముగను, ఉత్తరదిశ యెత్తుగను ఉన్న స్థలమునకు యమవీధి యనిపేరు. ఈ స్థలమునందలి నీటిపారుదల దక్షిణదిశగా నుండును. ఈ యమవీధియందు యిండ్లు కట్టుకొని నివసించు జనులు తరచుగా అకాల మరణముల పాలగుచుందురు. లేదా దీర్ఘరోగముల పాలబడి పీడింపబడుచుందురు. అందు నివసించు
వారి సంతానము భూతప్రేత పిశాచబాధలకు గురియగుచుందురు. గృహయజమాన్యము తరచు మారుచుండును. లేదా అమ్మకములు జరుగుచుండును. మరియు ఋణగ్రస్తులై దరిద్ర మనుభవింతురు.

**4. భూతవీధి :** నైఋతిదిశ పల్లముగను, ఈశాన్యదిశ యెత్తుగను ఉన్న స్థలమునకు భూతవీధి యనిపేరు. ఈ భూతవీధియందు నివసించు ప్రజలు తరచు అపస్మారాది రోగములతో బాధపడుచుందురు. యజమానులకు మనశ్శాంతి నశించును. ఇందుండువారి సంతానము తరచు రోగగ్రస్తులగుచుందురు. లేదా యిల్లు విడిచిపోవుచుందురు. తరచుగా అమ్మకములు జరుగుటయు సంభవించును. ఇందుండువారి సంతానము కూడా రాక్షస స్వభావము గలది అగుటయో లేక యజమానికి సంతతి లేక దత్త పుత్ర స్వీకారమో సంభవించును.

**5. జలవీధి :** పడమర పల్లముగను, తూర్పుదిశ యెత్తుగను ఉన్న స్థలమునకు జలవీధి యనిపేరు. ఇందలి నీటిపారుదల పడమరదిశగా నుండును. ఇట్టి స్థలమునందు నివసించు జనులు యెంతటి ధనవంతులైనను ఋణగ్రస్తులై క్రమక్రమముగా దరిద్రమనుభవింతురు. ఆ గృహస్తుని ధనము దుర్వ్యసనముల పాలగును. అందు నివసించు వారి సంతానము చెడు అలవాట్లకు లోనై విద్యాహీనులై కొట్లాడుచుందురు. వారి వారి జన్మజాతక ప్రభావముచే విద్యావంతులైనను వక్రమార్గమున నడచుకొనుచు అపనిందల పాలగుదురు.

**6. నాగవీధి :** వాయవ్యదిశ పల్లముగను ఆగ్నేయము యెత్తుగను ఉన్న భూమి నాగవీధి యనబడును. ఇందు నివసించువారు ప్రతినిత్యము కుటుంబ కలహములతో మనశ్శాంతి లేకయుందురు. స్త్రీలు తరచు రోగగ్రస్తులగుదురు. గృహ యజమాని

భార్య మానసిక రోగముతో బాధపడుచుండును. అందు నివసించు బాలబాలికలు గూడ మానసిక రోగగ్రస్తులగుచుందురు. లేదా సర్పభయము గలవారగుదురు.

**7. గజవీధి :** ఉత్తరదిశ పల్లముగను దక్షిణదిశ యెత్తుగను ఉన్న స్థలమునకు గజవీధియని పేరు. అందలి నీటివాటము ఉత్తరదిశగా నుండును. అట్టి గజవీధియందు యిండ్లు గట్టి నివసించువారు సమస్త సిరిసంపదలను అనుభవింపగలరు. అందు నివసించువారి సంతానము మంచి ఆరోగ్యవంతులై దీర్ఘాయువు గలవారై విద్యావినయ సంపన్నులై సుఖింతురు. ఇందుండువారు వ్యవసాయమునందు గాని, వ్యాపార రంగమునందు గాని, మంచి నేర్పరులై కుబేరతుల్యులై కీర్తి ప్రతిష్ఠలు సంపాదింపగలరు.

**8. ధనవీధి :** ఈశాన్యము పల్లముగను నైఋతిదిశ యెత్తుగను ఉన్న స్థలమునకు ధనవీధి యనిపేరు. ఇందలి నీటిపారుదల తూర్పునకుగాని ఉత్తరమునకుగాని ఉండవచ్చును. ఇట్టి స్థలమునందు యిండ్లు నిర్మించుకొని నివసించువారు అష్టైశ్వర్యములతో తులదూగుచుందురు. ఆయురారోగ్యవంతమగు సంతానమును బొందగలరు. మరియు అందు నివసించువారు దైవభక్తి తత్పరులుగను, ఆధ్యాత్మిక చింతనాపరులుగను, దాతలుగను, శాంతియుతమగు జీవనము గడుపువా రగుదురు. అందుండు వారి పిల్లలు విద్యావినయ సంపన్నులై మంచి క్రమశిక్షణకు లోబడి దినదిన ప్రవర్ధమానులై వృద్ధి పొందగలరు.

పై నుదహరించిన యెనిమిది రకములైన స్థలములు తూర్పు మొదలుకొని యెనిమిది దిక్కులయందు వరుసగా నీచగల స్థలములై ఒప్పినవి. ఇంకను కొన్ని విశేషాకృతులను గమనింపుడు.

**9. గజపృష్టము :** తూర్పు, ఈశాన్య, ఉత్తర దిశలు పల్లముగా నుండి దక్షిణనైఋతి, పడమర దిశలు యెత్తుగానున్న భూమికి గజపృష్టమని పేరు. ఇందలి నీటిపారుదల ఉత్తరదిశగా గాని తూర్పుదిశగాగాని ఈశాన్యదిశగాగాని యుంచవచ్చును. అట్టి గజపృష్టభూమియందు యిండ్లుగట్టి నివసించు జనులు

"గజపృష్ఠే భవేద్వాస్యో లక్ష్మీవాన్ ధనవాన్ భవేత్
ఆయుర్వృద్ధికరో నిత్యం జాయతే నాత్రసంశయః"

అను ప్రమాణమునను సరించి ఆయురారోగ్య ఐశ్వర్య సంపన్నులై సుఖింపగలరు.

ఇట్టి గజపృష్ఠాకృతి గల స్థలము సర్వజనాదరణీయమై ఒప్పుచున్నది. ఆధునికులచేత గూడ మిక్కిలి ఆరాధింపబడుచున్నది.

**10 కూర్మపృష్ఠము** : గృహనిర్మాణ స్థలముయొక్క మధ్యభాగము తాబేలు డిప్పవలె యెత్తుగా నుండి నాలుగుదిశలకు నీటివాటము గల స్థలమునకు కూర్మపృష్ఠము అని పేరు. ఇట్టి స్థలము జనులకు శుభఫలములనిచ్చునని చెప్పబడియున్నది. కాని మయుడు ఈ కూర్మపృష్ఠ భూమిని నిరాకరించినాడు. కావున దీనిని మధ్యమపక్షముగా గ్రహింపవచ్చును.

**11 దైత్యపృష్ఠము** : తూర్పు, ఈశాన్యము, ఆగ్నేయము యెత్తుగను పడమర పల్లముగను ఉన్నభూమి దైత్యపృష్ఠము. అందు నివసించు జనులు పుత్రహీనులగుదురు. ధనధాన్యములు నశించిపోవును. నిత్యము అనేక కష్టనష్టములకు గురియగుచుందురు. అందుండువారి సంతానము దుర్వ్యసముల పాలగును.

**12. నాగపృష్ఠము** : తూర్పు పడమరలకు పొడవు గలిగియుండి దక్షిణోత్తర దిశలయందు యెత్తుగనుండు భూమికి నాగపృష్ఠమని పేరు. ఇట్టి భూమియందు నివసించువారు నిత్యము అపమృత్యువు పాలబడుదురు. భార్యకు కీడు కలుగును. శత్రువృద్ధియు పుత్రులకు పశువులకు కష్టమును కలుగుచుండును. మిక్కిలి నింద్యమగు భూమి. గృహయజమానుడు అడుగడుగున అనేక కష్టపరంపర నెదర్కొనవలసి వచ్చును.

## ఉచ్చనీచల సూక్ష్మ పరిశీలనము :

ఇంతవరకు దిక్కులు నాలుగు, విదిక్కులు నాలుగు మొత్తము యెనిమిది దిశలను గూర్చియు, ఆయా దిశలయందలి మిట్టపల్లములను గూర్చియు శుభాశుభ ఫలములు వివరింపబడినవి. ఇంకను సూక్ష్మ పరిశీలనము చేయగా దిశలకు విదిశలకు మధ్యగల అంతరాళముల యందలి ఉచ్చనీచల ననుసరించి శుభాశుభ ఫలనిర్ణయము చేయబడినది. ఈ దిశలకు విదిశలకు మధ్యగల అంతరాళమును ఈ క్రిందివిధముగా గుర్తింపవలసియుండును.

గృహనిర్మాణ స్థలముయొక్క పొడవును 5 సమభాగములుగాను, వెడల్పును 5 సమభాగములుగాను విభజించిన యెడల 5 5 =25 సమభాగములుగల “ఉపపీఠము” అనుపేరు గల వాస్తుపదము యేర్పడుచున్నది. అందు మధ్యనున్న తొమ్మిది భాగములను విడిచినచో స్థలముయొక్క ఆవరణ చుట్టును 25-9= 16 సమభాగములు యేర్పడుచున్నవి.

## ఉపపీఠము

| | | | | |
|---|---|---|---|---|
| ఈశాన్యము | × | తూర్పు | × | ఆగ్నేయము |
| × | | | | × |
| ఉత్తరము | | | | దక్షిణము |
| × | | | | × |
| వాయవ్యము | × | పడమర | × | నైఋతి |



పై పటమునందలి విధముగా గృహావరణ స్థలమును విభజించి అందు × గుర్తుగల

భాగములను ఆయా దిక్కులకు విదిక్కులకు అంతరాళములుగా గ్రహింప వలసియున్నది. అట్టి అంతరాళ భాగములయందున్న ఉచ్చనీచల ననుసరించి "శిల్పరత్నము" తృతీయాధ్యాయము నందు వివరింపబడిన వాస్తు లక్షణములు, వాటి ఫలితములు యిట వివరింపబడుచున్నవి. ఈ సూక్ష్మ పరిశీలనము చేసి ఫలితములను చెప్పునప్పుడు యింతకుముందు వివరింపబడిన ఫలితములను గూడ సమన్వయపరచుకొని ఫలితము చెప్పుట శిల్ప సమయము.

"ఇంద్రాగ్న్యోరంత రాద్యంతరాల నీచవశాత్ క్రమాత్
పైతామహాపథాఖ్యౌచ శ్మశానం రోగవర్ధనమ్
అసురం ప్రథమం పుణ్యాం దీర్ఘాయుశ్చేతి వీథయః
తద్వ్యస్తేత్వంతరాలాఖ్యః స్వనామ సదృశం ఫలమ్".

పై నుదహరించిన శిల్పరత్న ప్రమాణము ననుసరించి, ముందుగా తూర్పు ఆగ్నేయముల మధ్యగల అంతరాళము నీచగా గ్రహించి వరుసక్రమముగా యెనిమిది వీధులు నిర్ణయింపబడినవి. ఆయా పేర్లకు అనుగుణముగా శుభాశుభ ఫలములు గలుగ గలవని శిల్పరత్నకారుడగు కుమారశిల్పి అభిప్రాయము. పితామహము, అపథము, శ్మశానము, రోగవర్ధనము, ఆసురము, ప్రథమము, పుణ్యకము, దీర్ఘాయువు అను యెనిమిది వీధులు ఆగ్నేయాంతరాళము మొదలుగా చెప్పబడినవి.

***1. పితామహావీధి :*** తూర్పు ఆగ్నేయముల మధ్యపదము పల్లముగనుండి పశ్చిమవాయవ్యముల మధ్యపదము ఎత్తుగనున్న భూమికి పితామహావీధి యనబడును. ఇది శుభప్రదమైనది.

***2. అపథవీధి :*** ఆగ్నేయ దక్షిణముల మధ్యపదము పల్లముగనుండి వాయవ్య ఉత్తరముల మధ్యపదము ఎత్తుగనున్న భూమికి అపథవీధియని పేరు. గృహయజమానునకు శత్రు భయము, అకారణ కలహములును, బంధువు విరోధులగుటయు జరుగును.

***3. శ్మశానవీధి :*** దక్షిణము, నైఋతి దిశల మధ్యగల పదము పల్లముగను ఉత్తరము, ఈశాన్య దిశల మధ్యపదము ఎత్తుగనున్న స్థలమునకు శ్మశానవీధియని పేరు. ఇట్టి వాస్తు వంశ నాశనమును సర్వారిష్టములను కలుగజేయును. మిక్కిలి నింద్యమైనది.

**4. రోగవర్ధనము :** నైఋతి, పడమరల మధ్యపదము పల్లముగను, ఈశాన్యము, తూర్పు దిశల మధ్యపదము ఎత్తుగనున్న స్థలమునకు రోగవర్ధమని పేరు. ఇందు నివసించు జనులు నిత్యము రోగపీడితులై యెంతటి ధనవంతులైనను దీర్ఘరోగముల చేత మానసిక శాంతి లేనివారై యుందురు.

**5. అసురవీధి :** పశ్చిమదిశకును వాయవ్యమునకును మధ్యపదము పల్లముగను, తూర్పు ఆగ్నేయదిశల మధ్యపదము ఎత్తుగనున్న భూమికి అసురవీధియని పేరు. ఇట్టి స్థలమునందు నివసించు జనులు క్రూరస్వభావము గలవారగుదురు. ఎంత సత్పురుషులైనను అసురవీధియందు నివసించిన వాటినుండి వారి బుద్ధి వక్రించును. రాక్షసస్వభావము గలవారై బ్రహ్మహత్యా దోషములను అనుభవింపగలరు. అందు నివసించువారి సంతానము గూడ క్రూరస్వభావము గలదగును. మిక్కిలి నింద్యమైనది.

**6. ప్రథమవీధి :** దీనికి సుపథమను నామాంతరము గలదు. వాయువ్యము ఉత్తరమునకు మధ్యగల పదము పల్లముగను దక్షిణము ఆగ్నేయమునకు మధ్యగల పదము ఎత్తుగనున్న భూమికి సుపథమని పేరు. ఇందు నివసించు జనులు సుఖసంతోషములతో నుందురు.

**7. పుణ్యకవీధి :** ఉత్తరదిశకును, ఈశాన్యదిశకును మధ్యగల పదము పల్లముగను, దక్షిణ నైఋతిదిశలకు మధ్యగల పదము యెత్తుగను ఉన్నభూమికి పుణ్యకవీధి యనిపేరు. ఇందు నివసించు జనులు వారి సంతానము ఆధ్యాత్మిక తత్వచింతనాపరులై పరోపకార పరాయణులై వర్ధిల్లగలరు. మరియు యిట్టి స్థలములందు యిండ్లు నిర్మించుకొనువారు పెద్ద పెద్ద రాజకీయోద్యోగములయందుండి కీర్తిప్రతిష్ఠలను సంపాదింపగలరు.

**8. దీర్ఘాయుర్వీధి :** తూర్పుదిశకును ఈశాన్యమునకును మధ్యగల పదము పల్లముగను, నైఋతి పడమర దిశల మధ్యగల పదము యెత్తుగను ఉన్న భూమికి దీర్ఘానని పేరు. ఇట్టి భూమియందు నివసించు జనులు ఆయురారోగ్యములు గలవారై సిరిసంపదలతో తులతూగుచుందురు.

ఈ పైనుదహరించిన ఉచ్చనీచల శుభాశుభ ఫలములు "స్వవర్గాత్ పంచమోవర్గ శత్రురిత్యభి ధీయతే" అను ప్రమాణమును అనుసరించి చక్కగా అతీంద్రియ దృష్టితో పరిశోధించి విమర్శింపబడినవని విజ్ఞులు గ్రహింతురుగాక. వాస్తువిద్యయందు యింకను సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనమీ విషయమున చేయబడినది గాని గ్రంథవిస్తర భీతిచే విడిచి పెట్టబడినది.

# దిక్సాధన

గృహనిర్మాణ కార్యమునందు దిక్సాధన ప్రథమకర్తవ్యము. ఎందుచేతననగా "గృహవేదిక" అనగా "ఫౌండేషన్" యొక్క దృఢత్వము, యింటికి కావలసిన వెలుతురు గాలి, గృహసౌందర్యము మొదలగు విషయములు ఈ దిక్సాధనపైననే ఆధారపడియున్నవి. అందుచేతనే మయుడు విశ్వకర్మ మొదలగు శిల్పఋషులు దిక్సాధనయొక్క అవసరమును నొక్కి చెప్పియున్నారు. ఈ క్రింది శాస్త్ర వచనమును గమనింపుడు -

"ప్రాసాదే, సదనేళిందే ద్వారే కుండే విశేషత:
దిఙ్మూఢే కులనాశస్యాత్ వక్రే దారిద్ర్యమాదిశేత్"
(విశ్వకర్మ ప్రకాశిక)

అని వివరింపబడినది. అనగా గృహనిర్మాణ స్థలముయొక్క నాలుగుదిశల యందలి పరిహద్దు సూత్రములు వక్రము అనగా వంకరలు లేకుండ ఆయా దిక్కులకు అభిముఖముగ నుండవలెను. అట్లు లేనియెడల కులనాశనమగునని భావము.

ఈ దిక్సాధన యందొక సాంకేతిక రహస్యము యిమిడియున్నది. మనము నివసించుచున్న భూగోళమునకు రెండు ధృవక్షేత్రములున్నవి. అందు మొదటిది ఉత్తరధృవము, రెండవది దక్షిణధృవము. ఈ రెండు ధృవక్షేత్రములయందు ఊహాతీతమగు అయస్కాంతశక్తి యిమిడియున్నది. ఈ ధృవములనుండి అయస్కాంత వలయములు భూగోళమునంతను చుట్టిముట్టి ప్రవహించుచున్నవి. ఈ అయస్కాంత క్షేత్రము నుండి విడుదలయగుచున్న అయస్కాంత తరంగముల ప్రభావము మానవజీవితములపై అమితముగా ప్రచురించు చున్నదని నేటి విజ్ఞానవేత్తలు అంగీకరించుచున్నారు.

**మరియొక గమనిక :** ఈ భూగోళమునకు యెన్నో కోట్లమైళ్ళ దూరమున ఉత్తరాకాశము నందు సర్వకాలముయందు, ఒకేచోట అచలముగా నిలిచియున్నట్లు మనకు కనుపించు ధృవ నక్షత్రమునకును ఈ భూగోళముయొక్క ఉత్తర

ధృవక్షేత్రమునకు అనూహ్యమగు విడదీయరాని సంబంధమున్నది. భూమండలము తనచుట్టును తాను తిరుగుచూ సూర్యునిచుట్టును ఒక నిమిషమునకు 1100 మైళ్ళ వేగముతో పరిభ్రమించు చున్నది. ఇంతటి మహావేగముతో ఈ భూగోళము ఆకాశమునందు బంతివలె తేలియాడుచు పరిభ్రమించుచున్నను ధృవుడు తన ఆకర్షణతో భూగోళము యొక్క ఉత్తరధృవమును ఒడిసిపట్టి కదలనీయకున్నాడు. ఇదియొక ఆశ్చర్యకరమగు సృష్టి వైచిత్రియో గమనింపుడు.

ఇంతటి మహత్తరమగు ధృవాకర్షణశక్తికి లేదా అయస్కాంత తరంగ ప్రవాహములకు సమాంతరములుగా గృహ భవనాది నిర్మాణములు జరగనిచో అట్టి గృహ భవనాదులు మహాశక్తి సంపన్నములైన అయస్కాంత తరంగ ప్రవాహముల తాకిడిని తట్టుకోలేక అచిరకాలమునందే నిర్వీర్యములై శక్తిని కోల్పోయి శిథిలావస్థకు రాగలవు. ఈ సాంకేతిక రహస్యమును విశ్వకర్మాది మహర్షులు శాస్త్ర వచనములయందిమిడ్చి గృహనిర్మాణమున దిఙ్మూఢము నిషేధించినారు.

ఈ దిఙ్మూఢమునందు విమర్శింపవలసిన విషయము గృహమునకు అవసరమగు గాలి వెలుతురు. దిఙ్మూఢము గల గృహమునందు సూర్యకిరణ ప్రసారము సవ్యమార్గమున జరుగదు. అట్లే ఆరోగ్యకరమగు "మలయానిలము" అనగా దక్షిణదిశనుండి వీచుగాలియు దిఙ్మూఢముగల యింటికి కరువై పోగలదు. ఈ విధముగా సరియగు వాయుప్రసారము వెలుతురు లోపించిన యిండ్లయందు నివసించువారు ఆరోగ్యము చెడి అల్పాయుష్కు లగుదురు.

ఇందు గమనింపవలసిన మరియొక విషయము నిర్మాణ సౌందర్యము. ఈ దిక్సాధన ననుసరించి ఒకే పద్ధతిలో వరుసదప్పక నిర్మించు గృహపంక్తులు గ్రామ నగరాదుల శోభను యినుమడింపజేయును. అడ్డదిడ్డముగా ఒక క్రమబద్ధముకాని నిర్మాణములు వెలుతురు, గాలి సక్రమముగా ప్రసరించుటకు అవరోధము కాగలవు. అందుచేతనే సమస్త వాస్తు శాస్త్రములయందు దిక్సాధన గృహ గ్రామ నగరాది నిర్మాణముల యందు ముఖ్య కర్తవ్యముగా ఆదేశింపబడినది.

ఈ దిక్సాధనమును గూర్చి ఆధునికులు "దిఙ్మూఢే కులనాశశ్యాత్" అనుముని వాక్యమునకు తెలుగుసేత "దిక్కులేని యింట దిక్కు లేదు" అని చక్కగా

ప్రచారము చేసియున్నారు. దిక్కు అనగా తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము అను నాలుగు ప్రధానమగు దిశలు. ఈ దిక్కులు సరిగాలేని యింటియందు "దిక్కు" అనగా సంరక్షకుడు లేక యజమానుడు అథవా ఆదరించువాడు మనజాలడని భావము. కాబట్టి గృహసౌధ హర్మ్యాది సమస్త నిర్మాణ కార్యములయందు "దిక్సాధన" మొదటి కర్తవ్యమని తెలియదగును.

ఈ రోజులలో దిక్సాధన చుంబకయంత్ర (దిక్సూచి) సహాయమున సాధింపబడు

చుండుటసామాన్యమగు విషయము. మరికొందరు రాత్రియందు ధృవ నక్షత్రమును గుర్తించి సూత్రమును బట్టి దిక్సాధన చేయుచున్నారు. ఈ రెండు పద్ధతులును సరియైనవే. కాని ప్రస్తుతకాలమున ఈ రెండు సూత్రముల మధ్య కొంచెము తేడా కనిపించుచున్నది. ఏమందురా? అయన బిందువు ననుసరించి కొద్ది కొద్దిగా జరుగుచున్నది. ఆ అయనబిందు చలనము ననుసరించి ఆకాశధృవ క్షేత్రమునకు భూధృవ క్షేత్రమునకు భేదము అధికము కాగలదు. మనము భూగోళమునందు నివసించుచున్నాము. కాబట్టి భూధృవమునకు సరిపడు దిక్సూచీ యంత్ర సహాయమున దిక్సాధన చేయుట శ్రేష్ఠమని గ్రహింపవలయును.

గృహనిర్మాణ స్థలమునందు దిక్కులు సవరించుట యెట్లు? చతురస్రము లేదా ఆయతము శ్రేష్ఠమైనవని యిదివరకే వివరింపబడినది. అట్టి చతురస్రముగాని ఆయతముగాని సహజసిద్ధములైయై లభింపవు. కాబట్టి ఈ దిక్సాధన ననుసరించి ఈ చతురస్రాయతములను సాధించుకొనవలయును. మొదట భూమిని సమతలముగా చేయవలయును. అనగా చదును చేయవలయును. పిమ్మట ఆ స్థలమునందు తూర్పు సరిహద్దు రేఖపై దక్షిణోత్తరములుగా సూత్రమును బట్టి దిక్సూచీ యంత్రమునకు సవరించి సరియగు దక్షిణోత్తర బిందువులను భూమిపై గుర్తింపవలెను. పిమ్మట స్థలమునకు తూర్పు సరిహద్దునందు లాగాపట్టిన సూత్రమునకు దక్షిణబిందువు నందు అనగా స్థలమును ఆగ్నేయ మూలయందు మొదటి గూటము అనగా కొయ్యను నాటవలయును. ఆ పిమ్మట స్థలము యొక్క దక్షిణ సరిహద్దు మీదుగా మొదట నాటిన కొయ్యనుండి నైఋతి మూలగల పడమటి సరిహద్దు వరకు సూత్రమును లాగి దిక్సూచీ యంత్రముతో తూర్పు పడమరలు సవరించి నైఋతి కోణమున

రెండవ కొయ్యను పాతవలయును. ఈ సూత్ర ప్రసారమును గూర్చి మయుడు -

"గృహాణాం దక్షిణే గర్భ: తత్పార్శ్వే సూత్రపాదనమ్"

అని వివరించి యున్నాడు. కాబట్టి ఈ దక్షిణదిశయందు పరిహద్దును స్థిరపరచుకొను నిమిత్తమే తూర్పు సరిహద్దున నామమాత్రముగ సూత్ర ప్రసారము చేయబడుచున్నది. దక్షిణ సరిహద్దు స్థిరపరచిన పిమ్మట నైఋతి మూలయందు కొయ్యను నాటి అచ్చటి మూల మట్టముతో సవరించి పశ్చిమ సరిహద్దు మీదుగా సూత్రమును లాగిపట్టి పడమర సరిహద్దును స్థిరపరచ వలయును. ఆ తదుపరి వాయవ్య కోణమున గూటము పాతవలయును. ఇంతవరకు నైఋతిమూల మూలమట్టము సరిజేసి దక్షిణ పశ్చిమ సూత్రములు మూలమట్టమునకు సవరింపబడినవి గదా ! ఆ పిమ్మట వాయవ్య కోణము నుండి ఉత్తర సరిహద్దు మీదుగా స్థలము యొక్క ఈశాన్య కోణము వరకు సూత్రమును బిగించి వాయవ్యమూల మూల మట్టమునకు సవరింపవలయును. ఆ పిమ్మట ఈశాన్యకోణమున నాలుగవ కొయ్య పాతవలయును. మరల ఆ ఈశాన్య మూలయందు మూలమట్టమునకు సరియగు సూత్రమును ఆగ్నేయమూల మొదట నాటిన కొయ్య వరకు సారించి తూర్పు పరిహద్దును స్థిరపరచవలయును. అవసరమగుచో ఆగ్నేయమునందును ఈశాన్యమునందును గల కొయ్యలను సవరించి మరల తూర్పు పరిహద్దును దిక్సూచితో సవరించి స్థలము యొక్క నాల్గు పరిహద్దుల గుండా సూత్రమును బిగించి కట్టవలయును. ఇప్పటికి స్థలమునకు నాలుగు దిశల పరిహద్దులు స్థిరపడినవి. ఈ నాలుగు సూత్రముల మధ్యస్థమగు భూమికి "బ్రాహ్మీప్రాచీ" యనిపేరు సిద్ధించుచున్నది. దీనికే శుద్ధ ప్రాచీయనియు నామాంతరము గలదు. ఇట్టి శుద్ధప్రాచీ యనుపేరు గల స్థలమునందు గృహనిర్మాణము చేసుకొని నివసించు జనులు ఆధ్యాత్మిక తత్వచింతనా పరులై మంచి ఆత్మవిశ్వాసము గలవారై మానసిక శక్తి సంపన్నులై మంచి సిరి సంపదలతో తులతూగ గలరని శాస్త్రకర్త యభిప్రాయము.

# ఈశప్రాచీ

ఆద్యశిల్ప ఋషులలో మయుని తరువాత అంతటి ప్రసిద్ధుడు మానసార మహర్షి. ఆతని రచన "మానసారము" మిక్కిలి ప్రసిద్ధమైనది. అట్టి మానసారమునందు దిక్పరిచ్ఛేదము అను ప్రకరణమున "ఈశప్రాచీ" అను స్థల విశేషమును గూర్చి చక్కగా వివరింపబడినది.

ముందు ప్రకరణమున "శుద్ధప్రాచీ" యను స్థలమును సాధించుట తెలుపబడినది గదా? ఆ శుద్ధప్రాచీని కొద్దిపాటి సవరణతో "ఈశప్రాచీ"యను స్థలవిశేషమును సాధింప వచ్చును. గమనింపుడు -

"తద్వశాత్ కకుభంగ్రాహ్యాం తత్రసూత్రం ప్రసారయేత్
శుద్ధ ప్రాచీభవేత్సౌమ్య గైశాన్య ప్రాచ్యథోచ్యతే
ప్రాచ్యాంగుళ కృతాద్బింధో: ఉత్తరే చాంగుళంన్యశేత్
ప్రతిచీమాత్ర తద్బింధో: ఈశప్రాచీం ప్రసూత్రయేత్"
(మానసారము 17 పేజీ)

శుద్ధప్రాచీయను భూమికి ఈశాన్య కోణమువగల కొయ్యను, తూర్పుదిశగా ఒక అంగుళమును, ఉత్తరదిశగా ఒక అంగుళమును జరిపి మరల నాటవలయును. అట్లు నాటిన కొయ్యకు సూత్రమును కట్టవలయును. ఇప్పుడు నాలుగు సూత్రముల మధ్యస్థమగు స్థలముయొక్క ఉత్తర తూర్పు దిశలు కొలదిపాటిగ ఈశాన్య దిశాభాగమును ఆక్రమించి యుండును. కాబట్టి ఈ స్థలమును "ఈశప్రాచీ" యని యందురు. ఈశప్రాచీ అను పేరుగల స్థలమును గూర్చి మానసార మహర్షి -

"ముక్తి కామస్య కరణే శుద్ధ ప్రాచీం ప్రయోజయేత్
ఐశాన్య ప్రాచీసర్వస్య భోగకామస్య సమ్మతా
అగ్నేయ ప్రాచీసంయుక్తం సర్వదోష కరం భవేత్
ఆగ్నేయ ప్రాచికం వాస్తు తస్మాత్సర్వం విసర్జయేత్"
(మానసారము 17వ పేజీ)

అని వివరణ చేసియున్నాడు. ముక్తిని కోరువారు, ఆధ్యాత్మిక తత్వచింతనాపరులు"శుద్ధప్రాచీ"యను స్థలమునందు యిండ్లు నిర్మించుకొని యిష్టసిద్ధి పొందగలరని భావము.

"ఈశప్రాచీ" అను స్థలమునందు యిండ్లు నిర్మించుకొని నివసించు జనులు అష్టైశ్వర్యముల ననుభవించుచు ఇష్టకామ్యార్థ సిద్ధిని బొందగలరని మానసార మహర్షి అభిప్రాయము. కాబట్టి గృహనిర్మాణము చేయదలచిన ప్రతివారును తమ తమ గృహనిర్మాణములకు వినియోగించు స్థలమును ముందుగా వాస్తుశాస్త్రవేత్తల చేత "ఈశప్రాచీ" యగునట్లుగా సవరింపజేసికొని ఆ పిమ్మట ప్రాకారమునుగాని లేదా యధార్థముగా పరిహద్దు కంచెలనుగాని యేర్పరచుకొని ఆ పిమ్మటనే గృహారంభము చేయుటకు ప్రయత్నించుట యుక్తము.

"ఆగ్నేయ ప్రాచీ" అనగా స్థలము యొక్క తూర్పురేఖ యొక్క ఆగ్నేయమూలయందు తూర్పుదిశగా కొంచెము ఆక్రమించియున్న స్థలము. ఈ ఆగ్నేయ ప్రాచీ అను స్థలమునందిండ్లు నిర్మించుకొని నివసించువారు అనేక కష్టనష్టముల ననుభవింతురు. ఈ విషయమును గూర్చి మరియొక ప్రాచీన కారికను గమనింపుడు.

"మాషమాత్రంతు మీశాన్యం పుత్రదారాది లాభకృత్
విద్యావినోద పాండిత్యం చతుష్ప్రాజ్జీవ లాభద:
వ్రీహిమాత్రంతు ఆగ్నేయం సర్వగ్రహ భయం తథా
దేహరోగో విత్తనాశో బంధుహాని ర్భవిష్యతి"

ఈ పై ప్రమాణము ననుసరించి "మాష" అనగా మినపగింజంత పరిమాణము గల ఈశాన్యభాగము పెరిగియున్న స్థలము అందు నివసించు ప్రజలకు పెరిసంపదలనిచ్చును. అందు కాపురము చేయువారు విద్యావేత్తలుగను, వైజ్ఞానికులుగను, రాజకీయాధికారము గలవారుగను, నిత్యము పాడిపంటలతో తులదూగు వ్యవసాయదారులుగను వర్ధిల్లగలరు.

కాని వడ్లగింజ ప్రమాణమైనను ఆగ్నేయదిశ నాక్రమించిన తూర్పు పరిహద్దు గల ఆగ్నేయ ప్రాచీయను స్థలవిశేషము నందు యిండ్లు గట్టి నివసించువారు భూతప్రేత పిశాచ బాధలకు లోనగుదురు. నిత్యము రోగగ్రస్తులై, ఋణగ్రస్తులై, బంధువులు విరోధులు కాగా మనశ్శాంతి లేనివారై దుఃఖము ననుభవింతురు.

ఈ పై శ్లోకము అనేక వాస్తు గ్రంథములయందు ఉదహరింపబడినది. గృహవాస్తు గణిత రత్నావళి, నేమాని వాస్తు మొదలగు గ్రంథములందు కూడ ఉదహరింపబడియున్నది. ఏది యెట్లున్నను పై శ్లోక ప్రమాణము మానసార మహర్షి యభిప్రాయమును తదితర ఆధునిక వాస్తుశాస్త్ర కర్తల యభిప్రాయమును బలపరచుచున్నది. కాబట్టి సమస్తమైనవారికి "ఈశప్రాచీ" యుగ స్థలము గృహనిర్మాణమునకు తగినదిగా గ్రహింపవలయును.



# దిజ్మూఢము అనగానేమి?

దిజ్మూఢము అనగా వాస్తుశాస్త్ర పరిభాషలో ఆయా దిశభాగమున సమసూత్రమునకు లేక, లోపించియుండుట అని గమనింపవలయును. ఈ దిజ్మూఢ దోష పరిహారము కొరకు మయుడు తన మయమతము ఆరవ అధ్యాయమున దిక్పాధన చక్కగా వివరించియున్నాడు.

వక్ష్యేమ్యహమ్ దిక్పరిచ్ఛేదం శంకునార్కోధయే సతి
ఉత్తరాయణ మాసేతు శుక్లపక్షే శుభేదినే.

అనగా సూర్యోదయము ననుసరించి ఉత్తరాయణ కాలమున శుక్లపక్షము నందలి పంచాంగశుద్ధిగల శుభదినమున దిక్సాదన కుపక్రమింప వలయునని భావము. అట్లే విశ్వకర్మ వాస్తుశాస్త్రమునందు ఈ దిజ్మూఢ దోష నివారణ కొఱకు

"దిశాం కోణాస్తు చత్వారో నశస్తా ఆయలక్షణే
తస్మాత్సర్వ ప్రయత్నేన శుద్ధ ప్రాచీం సమాశ్రయేత్"

అనగా విదుక్కులయందు ఆయాది సాధనశ్రేష్ఠము గాదు. అనగా దిక్కులయందు తప్ప విదిక్కులయందు గృహాది నిర్మాణములు నింద్యములు అని భావము. కాబట్టి వాస్తుశాస్త్రవేత్తలు సర్వప్రయత్నముల చేతను "శుద్ధప్రాచీ" సాధన చేయువలయును. పై ప్రమాణమునమసరించి బాగుగా విమర్శ చేయుగా గృహనిర్మాణము నిమిత్తము పరిగ్రహించిన స్థలమునకు యేదిక్కుగాని, విదిక్కుగాని లోపించి యుండకూడదు. తూర్పు, ఉత్తరదిశలు ఈశాన్య కోణమున మాత్రము ఒకటి లేక రెండంగుళములు అధికముగా ఆక్రమించి యుండవచ్చును. అనగా ఈశాన్యదిశ పెరుగుదల యుండవచ్చును. ఈవిషయమును ప్రాచీనులు, ఆధునికులు అంగీకరించిరి.

గృహనిర్మాణమునకు మనము యెన్నుకొనబడు స్థలము సహజసిద్ధముగా దిక్సూచీ యంత్రమునకు సరిపడియుండుట అరుదైన విషయముగదా! అందుచేత శాస్త్ర విధి ననుసరించి స్థలముయొక్క నాలుగుదిశల సరిహద్దులను వంకరటింకరలు లేకుండ సమ సూత్రమునకు సవరించుకొని మిగిలిన హెచ్చుతగ్గులు గల భూమిని ప్రాకారమునకు బయట విడిచిపెట్టుటయే శ్రేష్ఠము. ప్రాకారము నిర్మించనిచో రేఖాప్రాయమగు గట్లు వేయించి స్థల నిర్ధారణ చేయువలయును. అట్లు

పరిగ్రహింపబడిన భూమికె వస్తువు, లేక వాస్తువు అని పేరు రూఢియగుచున్నది. ప్రాకారమునకు బయటవిడిచి పెట్టబడిన స్థలములయొక్క గుణదోషములు ప్రాకారమునకు లోపల గృహము నిర్మించుకొని నివసించు గృహకర్తకు అంటజాలవు. ఈ విషయమును స్పష్టపరచుచు మయబ్రహ్మ తన మయమతమునందు, గృహనిర్మాణమునకు పరిగ్రహింపబడిన భూమికే వస్తువు లేక వాస్తువు అని పేరు గలదని వివరించియున్నాడు. ఈ దిజ్మూఢ దోషమును గూర్చి సమరాంగణ సూత్రధారుని అభిప్రాయము గూడ పరిశీలింప వలసియున్నది.

పూర్వపశ్చిమ దిజ్మూఢం వాస్తు స్త్రీనాశకృద్భవేత్
ఉదగ్మూఢం ననిష్పత్తిం యాతి సర్వంచ నాశయేత్
యత్తు దక్షిణదిగ్మూఢం జాయతే మరణాయ తత్
ప్రాగ్వాస్తు నికుర్వీత ప్రాసాదం మందిరం పురే
(సమరాంగణం - **258**పేజీ)

తూర్పు దిశాభాగముగాని పశ్చిమ దిశాభాగము గాని లోపించియున్న నివాసస్థలమునందు యిండ్లు కట్టి నివసించువారికి స్త్రీహాని కలుగును. ఉత్తర దిగ్భాగము లోపించియున్న స్థలమునందు నివసించువారి సిరిసంపదలు నశించిపోవును. దక్షిణదిశా భాగము లోపించియున్న స్థలమువద్దు నివసించువారు అపమృత్యు భయము నందగలరు. కాబట్టి గృహసౌధాది నిర్మాణ కార్యములయందు దిజ్మూఢము లేని స్థలమును పరిగ్రహింప వలయునని భావము.

ఈ దిజ్మూఢ దోషమును గూర్చి శిల్పశాస్త్రములయందు యింత విపులముగా వివరింపబడియుండగా కొందరు ఆధునికులు ఈశాన్య దిశాభాగము యెంతగా పెరిగియున్న అంత శుభప్రదమని ఆ మూలను నియమవిరుద్ధముగా సాగదీయుచున్నారు. ఈ పద్ధతి శాస్త్ర నియమములకు విరుద్ధము. "అతిసర్వత్ర వర్జయేత్" అను న్యాయమునననుసరించి ఈ పద్ధతి సత్ఫలితముల నీయజాలదు. ఎందుచేతననగా నాలుగు దిశలు సమానముగా నున్న స్థలము యొక్క ఒక్కమూలను మిక్కిలిగా పొడిగించినచో ఆ స్థలము శూర్పాకారము అనగా చేట ఆకారమును సంతరించుకొనును. "శూర్పే ధనక్షయం విదు:" అను శాస్త్ర ప్రమాణమున్నది గదా? అట్టి శూర్పాకార స్థలమునందు నివసించువారు దుర్వ్యసనపరులై ధనవంతులు దరిద్రులగుదురు. కాబట్టి ఈశాన్యమూలను నియమ విరుద్ధముగా పొడిగింపరాదు.

## దిక్సాధన యందు విశేషవిధి :

శాస్త్రవిధులయందు సాధారణవిధులు విశేషవిధులు అను రెండు రకములున్నవి. జనసామాన్యమున కంతకు సర్వ సాధారణముగా ఆచరింపదగిన పద్ధతి సాధారణ విధి. ఈ సాధారణ నియమమునకు లోబడియుండని దేశకాల పరిస్థితులకు అనుకూలమగు పద్ధతిని విశేషవిధి యందురు. సాధారణవిధికి లోబడని కార్యమును, విశేష విధిచే సాధించుట శాస్త్ర సమ్మతము.

గృహనిర్మాణ స్థలమునకు వాస్తువు అనుపేరు గలదనియు ఆ వాస్తువునందు దిక్కులు లోపించి యుండరాదనియు యింతవరకు మనము చదివియుంటిమి. ఇట్టి దిఙ్మూఢ దోషమునకు పరిహార రూపమగు విశేషవిధి వివరింపబడుచున్నది.

గ్రామము, పట్టణము, పురము, నగరము మొదలగు నిర్మాణముల యందు ముందుగా దిక్సాధన చేసి ఆ సూత్రము ననుసరించి తూర్పు పడమరలకు గాని, ఉత్తర దక్షిణములకు గాని అభిముఖముగ నుండునట్లు వీధులు తీర్చి నిర్మించిన చోట్లయందును అతి విశాలములగు నివాసభూములయందు మాత్రమే దిఙ్మూఢము లేకుండ గృహ నిర్మాణము సాధ్యపడును.

దిశలకు అభిముఖములుగా లేని వీధులు గల చోటను వంకరటింకరలుగ పోయిన వీధులయందును, బహుకుశలములైన ఈనాటి నగరములయందలి నివాస స్థలముల యందును, దిక్సాధన చేసి గృహములు నిర్మించుట అసాధ్యము. అట్టి చోట్లయందు ఈ విశేషవిధి నాశ్రయింపక తప్పదు. ఈ విశేషవిధి విశ్వకర్మ వాస్తుశాస్త్రము 184వ పేజీయందు చక్కగా వివరింపబడియున్నది.

"ఆర్జవేన విహీనశ్చ కర్తరీ కృతమేవచ
శాస్త్రవిచ్ఛిల్ప కార్యజ్ఞః కారయే న్నకదాచన"
*(విశ్వకర్మవాస్తుశాస్త్రము 184 పేజీ)*

వ్యాఖ్యానము : "ఏకస్యామేవ వీథ్యాం పంక్తిశోభావర్జమ్ ఆర్జవాదిరహితమ్, చ నకారయే దిత్యుపదేశః" అని వివరింపబడినది.

ఆర్జవమనగా పంక్తిశోభ చెడకుండునట్లు నిర్మించుట. దీనికే ప్రక్కయింటి సారులు తప్పకుండ గృహమును నిర్మించుటయని అందురు. శాస్త్రకోవిదుడైన శిల్పి రాజవీథియందలి

యితర గృహములు యెట్లు నిర్మింపబడినవో ఆ శైలిని అనుసరించి ఆ రాజవీధియందలి యిండ్లయొక్క పంక్తిశోభ అనగా పారులు దప్పకుండ వీధికి సమాంతరముగా నుండువట్లు నూతన గృహనిర్మాణము చేయవలయును అని వివరింపబడినది.

దీని భావమేమనగా మనము యేవీధియందు గృహనిర్మాణము చేయదలచితిమో ఆ వీధియందున్న యిండ్లన్నియు యే వరుసలో నిర్మింపబడినవో ఆ వరుసక్రమము దప్పకుండ క్రొత్తగా నిర్మించు యిండ్లు నిర్మింపవలయును. అంతియేగాని దిక్సాధన చేసి అంతకుముందు నిర్మించిన యింటిపారులకు పంక్తులకు అడ్డదిడ్డముగా గృహనిర్మాణము చేయరాదని ఖండితముగా చెప్పబడినది. ఇక్కడ సాధారణ విధియగు దిక్సాధన ఉపకరించలేదు. ఇక్కడ వీధికి ప్రాముఖ్య మీయబడినది. వీధి దిక్కులకు అభిముఖముగా లేనప్పుడు విశేషవిధి నాశ్రయించి ఆ వీధియందు యింతకుముందు కట్టబడియున్న యిండ్ల పారులు చెడకుండ నూతన గృహనిర్మాణము చేయవలయునవి ఈ విశేషవిధి శాసించుచున్నది.

కావున శాస్త్రకోవిదుడైన శిల్పి "దిఙ్మూఢే కులనాశశ్యాత్" అను సాధారణ నియమమును యిక్కడ పాటింపబని లేదు. విశ్వకర్మ విధించిన విశేషవిధి నాశ్రయించి గృహనిర్మాణము చేయుటయే శుభప్రదమని విశదీకరింపబడినది. విజ్ఞులీ విషయమును బాగుగా పరిశీలింపనగును.

ముఖ్య గమనిక : గృహ ప్రాకారమునకు బయటగల స్థలములయందలి వాస్తుదోషములు గృహయజమానికి సంక్రమించునా? అని ప్రశ్న. గృహప్రాకారమునకు బయట గల స్థలములయందలి వాస్తుదోషములు ( ఆ స్థలముల యజమానునకు చెందినవైనను ఇతరులకు చెందినవియైనను) గృహయజమానునకు యెంతమాత్రమును చెందవని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఎందుచేతననగా మనము గృహనిర్మాణమునకు స్వీకరించిన భూమియే "వాస్తువు" అనబడును. విడిచిపెట్టబడిన భూమి వాస్తువని పిలువబడదు. అందుచేత గృహావరణకు అనగా ప్రాకారమునకు బయటగల భూమియందలి దోషములు గృహ యజమానుని వేధింపజాలవు. ప్రాకారమునకు బయటగల భూములను అన్యాక్రాంతము చేయుట అనగా యితరుల పేరున వ్రాయుటయో అమ్మివేయుటయో చేయవలయునని కొందరు ఆధునికులు వితండవాదము చేయుచున్నారు. ఇది పూర్తిగా అసంగతము. ఎందుచేతననగా ఒకచోట ఒక యజమానునకు ఒక యకరము భూమియున్నదని భావింపుడు. అక్కడ గృహనిర్మాణముకు తనకు కావలసినంత భూమిని స్వీకరించి ప్రాకారమేర్పరచు కొనును. ఇక మిగిలినది యితరులకు యిచ్చివేయ వలయునా? అట్లనుట అసంగతము.

మయవాస్తువందు గృహావరణ స్థలమునకే "వాస్తువు" అను పేరు చెల్లునని విస్పష్టముగా చెప్పబడి యున్నది. విజ్ఞులు ఈ విషయమును గ్రహింతురు గాక.



# దిక్కులు - వర్గులు

మనము నివసించు భూమి గుండ్రని బంతివలె అనంతమగు ఆకాశమున తేలియాడుచున్న ఒక గోళము. అట్టి ఈ భూగోళము తన యిరుసుపై బొంగరమువలె తనచుట్టూ తాను తిరుగుచూ ఒక నిమిషమునకు 1100 మైళ్ళ వేగముతో సూర్యునిచుట్టూ పరిభ్రమించుచున్నది. అట్టి భూమిమీద సూర్యోదయ సూర్యాస్తమయముల ననుసరించి దిక్పరిజ్ఞానము గలుగుచున్నది.

తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము ఈ నాలుగు దిక్కులనబడును. ఆగ్నేయము, నైఋతి, వాయవ్యము, ఈశాన్యము ఈ నాలుగు విదిక్కులనబడును. ఈ దిక్కులు నాలుగు విదిక్కులు నాలుగు మొత్తం యెనిమిదింటిని దిక్కులనియే వ్యవహరించుట పరిపాటి. గృహ నిర్మాణ స్థలమును యేయే దిక్కున కెంతభాగము చెందునో ఈ క్రింది పద్ధతిననుసరించి గుర్తింపవలసి యున్నది.

| శ | అ | క |
|---|---|---|
| ఈ | తూ | ఆ |
| ఉ |  | ద |
| వా | ప | నై |

యు (left of middle row) ; చ (right of middle row) ; ప, త, ట (below the grid)

గృహనిర్మాణ స్థలమును తొమ్మిది సమభాగములుగ విభజించి, అందు మధ్యభాగము బ్రహ్మస్థానముగ విడిచిపెట్టి మిగిలిన యెనిమిది భాగములయందు తూర్పు మొదలుగ యెనిమిది దిక్కులకు ఆధిపత్యము చెల్లును.

గృహనిర్మాణ స్థలమునందలి యెనిమిది దిక్కులయందు భాషయందలి అక్షరములు యెనిమిది వర్గులుగా వర్గీకరించి యున్నారు. వీటిని "అష్టవర్గులు" అందురు.

"అ,క,చ,ట,త,ప,య,శ అష్టవర్గాః

ఆద్యాః శాంతాః అష్టవర్గా దైవజ్ఞవచ నైఋభాః
దంపతీ, స్వామి, భృత్యేచ గృహగ్రామాధిపే గణాః
అఇఉఏ తార్క్ష్యః పూర్వే ఆగ్నేయాంచ కఖాదికాః
దక్షిణేచ చవర్గాశ్చ నైఋతేచ టతాదికాః
పశ్చిమే తథాది వర్గాః వాయవ్యేచ పఫాదికాః
ఉత్తరేచయ,ర,ల,వా ఈశానేశ,ష,సా,స్థితాః"

(అపరాజిత పృచ్ఛ 104)

ఈ పై శ్లోకభావము క్రింది పట్టిక వలన సుబోధకము కాగలదు. యావత్ భారతదేశమునందును ఈ వర్గారూఢ పరిజ్ఞానము జ్యోతిశ్శాస్త్రమున ముఖ్యాంశముగా పరిగణింపబడుచున్నది. వాస్తుశాస్త్రమునందు గ్రామార్వణము, క్షేత్రార్వణము, గృహార్వణము, భృత్యార్వణము మొదలగు అర్వణ సంబంధములగు శుభాశుభ ఫలములను ఈ వర్గారూఢ పద్ధతి బట్టియే పరిశీలించుట శాస్త్ర విహితము.

| దిక్కులు | దిక్పతులు | వర్గులు | వర్గాక్షరములు | యోని | ఆయము |
|---|---|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | అ వర్గు | అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౡ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ | గరుడము | ధ్వజము |
| ఆగ్నేయం | అగ్ని | క వర్గు | క ఖ గ ఘ ఙ | మార్జాలము | ధూమము |
| దక్షిణం | యముడు | చ వర్గు | చ ఛ జ ఝ ఞ | సింహము | సింహము |
| నైఋతి | నిఋతి | ట వర్గు | ట ఠ డ ఢ ణ | శునకము | శ్వానము |
| పడమర | వరుణుడు | త వర్గు | త థ ద ధ న | సర్పము | వృషభము |
| వాయవ్యం | వాయువు | ప వర్గు | ప ఫ బ భ మ | మూషికము | ఖరము |
| ఉత్తరం | కుబేరుడు | య వర్గు | య ర ల వ | ఏనుగు | గజము |
| ఈశాన్యం | రుద్రుడు | శ వర్గు | శ ష స హ | శశకము | కాకము |

వర్గారూఢ చక్రము

అకారాదిషు వర్గేషు దిక్ష్వష్టసు యథాక్రమమ్
గృధ్రమార్జాల సింహాశ్వ సర్పాఖు గజశాశకా:
దిగ్వర్గాణామియం యోని: స్వరర్గాత్పంచయో రిపు:
రిపు వర్గం పరిత్యాజ్య శేషవరా: శుభప్రదా:

(వశిష్ట సంహిత)

ఈ శ్లోకభావము కూడా పై చక్రముచేత సుస్పష్టముగా తెలుసుకొనగలరు. మరియు స్వ వర్గునకు ఐదవ వర్గము శత్రుస్థానము. కాబట్టి శత్రువర్గు నందు గృహనిర్మాణము చేయరాదని నిషేధింపబడినది. మిగిలిన అన్ని వర్గస్థానముల యందు గృహనిర్మాణము చేయుట శుభప్రదమని వశిష్టమహర్షి అభిప్రాయము.

గృహనిర్మాణమునందు ఈ వర్గారూఢము ననుసరించి యజమానుడు యే వర్గునకు చెందినవాడో ఆ వర్గునకు యే ఆయము లేక "యోని" అగునో తద్వారా ఆ గృహనిర్మాణము చేయు యజమానికి చెందిన ఆయము ననుసరించి ముఖద్వార నిర్ణయము చేయవలసి యున్నది. కాబట్టి ఆయ విచారణ ప్రస్తుత కర్తవ్యము.



# ఆయ విచారణ

గృహ, గ్రామ, నగరాది నిర్మాణములయందు ఆయాది సాధన ముఖ్యవిషయముగ మయుడు వక్కాణించియున్నాడు. మానసారము, సమరాంగణము, అపరాజితపృచ్ఛ, విశ్వకర్మ వాస్తుశాస్త్రము, శిల్పరత్నము మొదలగు గ్రంథములన్నియు ఆయాది సాధన గృహనిర్మాణ విషయమున ప్రాణమువంటిదని నొక్కి చెప్పబడినది.

ఆయాదీ, సంపదర్థం, వృద్ధిం, హానిం, చయష్టిభి, కుర్యాత్
ఆయ, వ్యయ, రక్ష, యోన్యా, యుభి, రథ, తిథిబిశ్చ వారైశ్చ
యజమాన వస్తునామ, జన్మరక్షనా విరోధికమ్ యత్తు"

(మయమతం 62 పేజీ)

అనగా సుఖసంపదల కొఱకు గృహనిర్మాణ స్థలముయొక్క పొడవు వెడల్పుల ననుసరించి పిండమును సాధించి ఆ పిండము ప్రాతిపదికగా ఆయము (ధనము), వ్యయము (ఋణము) నక్షత్రము యోని (ఆయము) అంశ, తిథి, వారము అను ఈ సప్తవర్గము సాధించి శుభాశుభ ఫలితములను గమనింపవలయునని భావము. మరియు గృహ యజమాని నామనక్షత్రమునకును, జన్మనక్షత్రమునకును విరోధముగాని తారయు, యోనియు ఉండునట్లుగా సాధింపవలయునని మయుని యభిప్రాయము. ఈ ఆయాది సాధనవిధిని మయుడు యిట్లు వివరించినాడు -

"వ్యాసాయామ సమూహే వసునిధి గుణితే
దినేశ ధర్మహృతే హృతశ్శేషమ్
ఆయవ్యయ మవశిష్టం రామఘ్నే ష్టాపహృచ్ఛేష్టమ్
ధ్వజ, ధూమ, సింహ, శ్వా,వృష,ఖర,గజ,కాకశ్చ,
యోనిగణాః"

(మయమతం 9 అధ్యాయం 62 పేజీ)

పై ప్రమాణము ననుసరించి "వ్యాపాయామ సమూహము" అనగా గర్భము యొక్క రెండు పొడవులు + రెండు వెడల్పులు = పరిధి లేక చుట్టుకొలత "పిండము"గా మయునిచేత పరిగ్రహింపబడినది. అట్టి పిండమును ప్రాతిపదికగా గ్రహించి ఆయాది సాధన చేయవలసి యున్నది. పిండమును 3చేత గుణించి 8చేత భాగింపగా వచ్చిన శేషము ధ్వజాది ఆయము (యోని) అగును. ఆంధ్రదేశమున ఆయము అని వ్యవహరింపబడుచోట సంస్కృత గ్రంథము లన్నింటియందు "యోని" అని వ్యవహరింపబడుచున్నదిగా విజ్ఞులు గ్రహింపవలయును. ఈ ధ్వజాది ఆయములు యెనిమిది - ధ్వజ, ధూమ, సింహ, శ్వాన, వృష, ఖర, గజ, కాకాయములు అనునవి. ఈ యెనిమిది ఆయములు వరుసగా తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పడమర, వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము అను యెనిమిది దిక్కులయందు అధివసించియుండును.

ఈ          తూ          ఆ

| | | |
|---|---|---|
| కాక | ధ్వజ | ధూమ్ర |
| గజ | | సింహ |
| ఖర | వృష | శ్వాన |

ఉ (left)    ద (right)

వా          ప          నై

ఈ చక్రము ననుసరించి ఆయా దిక్కులయందు ఆయా ఆయములు అధివసించి యుండును. ఈ ఆయము పరస్పరాభి ముఖములు గలవై ఒకదానినొకటి చూచుకొను చుండును. అనగా ధ్వజము వృషభమును, వృషభము ధ్వజమును చూచుచుండును. అట్లే సింహము గజమును, గజము సింహమును చూచుచుండును. ఈ పరస్పర దృష్టిని బాగుగా పరిశీలింప వలసియున్నది. ఏమందురా -

"దిగ్వర్గాణా మియం యోనిః స్వవర్గాత్పంచమోరిపుః
రిపువర్గం పరిత్యాజ్యం శేషవర్గః శుభప్రదః"

అను శాస్త్రప్రమాణముచేత ప్రతి ఆయము (యోని) తనకు అయిదవ స్థానమునందున్న ఆయమునకు శత్రువగుచున్నది. ధ్వజము వృషభమునకు శత్రువు. అట్లే సింహము గజమునకు శత్రువు. గజము అనగా యేమగు సింహమునకు శత్రువు. అట్లే మిగిలిన ఆయవర్గమును గూర్చి గ్రహింపగలరు. అయితే ఈ యెనిమిది ఆయముల యందును విషమాయములగు -

"అష్టౌయోనయ ఉదితా, ధ్వజ, హరి,వృష, హస్తిన:, శుభగా:" అని మయుడు స్పష్టపరచి యున్నాడు. మరియొక శాస్త్రవచనమును గమనింపుడు -

యోని: ప్రాణాయేవ ధామ్నాం యదస్మా
ద్గ్రాహ్యా స్తత్తద్యోగ్య యోని ప్రభేద:

అను ప్రమాణము చేత గృహనిర్మాణమునకు యోని లేక ధ్వజాది ఆయవర్గసాధనము ప్రాణమువంటిదని ఋజువగుచున్నది. కాబట్టి సమస్త నిర్మాణ కార్యములయందు ఆయాది శుభవర్గసాధన చేయవలయును. మయబ్రహ్మ యొక్క ఈ క్రింది వాక్యమును గూడ గమనించుట ముఖ్యము.

ఆయాధిక మధసుఖదం వ్యయమధికం సర్వనాశంస్యాత్
విపరీతేతు విపత్యై తస్మాత్ సమ్యక్ పరీక్ష్య కర్తవ్యమ్
(మయమతం 62 పేజీ)

ఆయము అనగా ధనము అధికముగా నున్న సుఖప్రదము, వ్యమధికముగానున్న సర్వ నాశనము కలుగునని ఈ ఆయాది సాధన గూర్చి వేలాది సంవత్సరములకు పూర్వమే మహోత్సన్నంపన్నుడు, ఆద్యశిల్ప ఋషియగు మయబ్రహ్మ వివరించి యుండ, అల్పజ్ఞులగు ఆధునికులు కొందఱు ఈ ఆయాది వర్గసాధన కొందఱు కల్పించిన బూటకపు పద్ధతియని విరసించుచున్నారు. ఇట్లు విరసించుట వారికి గల శాస్త్ర పరిజ్ఞానమునకు నిదర్శనము మాత్రమే యని విజ్ఞులు గ్రహింపగలరు. రాశ్యానుకూలమగు ఆశయములు :

మీన వృశ్చిక కుళీరాణాం ధ్వజాయ శ్శుభదో మత:
వృషభాయ శ్శుభప్రోక్తో మేషసింహ ధనుర్భృతాం

తులా మిధున కుంభానాం గజాయో వాంఛితప్రదః
వృష కన్యా మృగాణాంచ సింహాయ శ్శుభదో భవేత్
(జ్యోతిర్నిబంధము)

అనగా
ధ్వజాయము = కర్కాటక వృశ్చిక మీన రాసులవారికి శ్రేష్ఠము
సింహాయము = వృషభ కన్యా మకర రాసులవారికి శ్రేష్ఠము
వృషభాయము = మేష సింహ ధనూరాసుల వారికి శ్రేష్ఠము
గజాయము = తులా మిథున కుంభ రాసులవారికి శ్రేష్ఠము

ముఖ్య గమనిక : ఈ పై నిర్ణయము నామరాశి పరత్వమైనది. నామరాశి ననుసరించి పైనుదహరించిన పద్ధతిలో రాశ్యానుకూలమగు ఆయము గృహ గణితాగత ఆయము సరిపడనిచో గృహ యజమానుని వర్గు ననుసరించి శత్రు వర్గముగాని ఆయమును సాధించి గృహ నిర్మాణమును సాగించుట శిల్ప సమయము.

ధ్వజాయము : అన్ని వర్గులవారికి శ్రేష్ఠమైనది. "త" వర్గు వారికి మాత్రము శత్రువర్గ మగుట చేత శుభప్రదము గాదు. నామరాశికి యోగ్యమయినచో గ్రహింపవచ్చును.

సింహాయము : "య" వర్గువారు మాత్రము సింహాయము గల గృహమును నిర్మింపరాదు.

వృషభాయము : "అ" వర్గువారు వృషభాయపు గృహమును నిర్మింపగూడదు. కాని నామ ప్రథమాక్షరము "అ" గల అప్పన్న అయ్యన్న మొదలగువారు వృషభాయ గృహము నిర్మింపవచ్చును.

గజాయము : "చ" వర్గువారు గజాయపు గృహము నిర్మింపరాదు.

గమనిక : పైనుదహరించిన రాశ్యానుకూలమగు ఆయమును గాని అది సాధ్యముగానిచో వర్గునకు శత్రువర్గము గాని ఆయమును గాని సాధించి గృహ నిర్మాణము చేయుట అవశ్య కర్తవ్యము.

# వాస్తుపురుష నిర్ణయము

"సూర్యయేవ త్రిలోకస్య మూలం పరమ దైవతమ్
ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః
సూర్యాత్ప్రసూయతే సర్వం తస్మిన్నేవ ప్రలీయతే."

అను భవిష్యత్పురాణ వాక్యము ననుసరించి ఈ సమస్త చరాచర జగత్తునకు మూల భూతమైనవాడు సూర్యుడు. ఈ విషయమును నేటి విజ్ఞానవేత్తలు కూడ కాదనజాలరు. అట్టి సూర్యుడే విశ్వకర్మయని శృతులు పలుకుచున్నవి. "విశ్వకర్మా సహస్రాంశౌ" అను ప్రమాణము చేత విశ్వకర్మయే సూర్యుడని ఋజువగుచున్నది. "వాస్తోష్పతిర్విశ్వకర్మా" అను శృతిప్రమాణము ననుసరించి వాస్తోష్పతియే విశ్వకర్మయని తెలియబడుచున్నది. కాబట్టి విశ్వకర్మయే సూర్యుడు. ఆ సూర్యుడే వాస్తోష్పతి. వాస్తోష్పతి యనగా వాస్తుపురుషుడు. అందుచేత వాస్తు పురుషుడనగా సూర్యుడేయని ఋజువగుచున్నది.

సమస్త శిల్ప శాస్త్రములయందు వాస్తుపురుష పరిభ్రమణము సూర్యగమనము ననుసరించియే చెప్పబడినది కావున, వాస్తుపురుష నామము సూర్యతేజస్సునకు ఆపాదింపబడినదని తెలియవలయును. విద్యామాధవీయము అను గ్రంథమునందు -

"మార్తాండారూఢరాశౌ వినిహితచరణ స్తన్మదన్యస్తమూర్ధా
వామేపార్శ్వే శయానో భ్రమతి సపరితః పురుషో వాస్తురూపః"

అని వాస్తుపురుష పరిభ్రమమును గూర్చి వివరింపబడినది. వాస్తుపురుషుడు సూర్యుడున్న రాశియందు పాదములుంచి దానికి యేడవరాశి యందు శిరమునుంచి యెడమప్రక్కగా శయనించి నాలుగు దిక్కులయందు పరిభ్రమించుననని గదా దీని భావము. కాబట్టి జగత్కర్తయగు సూర్యునకు, సూర్యగమనము ననుసరించి పరిభ్రమించు వాస్తు పురుషునకు అవినాభావ సంబంధము సిద్ధించుచున్నది. అతీంద్రియ దృష్టిగల మయ విశ్వకర్మాది శిల్పముని గణము అనేక ఖగోళ పరిశోధనలు జరిపి, తద్వారా అద్భుతమగు

సాంకేతిక రహస్యములను కనిపెట్టి యేయే కాలములయందు సూర్యకిరణ ప్రసారము యెట్లు జరుగుచున్నదో, ఆయా కాలములయందలి సూర్యకిరణముల నుండి వెలువడు కాంతి తరంగముల ప్రభావము యెట్టిదో, తత్ఫలితముగా ఆయా నిర్ణీత కాలములయందు యెట్టి నిర్మాణములు ప్రారంభించిన యేయే విధమగు ఫలితములు కలుగ గలవో సాంకేతిక పరముగ నిర్ధారించి ఆయా సాంకేతిక రహస్యములన్నియు "వాస్తు పురుష స్వరూపము" అను పేరుతో సూత్రబద్ధము చేసియున్నారు.

మరియొక ముఖ్యవిషయము గమనింపదగియున్నది. సమస్త వాస్తుశాస్త్రములయందు వాస్తుపద విన్యాసము, మూలకందముగా చెప్పబడియున్నది. అట్టి వాస్తుపద విన్యాసమునందలి వాస్తుదేవతా పద భోగములను గమనించినచో సూర్యుని తేజస్సులకును ఈ వాస్తు పద భోగములకును సంబంధము కనబడుచున్నది. సూర్యకిరణముల నుండి వెలువడు కాంతి తరంగములను సూక్ష్మాతిసూక్ష్మముగ పరిశోధించి అందలి శక్తులకు ప్రత్యేకములగు దేవతా నామములను కల్పించి వాస్తుపద విన్యాసమునందు స్థానము కల్పింపబడినదని ఋజువగు చున్నది. కాబట్టి సూర్యతేజస్సే వాస్తుపురుష స్వరూపమనియు సూర్యగమనమే వాస్తుపురుష పరిభ్రమణమునకు ఆధారమనియు గ్రహింపవలయును. ఇది మన శిల్ప ఋషుల విజ్ఞాన ప్రతిభకు దర్పణము వంటిది.

ఆ వాస్తుపురుష నిర్ణయము ముఖ్యముగా గృహారంభ ముహూర్తమునకు సంబంధించి చెప్పబడినది. వాస్తుపురుష పరిభ్రమణము ననుసరించి యేయే మాసములలో ప్రారంభించిన యిండ్లకు యేయే దిశలయందు ముఖద్వారము అనగా ముంగిలి నిర్ణయించవలెనో ప్రస్తావించ బడినది.

వాస్తుపురుష నిర్ణయము మూడు విధములు. స్థిరవాస్తు పురుషుడు, చరవాస్తు పురుషుడు, దినవాస్తు పురుషుడు.

**స్థిరవాస్తు పురుషుడు :** ఈ స్థిరవాస్తు పురుషుడు గృహనిర్మాణ క్షేత్రమున సమస్త వాస్తుపద దేవతాత్మకుడై ఈశాన్యకోణమున శిరస్సును నైఋతి కోణమున పాదములును ఉంచి శయనించి యుండును. ఈ స్థిరవాస్తు పురుష ననుసరించియే చతుష్షష్టి పదవాస్తువు ఏకాశీతిపద వాస్తువు, శతపద వాస్తువు, అనుపదత్రయ వాస్తు దేవతాపద భోగనిర్ణయము

ముఖద్వార స్థాననిర్ణయము మొదలగు అనేక శిల్ప శాస్త్ర రహస్యములు వివరింపబడినవి.

**చరవాస్తు పురుషుడు :** ఈ చరవాస్తు పురుష స్వరూపమే మాసవాస్తు పురుష స్వరూపముగా లోకమున వ్యవహరింపబడుచున్నది. గృహనిర్మాణ స్థలమున స్థిరముగానున్న వాస్తుపురుషుడు సూర్యసంచారము లేక భూపరిభ్రమణ ప్రభావము చేత నాలుగు దిశలకు పరిభ్రమించుచున్నాడు.

"త్రిషుత్రిషుచ మాసేషు నభస్యాదిషు చక్రమాత్
యద్దిన్ముఖో వాస్తునరః తన్ముఖం సదనం శుభమ్"

(విశ్వకర్మ ప్రకాశిక 17 పేజీ)

"యద్దిన్ముఖో వాస్తుపురుషః కుర్యాత్తద్దిన్ముఖమ్ గృహమ్"

(నారద సంహిత)

పై నుదహరించిన శాస్త్ర ప్రమాణముల ననుసరించి యేయే కాలములయందు వాస్తుపురుషుడు యేయే దిశలను చూచుచుండునో ఆయాదిశలకు అభిముఖముగ, ముఖ ద్వారముల నుంచి గృహనిర్మాణము చేయవలయునని స్పష్టమగుచున్నది. గమనింపుడు.

భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసములయందు = తూర్పు శిరస్సుగాను
మార్గశిర,పుష్య, మాఘమాసములయందు = దక్షిణ శిరస్సుగాను
ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములయందు = పడమర శిరస్సుగాను
జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ మాసములయందు = ఉత్తర శిరస్సుగాను

వాస్తుపురుషుడు యెడమప్రక్కగా పరుండి యుండును. కాబట్టి ఈ చరవాస్తు పురుషుని దృష్టిని ప్రసరించు దిక్కున ముఖద్వారము గల గృహములను మాత్రమే ఆయా శుభకరములగు మాసములయందు నిర్మించుట ఆచారసిద్ధముగా నున్నది. ఇంకను ఈ క్రింది వివరణమును గమనింపుడు.

**తూర్పు శిరస్కుడు :**

భాద్రపద, ఆశ్వయుజ, కార్తీకమాసముల యందు వాస్తుపురుషుడు తూర్పున శిరస్సు, పడమర పాదములు ఉంచి యెడమ పార్శ్వముగ శయనించి యుండును. కాబట్టి ఆతని పూర్ణదృష్టి దక్షిణదిశయందు ప్రసరించును. పాదదృష్టి పడమర దిక్కుగా పడును.

ందుచే ఆశ్వయుజ, కార్తీక మాసములయందు దక్షిణ సింహద్వారము గల యిండ్లు పడమర ంహద్వారము గల యిండ్లు నిర్మింపవచ్చును.

## దక్షిణ శిరస్కుడు :

మార్గశిర, పుష్య, మాఘ మాసములయందు వాస్తుపురుషుడు దక్షిణదిశయందు రస్సును ఉత్తరమున పాదములును ఉంచి యెడమప్రక్కగా పరుండి యుండును. ఆతని పూర్ణదృష్టి పడమర దిశయందును, పాదదృష్టి ఉత్తరదిశగాను ప్రసరించును. కాబట్టి మార్గశిర, మాఘ మాసములయందు పడమర సింహద్వారము గల యిండ్లును, ఉత్తర సింహద్వారము గల యిండ్లును గట్టవచ్చును.

## పశ్చిమ శిరస్కుడు :

ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములయందు వాస్తుపురుషుడు పడమర దిశయందు శిరస్సును, తూర్పుదిశయందు పాదములును ఉంచి యెడమప్రక్కగా శయనించి యుండును. ఆతని పూర్ణదృష్టి ఉత్తరదిక్కునందును, పాదదృష్టి తూర్పుదిక్కునందును ప్రసరించును. అందుచేత ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములయందు ఉత్తరముఖ ద్వారము, తూర్పు ముఖ ద్వారము గల యిండ్లు నిర్మింపవచ్చును.

## ఉత్తర శిరస్కుడు :

జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణమాసముల యందు వాస్తుపురుషుడు ఉత్తరదిశయందు శిరస్సును, దక్షిణదిశగా పాదములును ఉంచి శయనించును. అతని పూర్ణదృష్టి తూర్పుదిశ యందును, పాదదృష్టి దక్షిణదిశయందును ప్రసరించుచుండును. కాబట్టి జ్యేష్ఠ, శ్రావణమాసములలో తూర్పు సింహద్వారము గల యిండ్లును దక్షిణ సింహద్వారము గల యిండ్లును నిర్మించుట శుభప్రదము.

## గమనిక :

ఈ వాస్తుపురుష పరిభ్రమణమును బట్టి ముఖద్వారమునే నిర్ణయింపవలయును. కాని కొందరు గృహనిర్మాణ స్థలమునందే దిశను, గృహనిర్మాణము చేయుచున్నామో ఆ దిశయందు వాస్తుపురుషుని దృష్టి ప్రసరింపరాదని చెప్పుచున్నారు. ఈ విషయము శాస్త్రీయము గాదు. ఏమందురా? ఈ క్రింది శాస్త్ర ప్రమాణములను పరిశీలింపుడు -

"యద్దిఙ్ముఖో వాస్తునర: తన్ముఖం సదనం శుభమ్"

(విశ్వకర్మ ప్రకాశిక 17 పేజీ)

దేవాగారం గృహం యత్ర నకుర్యాచ్చిర సన్ముఖమ్
మృత్యురోగ భయానిత్యం శస్తంచ కుక్షిసన్ముఖమ్
కన్యా తులా వృశ్చికే చ భాస్కరో యది సంస్థిత:
పూర్వేముఖం న కర్తవ్యం గృహం భవతి నిష్ఫలమ్
మకరే చైవ ధనుషి కుంభేవా చ దివాకరే
యామ్య దిశిముఖే కుర్యాద్రాజ చౌరాగ్నిజం భయమ్
మీనే మేషే వృషాచైవ పశ్చిమాదిక్చ దూషితా
స్త్రీణాం రోగం మహాఘోరం భవతి హ్యాతిదారుణం
మిధునే సింహ కర్కేచ వేశ్మ నైవోత్తరాననం
దోషశోక భయం తత్తు నకూర్యాశ్చ విచక్షణై:

(అపరాజిత పృచ్ఛ 148 పేజీ)

ఈ శాస్త్ర ప్రమాణము ననుసరించి వాస్తుపురుష పరిభ్రమణము ముఖ్యముగా ముఖద్వార నిర్ణయమునకే యని విశదమగుచున్నది. భావము సులభగ్రాహ్యము. కాబట్టి వాస్తుపురుష నిర్ణయము గృహారంభ సమయమున ముఖద్వార నిర్ణయమునకు మాత్రమే పరిమితమైనదని విజ్ఞులు గమనింపనగును.

## దినవాస్తు పురుషుడు :

శరవేగముతో పురోగమించుచున్న కాలమున మానవుని అవసరములును మిక్కుటమగుచున్నవి. దినదినమునకు మానవుని ఆశలు, ఆశయములు మితిమీరు చున్నవి. ఇట్టి అనంతమగు కాల ప్రవాహ వేగమున బడి కొట్టుమిట్టాడుచున్న మానవునకు ఓర్పు నశించుచున్నది. జనసాంద్రత అదుపు దప్పుచున్నది. ఇట్టి పరిస్థితులలో మాసవాస్తు పురుష ననుసరించి అనగా భూ పరిభ్రమణ సాంకేతిక పరిజ్ఞానము ననుసరించి గృహనిర్మాణము

చేయు శుభ ముహూర్తము కొఱకు వేచియుండ జాలకున్నాడు. తపస్సంపన్నుడు, కాళికా వరప్రసాద లబ్ద విజ్ఞానధనుడు అగు 'కాళిదాసు' తాను రచించిన కాలామృత మను సుప్రసిద్ధ జ్యోతిషశాస్త్ర గ్రంథమున భూభ్రమణము ననుసరించి సాంకేతిక పరిజ్ఞానము గ్రహించి దినవాస్తు పురుష స్వరూపమును ప్రతిపాదించి యున్నాడు. కాలామృతము యావద్భారత దేశమునందును ప్రామాణికమగు, జ్యోతిష గ్రంథముగ అంగీకరింపబడినది గదా!

ఈ దినవాస్తు పురుషునకే "క్షణిక వాస్తుపురుషుడు" అను నామాంతరము గలదు. మాసవాస్తు పురుషుడు భాద్రపదాది మూడేసి మాసముల చొప్పున క్రమముగా తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కుల శిరస్సు గలవాడగుచు ఎట్లు పరిభ్రమించుచుండునో అట్లే ఈ భూగోళము తన చుట్టును తాను తిరుగు "భూభ్రమణము" అను కారణము చేత దినవాస్తు పురుషుడు సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయ మగువరకు ఝామునకు ఒక్కొక్క దిక్కునందు శిరముంచి రెండు ఆ వృత్తులు తిరుగును. గమనింపుదు-

ఏక ద్వి త్రి చతుష్టయే ష్వనుదినం యామేషు సూర్యోదయా
త్సౌమ్య ప్రాగ్యమ, పశ్చిమేషు దివసే తద్వ్యక్ష పాయామపి
వాస్త్యేశో భువిసంవిశేత్ ప్రథమతో యద్వ్యచ్ఛతద్వ్యత్క్రమాత్
విజ్ఞేయం క్షణవాస్తునామ తదిదం స్థంభప్రతిష్ఠాగమే

(కాలామృతం)

పై ప్రమాణము ననుసరించి పగలు ఉదయము నుండి

మొదటి ఝామున - ఉత్తర శిరస్కుడుగను

రెండవ ఝామున - తూర్పు శిరస్కుడుగను

మూడవ ఝామున - దక్షిణ శిరస్కుడుగను

నాలుగవ ఝామున --పశ్చిమ శిరస్కుడుగను

మరల అట్లే రాత్రి మొదటి భాగమున ఉత్తర శిరస్కుడుగను క్రమముగా పరిభ్రమించు చుండును. మిగిలిన నియమములన్నియు మాసవాస్తు పురుష నిర్ణయమునందు వలెనే గ్రహింపనగును.

ఈ క్షణవాస్తు విధానము బహు సూక్ష్మమగు సాంకేతిక పరిశీలనముతో సాధింపబడినది. ఎందుచేతననగా వస్తువు అణురూపమును పొందిన కొలది దానియందలి శక్తియు యినుమడించుచున్నది. అట్లే కాలమును సూక్ష్మ విభాగము చేసిన కొలదియు దానిశక్తి లేక ప్రభావము మిక్కిలి వృద్ధి చెందుచున్నది. కాబట్టి ఊహాతీతముగా పరిభ్రమించుచున్న ఆధునిక కాలచక్రమునబడి అలసిపోవుచున్న మానవాళికి ఈ క్షణవాస్తు పురుష స్వరూపము నిర్మాణ కార్యములయందు మిక్కిలి ఉపయోగకరముగ నుండగలదనియు కాళిదాస మహాకవి దీనిని మనకు ప్రసాదించినాడు.



# సింహద్వార నిర్ణయవిధి

ఆద్యశిల్ప ఋషులు గృహమును మానవదేహముగా భావించి రూపకల్పన చేసియుండిరి. అట్టి గృహస్వరూపుడగు పురుషుడే వాస్తుపురుషుడు. ఆ వాస్తుపురుషుని ముఖము సింహద్వారము. సింహద్వారమునకు రెండుప్రక్కల గల కిటికీలు వాస్తుపురుషుని నేత్రములు. మిగిలిన కిటికీలు ముక్కు రంధ్రములు. గృహముయొక్క గర్భము వాస్తుపురుషుని గర్భము. సింహద్వారమునకు ముందున్న వాకిలి అను ఖాళీ స్థలము శ్వాసకోశము అనగా ఊపిరితిత్తులు. ఇంటియొక్క పాదవు వాస్తుపురుషుని యెత్తు. వెనుబద్ద, వాస్తుపురుషుని వెన్నుదండి. గృహమధ్యమున గల "రంగము" అనబడు పోలు వాస్తుపురుషుని హృదయము. ఇంటియొక్క చిప్పతట్లులు రెండూ వాస్తు పురుషుని రెండు కర్ణములు అవగా చెవులు. మిగిలిన సర్వద్రవ్యములు అలంకారములు. ఈ సంపూర్ణ గృహస్వరూపమే వాస్తు పురుష స్వరూపముగా మన పూర్వ ఋషులు దర్శించిరి.

వాస్తుపురుష స్వరూపమగు గృహనిర్మాణము నందు సింహద్వార నిర్ణయము బహు క్లిష్టమగు సమస్య. "గాత్రస్య సర్వస్య శిరః ప్రధానమ్" అను వాక్యము ననుసరించి సమస్త మానవ శరీరమునకు శిరస్సే ముఖ్యమైనది గదా ! అట్లే గృహ స్వరూపుడగు పురుషునకు సింహద్వారము ముఖమగుటచేత ఈ ముఖద్వార నిర్ణయము ముఖ్యమైనది. మిగిలిన అవయవములన్నియు యెంత అందముగా నున్నను, ముఖము కళ దప్పినచో యెట్లుండును. కాబట్టి సింహద్వారమును నిర్ణయించునపుడు చాల నిశితముగా కడు సూక్ష్మదృష్టితో పరిశీలింప వలసియున్నది. ఈ సింహద్వార నిర్ణయము ఐదు విధములుగా విమర్శింపవచ్చును.

1. గృహ నిర్మాణ స్థలము ననుసరించి,
2. గృహకర్త వర్గు ననుసరించి,
3. గృహకర్త నామరాశి ననుసరించి,
4. గృహగణితాగత ఆయము ననుసరించి,
5. వాస్తు పురుషు ననుసరించి.

ఈ అయిదు విధములుగా ముఖద్వార విమర్శనమున కుపక్రమించుటకు ముందుగా "గృహాగ్రము" అనగా యింటికి ముందుభాగమును "గృహపృష్ఠము" అనగా యింటికి వీపు అనగా వెనుకభాగమును గుర్తించుట అవసరమగుచున్నది.

"అగ్రతః పృష్ఠతః శబ్దౌ ద్వారేణ నియతౌ గృహే
యతోద్వారం తదగ్రంస్యాత్ పృష్ఠం పృష్ఠముదాహృతమ్
(సమరాంగణము 112 పేజీ)

ఇంటికి సింహద్వారము గల దిశ అగ్రము అవగా ముంగిలిగాను, అగ్రమునకు వ్యతిరిక్తమగు దిశ అవగా యింటికి వెనుక ప్రక్క పాణీద్వారము వైపుగల దిశ పృష్ఠము అవగా పెరడుగాను పై శ్లోక ప్రమాణముచేత ఋజువగుచున్నది. అట్లే వాస్తుపురుష స్వరూపమగు యింటియొక్క కుడి, ఎడమభాగములను కూడ గుర్తించవలసియున్నది.

"దక్షిణాంగః సవైప్రోక్తః మందిరా న్నిస్సృతే సతి
యో భూయాద్దక్షిణే భాగే వామే భూయా త్సవామగః"
(వాస్తుప్రబోధము 35పేజీ, వాస్తు రత్నాకరము 87పేజీ)

గృహయజమానుడు తనయింటి ముఖద్వారము నుండి బయటకు వెడలుచున్నపుడు ఆతని కుడివైపు గల గృహభాగము దక్షిణభాగము అవగా కుడిప్రక్క, ఎడమవైపున గల గృహభాగము వామభాగము అవగా యెడమప్రక్క అని భావము. గృహస్వరూపమును చక్కగా అవగాహన చేసుకొను నిమిత్తము సందర్భానుసారముగా ఈ విషయమిట వివరింపబడినది. ప్రస్తుతాంశము ముఖద్వార పరిశీలనము గమనింపుడు.

### గృహనిర్మాణ స్థలము ననుసరించి :

ముందుగా గృహనిర్మాణ స్థలమునకు యేయే దిశలయందు రాజవీధులు, బాటలు, సందులు, రామకోవెలలు, దేవాలయములు మొదలగు కట్టడములు గలవో వాటి పూర్వాపరములను బాగుగా పరామర్శింప వలసియున్నది. ఆ నిర్మాణ స్థలమునకు యేదిశ నుండియైనను వీధిశూలగాని, బాటలు, సందులు మొదలగువాటి శూలలుగాని ఉన్నవేమో కడు జాగ్రత్తగా విమర్శింపవలయును. ఆ పిమ్మట నిర్మాణస్థలము యొక్క నాలుగు దిశలయందు యింతకుముందు నిర్మింపబడియున్న యిండ్లయొక్క గోడశూలలు, వెన్నుపోటులు మొదలగు దోషములు నిర్మించబోవు యింటికి సంభవింపగలవేమో నిశితముగా పరిశీలింప వలయును. అన్నివిధముల బాగుగా పరిశీలించి ఏ విధమైన వేధదోషములు మనము నిర్మించదలచిన గృహమునకు సంభవింపజాలవు అని దృఢపడినప్పుడు -

మనము కట్టదలచిన యింటిముఖద్వారము ఏ దిశగా నుంచిన శుభప్రదమో స్థలాను

గుణ్యముగా నిర్ణయింపవలయును. సామాన్యముగా రాజవీధినుండి ప్రాకారము దాటిన పిమ్మట కొద్దిపాటి యెడమప్రక్కగా నడచి, ముఖద్వారము నుండి యింటిలోనికి ప్రవేశించుట శుభప్రదము. ఈ ముఖద్వార నిర్ణయము ఈ క్రింది విధముగా విపులీకరింప బడినది. ఇందు వాస్తువనగా గృహనిర్మాణము నిమిత్తము ప్రాకారము అనగా ప్రహరీగోడ పెట్టబడిన లోపలి ఆవరణ అంతయు అని గమనింపవలెను.

**1. "విప్రాణాం ప్రాజ్ముఖం వాస్తు గృహంస్యాత్ దక్షిణాముఖమ్"**

అనగా ప్రహరీ దాటి స్థలములోనికి ప్రవేశించు ప్రవేశద్వారము తూర్పుదిశ యందున్న యెడల అందు నిర్మించు యింటికి దక్షిణ సింహద్వారముంచుట ప్రశస్తము

**2. "దక్షిణాభిముకం వాస్తుభవనం పశ్చిమాముఖమ్"**

అనగా ప్రహరీగోడ దాటి ఆవరణలోనికి ప్రవేశించు ద్వారము దక్షిణదిశ యందున్నచో అందు కట్టదలచిన యింటికి పశ్చిమ ముఖద్వారముంచుట శ్రేష్టము.

**3. "వాస్తునః పశ్చిమద్వారం భవనస్యోత్తరా ముఖమ్"**

అనగా ప్రాకారము దాటి ఆవరణలోనికి ప్రవేశించు ద్వారము పడమరదిశ యందున్న యెడల అందు నిర్మింపదలచిన యింటికి ఉత్తర ముఖద్వారముంచుట శుభప్రదము.

**1. "వాస్తుస్యాదుత్తర ద్వారం గృహం పూర్వముఖం తథా"**

అనగా ప్రాకారమును దాటి లోనికి ప్రవేశించు మార్గము ఉత్తరదిశ యందున్నచో అందు కట్టబోవు యింటికి తూర్పు ముఖద్వార ముంచుట మిక్కిలి శుభప్రదము.

**గృహపృష్ఠ దర్శనము :**

గృహ యజమానుడు రాజవీధి నుండి, ప్రాకారమును దాటి ఆవరణలోనికి ప్రవేశింపగనే గృహపృష్ఠము అనగా పాణిద్వారమును దర్శించుట శ్రేష్ఠముగాదు.

**ఉదాహరణ :** రాజవీధి గృహనిర్మాణ స్థలమునకు తూర్పున గలదనుకొనుడు. గృహకర్త యొక్క నామరాశికి గాని,లేక వర్గునకు గాని పడమర ముఖద్వారము శ్రేష్ఠముగా యెంచబడిన దనుకొనుడు. కాబట్టి ఆ తూర్పున రాజవీధి గల స్థలమున పడమర ముఖద్వారముంచి గృహనిర్మాణము చేయరాదు. కర్త రాశికిగాని, వర్గునకుగాని

దక్షిణద్వారము శుభప్రదమని భావించినచో నిర్మింపవచ్చును.

సందర్భానుసారముగా మయబ్రహ్మ తన మయమతమునందు (30వ అధ్యాయము, 194వ పేజీయందు) వివరించిన ద్వారవేధలు గూడ ముఖద్వారము నిర్ణయించుటకు ముందుగా పరిశీలింపవలెను.

వృక్ష కర్ణావధస్తూణ కూపవిద్ధం తథైవచ
దేవాయతన విద్ధంచ, వీధివిద్ధం తథైవచ
వల్మీక భస్మ విద్ధంచ సిరామర్మాది విద్ధకం
విషనాభిమానం చ ఫణయోః పద్మమేవచ

(మయమతం 194 పేజీ)

పై ప్రమాణము ననుసరించి ముఖద్వారమునకు యెదుట పెద్ద వృక్షములు ఉండరాదు. మరియు కర్ణవేధ, స్తంభవేధ, కూపవేధ, దేవాలయవేధ, వీధిశూల, వల్మీకవేధ, భస్మవేధ అనగా అగ్నిగుండము మొదలగునవి. వాస్తుపద సిద్ధములగు సిరామర్మ వేధలు లేకుండ గృహ ముఖద్వార నిర్ణయము చేయవలయును. అట్టి వేధలున్నచో విషనాభితినిన మానవుని గతియు త్రాచుపాముచే చుట్టుకొనబడిన పద్మమునకు పట్టినగతి, యజమానునకు పట్టునని మయుని అభిప్రాయము.

## 2. వర్గు ననుసరించి ముఖద్వార నిర్ణయము :

"అ క చాః పశ్చిమే ద్వారే ట వర్గ పశ్చిమోత్తరే
ధనదే త.ప.వర్గాచ య.శా. పూర్వేతు దక్షిణే"

(వాస్తు సంగ్రహం)

గృహ యజమానుని పేరునందలి మొదటి అక్షరము ననుసరించి ఆతడే వర్గునకు చెందినవాడో గ్రహించి ఆయా వర్గులవారికి శుభప్రదమని నిర్దేశింపబడిన ఆయా ముఖద్వారము నుంచవలయును.

గమనిక : గృహ యజమానుని పేరునందు అయిదారు పేర్లు కలిసియున్నచో అంత్యమున వాడుకలోనున్న పేరునందలి మొదటి అక్షరమును బట్టి వర్గారూఢమును నామ నక్షత్రమును నిర్ణయించుట కొన్ని ప్రాంతములయం దాచారములో నున్నది.

3. గృహకర్త నామరాశికి యోగ్యమగు ముఖద్వారములు :

| ముఖద్వారము | యేయే రాశులవారికి, యేయే వర్గులవారికి, యేయే ముఖద్వారము శ్రేష్ఠము |
|---|---|
| తూర్పుద్వారము | మేషము, కర్కాటకము, సింహము, వృశ్చికము, ధనుస్సు, మీనము - ఈ రాశులవారికి య,శ, వర్గులవారికి |
| దక్షిణద్వారము | వృషభము, మిధునము, కర్కాటకము, కన్య, మకర రాశులవారికి శ్రేష్ఠము య,శ, వర్గులవారికి శ్రేష్ఠము |
| పశ్చిమద్వారము | వృషభము, మిధునము, తుల, ధనుస్సు, అ, క, చ, ట వర్గుల వారికి శ్రేష్ఠము |
| ఉత్తరద్వారము | మేష, వృషభ, కర్కాటక, సింహ, వృశ్చిక, కుంభ, ధనుస్సు మీనరాశుల వారికి ట, త, ప వర్గులవారికి శ్రేష్ఠము |

వాస్తుశాస్త్రములయందు గృహకర్త నామరాశికి యోగ్యమగు ద్వారనిర్ణయమునకే ప్రాముఖ్యమీయబడినది. ఈ ముఖద్వార పరిశీలనమునందు కాలామృతము వాస్తురాజ వల్లభము, అపరాజిత పృచ్ఛ, జ్యోతిర్నిబంధము, బృహద్వాస్తుమాల, శ్రీకృష్ణవాస్తు మొదలగు గ్రంథములను పరిశీలించి మయవాస్తువుతో సమన్వయపరచి, రాశ్యానుకూలమగు ముఖ ద్వారములు చక్రోద్ధారముగా చూపబడినవి. గ్రంథవిస్తర భీతిచే శ్లోకములు విడువబడినవి.

గమనిక : గృహ యజమాని నక్షత్రమునకు, నామరాశికి, యోగ్యమగు ముఖద్వారమును నిర్ణయించుట సర్వశ్రేష్టము. అట్లు సాధ్యపడనిచో యేదో యొకదానికి అనగా వర్గునకుగాని లేదా నామరాశికి గాని యోగ్యమగు ముఖద్వారమును నిర్ణయించుట అవశ్య కర్తవ్యము. వర్గునకుగాని, నామరాశికి గాని శుభప్రదముగాని ముఖద్వారము స్థలానుగుణమైనంత మాత్రమున నిర్ణయించుట నింద్యము.

## ముఖద్వార నిర్ణయమున గల కొన్ని మెలకువలు :

తూర్పు ముఖద్వారము : 1. అవర్గువారికి తూర్పు ముఖద్వారము పడమటిల్లు నిషేధము. అయినను "అ" అక్షరము మేషరాశికి చెందినది కాబట్టి "అ" వర్గునందలి "అ" తమ పేరునందలి మొదటి అక్షరముగా గలవారు మాత్రమే తూర్పు ముఖద్వారమును మధ్యమ పక్షముగా గ్రహింపవలయును. అట్లే "త"వర్గువారికి తూర్పుముఖద్వారము చెప్పబడి యుండలేదు. అయినను "త"వర్గునందలి ద,న అక్షరములు నామప్రథమాక్షరములుగా గలవారికి రాశి రీత్యా తూర్పుముఖద్వారము అర్హణమే. ఇక "త" అను అక్షరము నామ ప్రథమాక్షరముగా గలవారికి పడమర స్వస్థానము కాబట్టి పడమటియిల్లు తూర్పుముఖద్వారము నిర్మింపవచ్చును.

దక్షిణ ముఖద్వారము : "చ" వర్గువారికి దక్షిణ ముఖద్వారము నిషేధము. కాని అందలి "జ" అక్షరము మకరరాశికి చెందినది. కాబట్టి రాశిరీత్యా జగ్గన్న, జనార్ధన మొదలగు పేర్లుగలవారు దక్షిణముఖద్వారము నిర్మింపవచ్చును. "చ" నామప్రథమాక్షరము గలవారికి మాత్రము దక్షిణ ముఖద్వారము శుభప్రదము కాదు.

పశ్చిమ ముఖద్వారము : "త" వర్గువారికి పశ్చిమ ముఖద్వారము నిషిద్ధము. అయినను త,ద అక్షరములు తులా, ధనూరాశులకు చెందినవి కాబట్టి త,ద అను అక్షరములు నామ ప్రథమాక్షరములుగా గలవారు పశ్చిమ ముఖద్వారమును మధ్యమ పక్షముగా స్వీకరింపవచ్చును. కాని "న" నామ ప్రథమాక్షరముగా గలవారు పశ్చిమ ముఖద్వారమున గల గృహము నిర్మింపరాదు.

ఉత్తర ముఖద్వారము : "య" వర్గువారికి ఉత్తర సింహద్వారము నిషిద్ధము. కాని "య" ధనూరాశికిని, "ల" మేషరాశికిని "వ" వృషభరాశికిని చెందియున్నవి

కాబట్టి ఈ అక్షరములు నామప్రథమాక్షరములుగా గలవారు ఉత్తరముఖద్వారము ను మధ్యమపక్షముగా గ్రహింపవచ్చును. "ర" నామ ప్రథమాక్షరముగా గలవారు యెంతమాత్రము ఉత్తర ముఖద్వారము గల యిండ్లు నిర్మింపరాదు.

గమనిక : పైనుదహరింపబడిన అపవాదములు ఆయా పరిస్థితుల కనువుగా తప్పని పరియగునప్పుడు మాత్రమే గ్రహింపవలయును గాని శ్రేష్ఠములు గావని గుర్తింపవలయును.

గృహ గణితాగత ఆయము ననుసరించి : ఆయములు యెనిమిది. ధ్వజ, ధూమ, సింహ, శ్వాన, వృష, ఖర, గజ, కాకాయములు. ఇందు విషమాయములగు - ధ్వజాయము, సింహాయములు, వృషభాయము, గజాయము అనునవి నాలుగు మాత్రమే ప్రశస్తమైనవి. ఈ నాలుగు ఆయములకు యోగ్యమగు ముఖద్వారములు -

ధ్వజాయము = ధ్వజాయము గల గృహమునకు నాలుగు దిక్కులయందుమ ముఖద్వారము లుంచవచ్చును.

సింహాయము = ఈ సింహాయము గల యింటికి ఉత్తరముఖద్వారము మాత్రమే శ్రేష్టమైనదని అగస్త్యుని యభిప్రాయము.

వృషభాయము = వృషభాయము గల యింటికి తూర్పుముఖద్వారము మాత్రమే శుభప్రదమైనది. మిగిలిన దిక్కులయందు ముఖద్వారము నిషిద్ధము.

గజాయము = గజాయము గల యింటికి తూర్పుసింహ ద్వారముగాని, దక్షిణ సింహద్వారము గాని నిర్మించుట శుభప్రదము. మరియు -

ఉత్తరే వృషభం, సింహం సంయుక్తం మరణం ధృవం
పశ్చిమే కేసరీయుక్తం మరణంతు న సంశయః
దక్షిణే వృషభం హస్తియుక్తం సర్వ విపత్కరం
సర్వేప్యుక్త పదంయాంతి, న చోక్తం యత్రకుత్ర చిత్

(సకలాధికారము 261 పేజీ)

అను ప్రమాణము ననుసరించి ఉత్తరపు యింటికి వృషభ సింహాయములును, పడమటింటికి సింహాయమును, దక్షిణపు యింటికి వృషభ సింహాయములను యెంతమాత్రమును ననికిరావని విశేషించబడినవి. అట్లే పడమటింటికి రెండవ పక్షముగానైనను సింహాయమును గ్రహింపరాదు. వృషభాయము గల యింటికి - తూర్పుముఖద్వారము తప్ప మరేదిశయందును ముఖద్వారముంచరాదు. అగస్త్యముని చెప్పిన ఈ ఆయమునకు తగిన గృహములు సర్వశ్రేష్టమైనవని గ్రహింపవలసియున్నది.

**వాస్తుపురుషుని అనుసరించి :** వాస్తుపురుషుని అనుసరించి ముఖద్వార నిర్ణయము ప్రత్యేకముగ 14వ ప్రకరణమున వివరింపబడినది కాబట్టి అందుండి గ్రహింపవలయును. ఈవిధముగ పూర్వాపరములను బాగుగ విమర్శించి గుణాధిక్యము గల ముఖద్వారమును నిర్ణయింపవలయును



# సింహద్వార స్థల నిర్ణయము

వెనుకటి ప్రకరణమున ముఖద్వారము నిర్మించవలసిన దిక్కును గూర్చి విపులముగా చర్చించబడినది. ఈ ప్రకరణమున ఆయా దిశలయందు యింటియొక్క పొడవులో యే భాగమున ముఖద్వారము ఉంచవచ్చునో వివరింపబడుచున్నది.

"మధ్యద్వారంతు దేవానాం ద్విజానామవనీ భృతాం
శేషాణామపి సర్వేషాం ఉపమధ్యం విధీయతే
ద్వాత్రింశద్దేవతాం శేషు తేషు మాహేంద్రకే పదే
రాక్షసేపుష్ప వంతేన భల్లాటేచ చతుర్ష్వపి
తద్దిగీశాన మాశ్రిత్య దారంకుర్యాత్సు శోభనమ్
అంతర్ద్వారం బహిర్ద్వార మేవం యుంజీత బుద్ధిమాన్"

**(మయమతం *30* అధ్యాయం, *196* పుట)**

పై ప్రమాణము ననుసరించి "ఏకాశీతి" వాస్తుపద దేవతా పదభోగము ననుసరించి ఆయాదిక్కులయందు ఆయా దిక్పతులకు చెందిన పదమునందు ముఖద్వారము పాణిద్వారము నిర్ణయింపవలయునని మయుని అభిప్రాయము.

ఏకాశీతి పదవాస్తు చక్రమునందు వెలుపలి అంచునందు 32 పదములున్నవి. తూర్పు దిశయందు సింహద్వారముంచ వలసినప్పుడు ఈశాన్యకోణము నుండి నాలుగవ పదముగు మహేంద్రపదమునం దుంచవలయును. (పటమును చూడుము) దక్షిణదిశయందు ముఖద్వారముంచవలసియున్నచో ఆగ్నేయకోణము నుండి నాలుగవదగు గృహాక్షత పదమునందుచంవలయును. పడమరదిశయందు ముఖద్వార ముంచవలసియున్నప్పుడు నైఋతి కోణమునుండి నాలుగవదగు పుష్పదంత పదమునందుంచ వలయును. ఉత్తరదిశ యందు ముఖద్వారముంచవలసి యున్నచో వాయవ్యకోణము నుండి నాలుగవదగు భల్లాట పదమునందుచవలయును.




## ఏకాశీతి పదవాస్తువు

అనగా పైవాస్తుపద చక్రమునందు ఇంటు గుర్తుగల చోటునందు ముఖద్వారముంచుట సర్వశ్రేష్ఠమని మయబ్రహ్మ అభిప్రాయము.

పైన చూపబడిన వాస్తుపద చక్రమునందలి పువ్వు గుర్తుగల పదములయందు కూడ ముఖద్వారము లుంచవచ్చునని గ్రంథాంతరముల గలదు. మరియు ఈ ముఖద్వార నిర్ణయమును గూర్చి మరికొన్ని యితర గ్రంథములయందున్నట్టి ప్రస్తుత కాలమున ఆచరణలో నున్నట్టి విధులు ఈ క్రింద వివరింపబడుచున్నవి.

**1. తూర్పు ముఖద్వారము :** ఇంటియొక్క నిడివి తొమ్మిది సమభాగములు జేసి ఈశాన్యదిశ నుండి 3వ 4వ 6వ భాగములయందు ముఖద్వారముంచుట శుభప్రదము.

**2. దక్షిణ ముఖద్వారము :** ఇంటియొక్క నిడివి తొమ్మిది సమభాగములుగ జేసి ఆగ్నేయము నుండి 4వ 5వ భాగములు ముఖద్వారముంచుట శుభప్రదము.

**3. పశ్చిమ ముఖద్వారము :** ఇంటి నిడివిని తొమ్మిది సమభాగములు జేయగా నైఋతి మూలనుండి 3వ 4వ 5వ 6వ స్థానములు ముఖద్వారములుంచుట శుభప్రదమైనవి.

**4. ఉత్తర ముఖద్వారము :** ఇంటియొక్క నిడివిని తొమ్మిది సమభాగములు జేసి వాయవ్యమునుండి 4వ 5వ 6వ స్థానములు శ్రేష్ఠములైనవి.

*గమనిక :* కోణములయందు అనగా యింటి నిడివిని తొమ్మిది సమభాగములు జేయగా 1,2,8,9వ భాగములయందు ఏ విధమైన ద్వారములుంచుటకును శ్రేష్ఠములు గావు. వీటికే కోణద్వారములని పేరు.

ముఖద్వార మేదిశయందున్నను అది మిగిలిన ద్వారముల కంటె యెత్తుగ నుండ వలయును. ఇతర ద్వారములన్నియు సింహద్వారముంచిన తలము ( లెవెల్) కంటె పాతిక అంగుళం దిగువగా నిలుపవలయును. నేత్రభిత్తి అనగా సింహద్వారము గల గోడ. ఆ నేత్రభిత్తి యందు సింహద్వారమునకు రెండుప్రక్కల యందు కిటికీలు అమర్చుట శుభప్రదము. నేత్రభిత్తియందు అమర్చిన కిటికీల, ద్వారముల శిరోభాగములు ఒకే సమసూత్రమునకు సరిచేయవలయును. సింహద్వారమునకు యెదురుగా పాణిద్వారము నిర్మించుట ఆచారసిద్ధము. మిగిలిన అన్నిచోట్లయందు ద్వారమునకు యెదుట ద్వారమే ఉంచవలెనను నియమము లేదు. కిటికీలుంచవచ్చును.

ఇంటియందలి మొత్తము గుమ్మముల సంఖ్య 1,2,4,6,8,12,14,16,18,24. ఈ విధమగు సమసంఖ్య గలిగి యుండవలయును. ఈ నియమమును గూర్చి మయుడు -

"ద్వారస్తంభతులాదికాన్ వరగృహేయుజ్యా థయుగ్మం యథా" అని వివరించి యున్నాడు. కాబట్టి నివాసగృహములకు ద్వారాదులు స్తంభములు, దూలములు మొదలగునవి సమసంఖ్యలో నుండవలయునని మయబ్రహ్మ వక్కాణించియున్నాడు.

గమనిక : ఈ సంఖ్యా నియమమున 10-20-30 మొదలగు సున్నగల సంఖ్యతో ద్వారములు గాని, కిటికీలు గాని, మూలములు గాని, ఏర్పరచరాదని శాస్త్రములయందు కనబడకపోయినను అట్టి సంఖ్యలు గల ద్వారాదులు ఏర్పరచుట ఆచారమునందు లేదు. కాబట్టి సున్న సంఖ్య గ్రహింపరాదు. మరియొక ముఖ్య విషయము గమనింపవలసి యున్నది. కొందఱు గర్భగృహము నందలి గుమ్మములను, కిటికీలను, సమసంఖ్యగా సరిచేయుదురు. దీనికిని శాస్త్ర నియమము లేదు. మొత్తము గృహమునందున్న ద్వారములను కిటికీలను లెక్కించుటయే పరిపాటి. అలమరలు గృహోపయోగము ననుసరించి సమసంఖ్యగా అమర్చ వలయును.

ద్వార ప్రమాణములు :

| పొ | | వె | = | అంగుళములలో |
|---|---|---|---|---|
| 61 | X | 29 | = | ధ్వజాయము |
| 64 | X | 32 | = | సమరాంగణము |
| 64 | X | 33 1/2 | = | ధ్వజాయము |
| 64 | X | 34 | = | విశ్వకర్మ ప్రకాశిక |
| 65 | X | 33 | = | ధ్వజాయము |
| 65 | X | 35 | = | సింహాయము |
| 65 | X | 37 | = | ధ్వజాయము |
| 67 | X | 33 | = | సింహాయము |
| 67 | X | 35 | = | ధ్వజాయము |
| 67 | X | 37 | = | గజాయము |
| 69 | X | 37 | = | ధ్వజాయము |
| 69 | X | 39 | = | సింహాయము |
| 71 | X | 39 | = | ధ్వజాయము |
| 71 | X | 41 | = | గజాయము |
| 73 | X | 41 | = | ధ్వజాయము |
| 73 | X | 43 | = | సింహాయము |
| 81 | X | 43 | = | సింహాయము |

గమనిక : గృహయజమాని వర్గునకు శత్రువర్గము గల ఆయము శ్రేష్ఠముగాదు.

# గృహ నిర్వచనము

"తైతిలానాం ద్విజాతీనాం వర్ణానాం వాసయోగ్యకం
ఏక ద్వి త్రి చతుస్సప్త దశశాలాశ్చ షడ్విధా:"
**(మయమతం 26 అధ్యాయం)**

సమస్త వర్ణములవారికి నివాస యోగ్యములగు శాలలు (యిండ్లు) ఆరు విధములుగా మయుడు వర్గీకరించియున్నాడు. అవి ఏకశాల, ద్విశాల, త్రిశాల, చతుశ్శాల, సప్తశాల, దశశాల అనునవి ఆరుశాలలు. ఈ ఆరురకములగు యిండ్లలోను మొదటిదగు "ఏకశాలా గృహము" జనసామాన్యమునకు అందుబాటులో నుండి బహుళ ప్రచారములోనికి వచ్చినది. ఈ ఏకశాలా గృహమును మయుడు మానసార మహర్షి "దండకము" అను మరియొక పేరుతో వ్యవహరించినాడు. సాధారణ గృహస్తుని నుండి అష్టైశ్వర్య సంపన్నుని వరకు యథార్థముగా ఈ ఏకశాలా గృహమును నిర్మించుకొను వివిధ రీతులు మయమతము మానసారమునందు వర్ణింపబడియున్నవి.

ఏకశాలా గృహములు నాలుగు. గృహావరణ స్థలము యొక్క మధ్యబిందువునకు బ్రహ్మస్థానమని పేరు. ఆ బ్రహ్మస్థానము ప్రాతిపదికగా గ్రహించి మయుడు గృహనిర్వచనము చెప్పియున్నాడు.

బ్రహ్మస్థానాత్ పూర్వగతం తత్ త్రిసూత్రం తదుచ్యతే
తతోధనం పశ్చిమగం ధాన్యం దక్షిణగం తత:
బ్రహ్మస్తానా దుత్తరగం సుఖ మిత్యభిధీయతే
**(మయమతం 6వ అధ్యాయం 35వ పేజీ)**

బ్రహ్మస్థానమునకు అనగా గృహావరణ యొక్క మధ్యబిందువునకు తూర్పున గల స్థలమునకు త్రిసూత్రమనియు దక్షిణమున గల భూమికి ధాన్యము అనియు, పడమర గల భూమికి ధనము అనియు, ఉత్తరమున భూమికి సుఖమనియు పేర్లు గలవు. కాబట్టి ఆయా స్థానములయందు నిర్మింపబడిన యిండ్లకు ఆయా పేర్లు తగునని మయుని అభిప్రాయము. మరియు -

పూర్వాది మధ్యసూత్రాణి అన్నం, ధాన్యం, ధనం, సుఖం
ఇతి నామాని తన్నామ్నా చత్వారిస్యుః గృహాణిచ
అన్నాలయం, ధాన్యాలయం, ధనాలయం, సుఖాలయం"
(మయమతం 27 అధ్యాయం 71 పేజీ)

అని మయుడు వివరించియున్నాడు. అనగా గృహనిర్మాణ స్థలముయొక్క మధ్యబిందువునకు తూర్పుదిశ యందు నిర్మించిన యింటికి అన్నాలయమనియు, దక్షిణ దిశయందు నిర్మించిన యింటికి ధాన్యాలయమనియు, పడమర దిశయందు నిర్మించిన యింటికి ధనాలయమనియు, ఉత్తరదిశయందు నిర్మించిన యింటికి సుఖాలయమనియు మయుని అభిప్రాయము. ఈ అన్నాలయ, ధాన్యాలయ, ధనాలయ, సుఖాలయములు ఆయా పేర్లకు తగిన శుభ ఫలములను ప్రసాదించునని మయుడు స్పష్టీకరించి యున్నాడు.

శ్రీ భువనదేవాచార్యుడు అపరాజిత పృచ్ఛయను శిల్పశాస్త్రమున గృహ నిర్వచన మీ క్రింది విధముగ చెప్పియున్నాడు.

"హస్తినీ, మహిషీ, చైవ గావీచ ఛాగలీ తథా
పదానంతు దిశాభాగైః ప్రాచ్యాదిషు ప్రదక్షిణమ్
హస్తినీ చేంద్ర సంస్థానే మహిషీచ యమస్థలే
గావీచ వరుణస్థానే సౌమ్యస్థానేతు ఛాగలీ"

పై ప్రమాణము ననుసరించి తూర్పుదిశయందు కట్టిన యింటికి "హస్తిని" యనియు, దక్షిణమున కట్టిన యింటికి "మహిషి" యనియు, పడమర కట్టిన యింటికి "గావీ" యనియు, ఉత్తరమున కట్టిన యింటికి "ఛాగలీ" యనియు వ్యవహరింపబడునని భావము. ఈ నిర్ణయమునకుమ ప్రాతిపదిక బ్రహ్మస్థానమే యనదగును. సారాంశమేమనగా -

1. అన్నాయలమునకు "హస్తిని"యను మరియొక పేరు గలదు.
2. ధాన్యాలయమునకు "మహిషి" యను మరియొక పేరు గలదు.
3. ధనాలయమునకు "గావీ" యను మరియొక పేరు గలదు.
4. సుఖాలయమునకు "ఛాగలీ" యను మరియొక పేరు గలదు.

యింతవరకు బ్రహ్మస్థానమును ప్రాతిపదికగా తీసుకొని దిక్కులు, విదిక్కులు నిర్ణయించి అందు -

"చతుర్గృహమ దిక్షుగతం ప్రధానకం
విదిక్షువా మండపగం ఖలూరికా"

(మయమతం 27 అధ్యాయం 69 పేజీ)

అను ప్రమాణము ననుసరించి దిగ్గతములగు నాలుగు యిండ్లను అనగా అన్నాలయ ధాన్యాలయ, ధనాలయ, సుఖాలయములను నిర్మించుట శ్రేష్టమని తెలుపబడినది. కోణదిశల యందు ఉపగృహములు నిర్మించుట శుభప్రదమని మయుని వచనము. ఈ అన్నాలయాది నిర్మాణవిధి సాధారణ నియమము. ఇంగ్లీషు భాషలో దీనినే "జనరల్‌రూల్" అని చెప్పుదురు.

## ముఖద్వారము ప్రాతిపదికగా గృహ నిర్వచనము :

శాస్త్రములయందు వివరింపబడిన సాధారణ విధులు ఆచరణ యోగ్యముగానిచోట "విశేషవిధి" ఆశ్రయించి ఆయాకార్యములు సాధించుటకు వికల్పము చెప్పబడినది. వికల్పము అనగా ఒక ఋషి చెప్పిన విషయమును గూర్చి ఆచరణయోగ్యముగ అదే విషయము మరో విధముగా చెప్పుట. అట్టి వికల్పము గూడ మొదటిదానివలె అంతటి శాస్త్ర సమ్మతమైనదేనని గౌతమ మహర్షి చెప్పియుండెను. "తుల్యబల విరోధే వికల్పః" (గౌ॥ధర్మ॥ సూ. 1-4). ఈ గృహ నిర్మాణము నందుకూడ పై నుదహరించిన బ్రహ్మస్తానము ప్రాతిపదికగా గల అన్నాలయ, ధాన్యాలయ, ధనాలయ, సుఖాలయములను సాధారణ గృహస్థులు నిర్మించుకొన జాలరు కాబట్టి విశేషవిధి నాశ్రయించి ఈ అన్నాలయాది నాలుగు యిండ్లు నిర్మించుకొన వచ్చునని శాస్త్రవేత్తల యభిప్రాయము. ప్రతిభావంతుడగు స్థపతి ఆయా దేశ, కాల, పాత్రలకు యోగ్యమగు శైలిని గ్రహించి శాస్త్రముల యందు చెప్పబడిన మూల సిద్ధాంతములకు భంగము వాటిల్లకుండునట్లు విశేషవిధి నాశ్రయించి గృహనిర్మాణము చేయవలయును. ఇట్టి గృహ నిర్మాణోపయోగ్యమగు విశేషవిధికి ముఖద్వారము ప్రాతిపదికగా గ్రహింపబడినది.

మయుని తరువాత అంతటి ప్రతిభా సంపన్నుడగు శిల్పముని మానసార మహర్షి. ఆ మహాశిల్పి తన మానసారమునందు యేకశాలను దండకశాలయను పేరుతో వ్యవహరించి ముఖద్వారము ప్రాతిపదికగా గృహ నిర్వచనము చెప్పియున్నాడు. గమనింపుడు.

"పూర్వశాలాతు చైకంచ, తద్ద్వారం పశ్చిమే భవేత్
దండకం దక్షిణేశాలా, తద్ద్వారం చోత్తరే దిశి
ఏకశాలా యథాప్రత్యక్, తద్ద్వారం ప్రాగ్దిశస్తథా
ఉదగ్దండక శాలానాం, కుర్యాద్ద్వారంతు దక్షిణే"

(మానసారం 245 పేజీ)

పూర్వశాల అనగా తూర్పుయింటికి పడమర ముఖద్వారముంచ వలయును. దక్షిణశాల అనగా దక్షిణపు యింటికి ఉత్తర ముఖద్వార ముంచవలయును. ప్రత్యక్‌శాలకు అనగా పడమటింటికి తూర్పుముఖద్వారముంచ వలయును. ఉదగ్దండక శాలకు అనగా ఉత్తరపు యింటికి దక్షిణ ద్వారముంచవలయును, అని మానసార మహర్షి స్పష్టపరచి యున్నాడు.

ఇందు మనము గమనింపవలసిన క్రొత్త విషయమొకటి ఇమిడియున్నది. మయుడు చెప్పిన అన్నాలయాది నాలుగు యిండ్లకు వరుసగా -

1. అన్నాలయమునకు తూర్పు యిల్లు అను పేరు
2. ధాన్యాలయమునకు దక్షిణపు యిల్లు అను పేరు
3. ధనాలయమునకు పడమటి యిల్లు అను పేరు
4. సుఖాలయమునకు ఉత్తరపు యిల్లు అను పేరు.

కాలక్రమమున వ్యవహారము లోనికి వచ్చినట్లు మనకు స్పష్టమగుచున్నది. మానసారుని పై యభిప్రాయమువనుసరించి ముఖద్వారము ప్రాతిపదికగా గృహ నిర్వచనము శాస్త్ర విరుద్ధముగాదని ఋజువగుచున్నది.

ముఖద్వారమును ప్రాతిపదికగా గ్రహించి సమరాంగణ సూత్రధారుడు కూడ హస్తినీ, మహిషీ, గావీ, ఛాగలీ యను పేర్లుగల నాలుగు యిండ్లను వాటి ఫలితములను చక్కగా వివరించియున్నాడు. యిందు -

1. తూర్పు సింహద్వారము గలయింటికి "భద్రము" అనియు

2. దక్షిణ సింహద్వారము గలయింటికి "నందపీఠము" అనియు

3. పశ్చిమ సింహద్వారము గలయింటికి "సౌరభము" అనియు

4. ఉత్తర సింహద్వారము గలయింటికి "పుష్కరము" అనియు

ప్రత్యేకమగు సంజ్ఞలు చెప్పబడినవి -

## తూర్పు ముఖద్వారము :

"పూర్వాముఖం గృహంయత్తు, ద్వారం మహేంద్ర సంయుతం
హస్తినీచ భవేచ్ఛాలా తద్గృహం భద్ర సంజ్ఞితం
భద్రం భద్రకం భర్తు ర్యశోబల వివర్ధనమ్
సిధ్యంతి చాస్యకార్యాణి భద్రాఖ్యే వసతో గృహే"

తూర్పు ముఖద్వారము గలయింటికి హస్తిని యనిపేరు. మహేంద్ర పదమున సింహద్వారముంచ వలయును. దీనికి "భద్రము" అను సంకేతము గలదు. ఈ భద్రగృహము మిక్కిలి శుభప్రదమై యజమానునకు కీర్తిని బలమును ప్రసాదించును. అందు నివసించు వారికి ఇష్టకామ్యార్థ సిద్ధి కలుగును అని భావము.

## దక్షిణ ముఖద్వారము :

దక్షిణాభిముఖం వేశ్మ, ద్వారంచాస్య గృహక్షతం
మహిషీచ భవేచ్ఛాలా, తద్గృహం నందపీఠకమ్
నందపీఠ గృహంపుంసా, నిత్యానందకరం స్మృతం
సర్వసంపద్గుణోపేతం, ధనధాన్య వివర్ధనమ్"

దక్షిణ సింహద్వారము గల యిల్లు "మహిషీ" యనబడును. గృహక్షత పదమునందు సింహద్వారముంచ వలయును. ఈ గృహమును "నందపీఠము" అని వ్యవహరింతురు. ఇట్టి యిల్లు నిత్యానందకరమైనది. అందు నివసించు ప్రజలు సమస్త సంపదలను అనుభవింప గలరు. ధనధాన్య సమృద్ధి గలుగచేయునను భావము.

పడమర ముఖద్వారము :

వారుణ్యాభిముఖం పద్మ, ద్వారంచ కుసుమాహ్వాయం
గావీచైవ భవేశ్చాలా, సౌరభం తద్విదుర్బుధాః
సౌరభే నిత్య హృష్టత్వం, వసతాం గృహమేధినాం
సఫలం కృషి వాణిజ్యం, పుత్రాశ్చ వశవర్తినః

పడమర సింహద్వారము గల గృహము గావీ యనబరగును. కుసుమపదమునందు ముఖద్వార ముంచవలయును. దీనిని "సౌరభము" అని వ్యవహరింతురు. ఈ గృహమునందు నివసించువారు నిత్యసంతోషులుగ నుందురు. వ్యవసాయమునందును, వాణిజ్యమునందును మంచి లాభమును గడింపగలరు. అందుండు వారి సంతానము క్రమశిక్షణకు లోబడి వశవర్తులై కీర్తివంతులై వర్ధిల్లగలరు.

ఉత్తర ముఖద్వారము :

ఉత్తరాభిముఖం ధిష్ణ్యం ద్వారం భల్లాటసంయుతం
ధాగలీచ భవేచ్చాలా పుష్కరాఖ్యం తదుచ్యతే
శీలవాన్ నిత్యసంతుష్టః సుహృత్ సుజన వత్సలః
సుభగః పుష్కరాఖ్యేచ బహుపుత్ర ధనాన్వితః"

ఉత్తర సింహద్వారము గల యిల్లు ధాగలీ యనబడును. భల్లాటపదమున సింహద్వార ముంచవలయును. దీనినే పుష్కరగృహమని వ్యవహరింతురు. ఇందు నివసించువారు శీలసంపద గలవారై, సహృదయులై, సిరిసంపదలతో తులతూగుచుందురు.

పై నుదహరించిన సమరాంగణమునందలి ప్రమాణములు ముఖద్వారము ప్రాతిపదికగా గ్రహించి గృహనిర్మాణము చేయు విశేషవిధిని అందలి సత్ఫలితములను చక్కగా విశదీకరించినవి. మరియు ఆధునికులలో ప్రముఖ వాస్తుశాస్త్రవేత్తయగు బ్రహ్మశ్రీ ముందూరు వీరభద్రాచార్యుల వారిచే ఉదాహరింపబడిన పూర్వకారికను గమనింపుడు -

ప్రాగాద్యాదిషు సంస్థితం గృహముఖ ద్వారం వశాద్ది గృహం

పడమర ముఖద్వారము :

వారుణ్యాభిముఖం పద్మ, ద్వారంచ కుసుమాహ్వాయం
గావీచైవ భవేశ్చాలా, సౌరభం తద్విదుర్బుధాః
సౌరభే నిత్య హృష్టత్వం, వసతాం గృహమేధినాం
సఫలం కృషి వాణిజ్యం, పుత్రాశ్చ వశవర్తినః

పడమర సింహద్వారము గల గృహము గావీ యనబరగును. కుసుమపదమునందు ముఖద్వార ముంచవలయును. దీనిని "సౌరభము" అని వ్యవహారింతురు. ఈ గృహమునందు నివసించువారు నిత్యసంతోషులుగ నుందురు. వ్యవసాయమునందును, వాణిజ్యమునందును మంచి లాభమును గడింపగలరు. అందుండు వారి సంతానము క్రమశిక్షణకు లోబడి వశవర్తనులై కీర్తివంతులై వర్ధిల్లగలరు.

ఉత్తర ముఖద్వారము :

ఉత్తరాభిముఖం ధిష్ణ్యం ద్వారం భల్లాటసంయుతం
ధాగలీచ భవేచ్చాలా పుష్కరాఖ్యం తదుచ్యతే
శీలవాన్ నిత్యసంతుష్టః సుహృత్ సుజన వత్సలః
సుభగః పుష్కరాఖ్యేచ బహుపుత్ర ధనాన్వితః"

ఉత్తర సింహద్వారము గల యిల్లు ధాగలీ యనబడును. భల్లాటపదమున సింహద్వార ముంచవలయును. దీనినే పుష్కరగృహమని వ్యవహరింతురు. ఇందు నివసించువారు శీలసంపద గలవారై, సహృదయులై, సిరిసంపదలతో తులతూగుచుందురు.

పై మదహరించిన సమరాంగణమునందలి ప్రమాణములు ముఖద్వారము ప్రాతిపదికగా గ్రహించి గృహనిర్మాణము చేయు విశేషవిధిని అందలి సత్ఫలితములను చక్కగా విశదీకరించినవి. మరియు ఆధునికులలో ప్రముఖ వాస్తుశాస్త్రవేత్తయగు బ్రహ్మశ్రీ ముందూరు వీరభద్రాచార్యుల వారిచే ఉదాహరింపబడిన పూర్వకారికను గమనింపుడు -

ప్రాగాద్యాదిషు సంస్థితం గృహముఖ ద్వారం వశాద్ది గృహం

మకరే చైవ ధనుషి కుంభేవాచ దివాకరే
యామ్యాదిశి ముఖం కుర్యాత్ రాజ చౌరాగ్నిజం భయమ్॥
మీనే మేషే వృషే చైవ పశ్చిమాదిగ్భ దూషితా
స్త్రీణాం రోగం మహాఘోరం భవతి హ్యాతి దారుణం
మిథునే సింహకర్కేచ వేశ్మనైవోత్త రాననం
దోషశోక భయం తత్తు నకుర్యాశ్చ విచక్షణైః
(భావము సులభగ్రాహ్యము) (అపరాజిత 140 పేజీ)

పై విషయములన్నియు పరిశీలించి చూడగా గృహనిర్మాణ శుభకాలమునకు గూడ ముఖద్వారమే ప్రాతిపదికగా గ్రహింపబడుచున్నది. కాబట్టి శాస్త్రవిదులైన స్థపతులు, పండితులు, ఆయా దేశ, కాల, పాత్రల ననుసరించి శాస్త్రహృదయమును బాగుగా అవగాహన చేసుకొని స్థలానుగుణ్యమగు శైలిని గ్రహించి గృహనిర్మాణము చేయవలయును.

## సారాంశము

### తూర్పు యిల్లు :

తూర్పు యిల్లనగా పడమర సింహద్వారము గల యిల్లు. స్థలానుగుణ్యముగా ఈ తూర్పుయింటికి పడమర హెచ్చుగ కాళీస్థలముండినను దోషము లేదు. దీనికి ఆగ్నేయ దిశయందు వంటయిల్లు ఈశాన్యమున నుయ్యి నిర్మించుకొన వచ్చును. దీనికి అన్నాలయ మనియు, సౌరభమనియు పేర్లు గలవు. శాంతి సౌఖ్యములనిచ్చు కట్టడము.

### దక్షిణపు యిల్లు :

దక్షిణపు యిల్లు అనగా ఉత్తరదిశయందు సింహద్వారము గల యిల్లు. దీనికి దక్షిణదిశయందు కంటె ఉత్తరమున కాళీ హెచ్చుగ నుండవలయును. ఈ యింటికి ఆగ్నేయమున గాని నైఋతి దిశయందు గాని వంటశాల నిర్మించవలయును. ఈశాన్యదిశ యందుగాని తూర్పుదిశ భాగమునందుగాని నుయ్యి ఏర్పరచ వచ్చును. దీనికి ధాన్యాలయ మనియు పుష్కరమనియు పేర్లు గలవు. అష్టైశ్వర్య ప్రదమగు యిల్లు.

## పడమటి యిల్లు :

తూర్పున సింహద్వారమును, పడమట పాణిద్వారమును గలయిల్లు పడమటిల్లుగా వ్యవహరింపబడును. దీనికి స్థలానుగుణ్యముగ తూర్పుదిశయందు హెచ్చుగ కాళీస్థలముంచ వలయును. నైఋతి వాయవ్యదిశయందు వంటశాలలుండవలయును. ఈశాన్యమున నుయ్యి నిర్మింపవలయును. ఇది ధనాలయమనియు, లేదా భద్రమనియు వ్యవహరించ బడుచున్నది. శుభప్రదమైన గృహము.

## ఉత్తరపు యిల్లు :

ఉత్తరపుయిల్లు అనగా దక్షిణ సింహద్వారము గలయిల్లు. ఉత్తరదిశయందు పాణిద్వారముండును. దీనికి స్థలము ననుసరించి, ఉత్తర దిశయందు కంటె దక్షిణదిశయందు హెచ్చు కాళీస్థల మున్నను ఎట్టిదోషమును కలుగదు. దక్షిణ సింహద్వారము గల యింటికి వాయవ్యదిశయందు వంటశాల నిర్మించుకొన వలయును. నైఋతి దిశయందుగాని, ఆగ్నేయమున గాని విడిగా వంటశాలలు వేయవచ్చును. దీనికి తూర్పు, ఈశాన్య ఉత్తర దిశలలో నేదైనను నుయ్యి ఏర్పరచుకొనవచ్చును. దీనికే సుఖాలయ మనియు, నందపీఠమనియు పేర్లు గలవు. నిత్య సంతోష ప్రదమగు నిర్మాణము.

ఈ పై విధిననుసరించినచో మయబ్రహ్మ చెప్పినట్లుగా "పూర్వాది మధ్యసూత్రాణి అన్నం, ధాన్యం, ధనం, సుఖం" అను సూత్రము ననుసరించి సమన్వయమగును. ఎట్లనగా గృహనిర్మాణ స్థలమునందు గల యే దిశాభాగమును గృహము యెక్కువగా నాక్రమించి యుండునో ఆ దిశ ననుసరించి అన్నాలయాది నాలుగు యిండ్లు చెప్పబడినవి గదా ! దీనినే శిల్పసమయమనుట ఆచార సిద్ధమగు విషయము.



# శాలా స్వరూపము

"ఏకశాలక మేకేన ఛ్ఛన్నేన గృహముచ్యతే
గృహమేకం తు యచ్ఛన్నం సర్వంశాలేతి సాస్మృతాః"

ఏకశాల అనగా ఒకే పైకప్పు యొక్క ఆవరణక్రింద గల "శాల" అని పై ప్రమాణము వలన స్పష్టమగుచున్నది. ఈనాటి గృహనిర్మాణ పద్ధతుల ననుసరించి యెంతటి విశాలమగు నిర్మాణమునకైనను, ఒకే ఆచ్ఛాదన అనగా "శ్లాబ్" వేయుచున్నారు. కాబట్టి అట్టి నిర్మాణము లన్నియు ఏకశాలలుగానే పరిగణింపబడుచున్నవి.

మయమతము నందును, మానసారము నందును, ఏకశాల "దండకశాల" యను పేరున వ్యవహరింపబడినది. సమస్తజాతుల వారికి ఈ దండకశాల శుభప్రదమైనదని మయుని అభిప్రాయము.

"ప్రాగవాగపరోదీచ్యాం పృథక్శాలా ప్రధానికా
సర్వేషామపి జాతీనాం సామాన్యమితి విద్యతే"
(మయమతం 26 అధ్యాయం 5వ పేజీ)

"ఉక్తానాం సర్వజాతీనాం దండకం తు చతుర్దశి
పూర్వేవా దక్షిణేవాపి పశ్చిమే దండకం న్యశేత్"
(మానసారము)

పై శాస్త్రవచనముల ననుసరించి ఈ దండకశాలా నిర్మాణము ఏ దిక్కునందైనను చేయవచ్చును. అనగా తూర్పుయిల్లుగా గాని, దక్షిణపు యిల్లుగాగాని, పడమటి యిల్లుగాగాని, ఉత్తరపు యిల్లుగాగాని, ఏకశాలా నిర్మాణము శుభప్రదమైనదని మయుడు, మానసారముని చెప్పియున్నారు.

ఈ దండకశాలా నిర్మాణమును గూర్చి మయమతము 26వ అధ్యాయమునందు విపులముగా వర్ణింపబడియున్నది. ఈ దండకశాలలు అంతస్తులు గలవిగా నిర్మించుకొనవచ్చును. అంతస్తులు నిర్మించుకొనుటలో క్రింది శాలాభాగమునందు ఎన్ని గదులు కలవో అన్ని గదులు పైభాగమున నిర్మించుకొనుట సామాన్య నియమము.

అట్లు నిర్మింపలేని యెడల ఒకగది లేదా రెండు గదులు మాత్రమే పైభాగమున నిర్మించుకొని మిగిలిన భాగమును ఖాళీగా విడిచి మేడవలె అలంకరించుకొనవచ్చును. ఇట్టి నిర్మాణమునకు "ఖండహార్మ్యము" అని మయుడు నామకరణం చేసియున్నాడు. అంతస్తులు నిర్మించునపుడు క్రింది భాగమున గోడలేనిచోట పైభాగమున గోడ నిర్మింపకూడదు. ఇది సాధారణ నియమము.

దండక శాలకు ఆయా శైలీ భేదము ననుసరించి ఒక వసారా కాని రెండు వసారాలు గాని, నాలుగు వసారాలు గాని నిర్మించుకొనవచ్చును. ఒకే వరండా నిర్మించినపుడు ఇంటికి ముందు భాగమున మాత్రమే నిర్మించవలయును. రెండు వసారాలు నిర్మించునపుడు ఇంటికి ముందు వెనుకలయందు నిర్మించవలయును. నాలుగు వసారాలు నిర్మించ దలచినచో యింటికి నాలుగు దిశలయందు ఏర్పరచ వలయును. ఏ యింటికైనను ముందర వరండా లేకుండా వెనుక వరండా నిర్మించరాదు.

శాలాభాగము నందలి గదులు విశాలముగా రూపొందింప దలచినప్పుడు వసారా భాగమును శాలాభాగమునందు కలిపి పెద్దవిగా నిర్మించవచును. అట్లు నిర్మించునప్పుడు శాలాలింద భాగముల మధ్యయందు పై భాగమున తనాబీలను (అంధారిక) వేయవలయును. క్రిందిభాగమున కూడా శాలాలింద భాగములను వర్గీకరణ చేసి చూపవలయును. దండకశాలకు ముఖద్వారమునకు ముందు ముఖమండపము అనగా "పోర్టికో" నిర్మించుట శ్రేష్ఠమని మయుని అభిప్రాయము.

ఈ దండకశాలా నిర్మాణపద్ధతి మయమత వాస్తుశాస్త్రమునందు చక్కని క్రమ పద్ధతిలో వర్ణింపబడియున్నది. ఆ నిర్మాణశైలియందు యింటియొక్క మొత్తము వెడల్పు ఒక యూనిట్‌గా గ్రహింపబడినది. ఆ ప్రమాణము ననుసరించి దండకశాలా నిర్మాణభేదములు వివరింపబడినవి. ఈ వివరణమునందు కడు చిన్నదగు ఒకగది, వరండాగల యిల్లు మొదలగు మూడుగదులు చుట్టు వరండాలు గల యిండ్లు వరకు వర్ణింపబడియున్నవి.

మయమతము 26వ అధ్యాయమునందు వివరింపబడిన దండకశాలా భేదములు చక్కగా వివరింపబడిన విధము గమనింపుడు -

*దండకశాలా : 1*

విస్తారం తు త్రిధాకృత్వా చతుర్భాగం తదాయతమ్

ద్విభాగం గృహవిస్తారం వారమేకాంశ మగ్రతః
ఆస్యం తత్ ఖండదండాభం వాసం సర్వజనార్హకమ్
ఏతత్ దండకమిత్యుక్తం శాలానాం క్షుద్ర రూపకమ్

**(మయమతం 26 అధ్యాయం, 7వ పేజీ)**

ఇది ఒకగది, ఆ గదిముందు ఒక వరండా గలయిల్లు, గృహ విస్తారము అనగా వెడల్పును మూడుభాగములుగా జేసి అందు రెండు భాగములు శాలాగర్భముగాను నాలుగు భాగములు పొడవుగాను ఒక భాగము ముందర వరండాగాను నిర్మించి దండకశాల సర్వజనులకు శ్రేష్ఠమైనది. శాలాగర్భము యొక్క పొడవును తొమ్మిది సమభాగములుగ విభజించి అందు కుడిభాగమున 5 భాగములు, ఎడమ భాగమున మూడు భాగములు విడిచి మధ్యభాగమున ముఖద్వారముంచవలయును. ఈ ద్వార నిర్ణయము దండకశాలా భేదములన్నింటికి సామాన్యమగు నియమము.

*దండకశాల : 2*

విస్తారే చతురంశేతు షడంసాధిక మాయతమ్
ద్విభాగం గృహవిస్తారం ద్వ్యంశం చక్రమణం భవేత్
శేషం పూర్వవమద్దిష్టం దండకం తదుదీరితమ్

**(మయమతం 26 అ, 7వ పేజీ)**

ఇదియు ఒకేగది లేక హాలు, దానికి చుట్టు వరండాలు గలయిల్లు, గృహవిస్తారమును నాలుగు సమభాగములుగా విభజించి అందు రెండు భాగములు శాలాగర్భముగాను, ఆరు భాగములు పొడవుగాను, ముందు భాగమున రెండు భాగములు వరండాగాను మిగిలిన మూడు దిక్కులయందును రెండుభాగముల ప్రమాణముతో చంక్రమము అనగా చుట్టు వరండాగాను నిర్మించవలయును. ముఖమండపము అనగా "పోర్టికో" వంటి నిర్మాణముతో అలంకరించుట శ్రేష్ఠము. ఇట్టి నిర్మాణమునకు నాలుగు కోణములయందు గదులు యేర్పరచుకొనుట ఆచారమువందున్నది.

*దండకశాల : 3*

త్రిభాగం గృహవిస్తారం ద్విగుణం తస్య దీర్ఘకమ్
భాగం చంక్రమణోపేతం మధ్యమేచైక భక్తికమ్
కుల్యాభ ద్వారసంయుక్తం శేషం పూర్వవదాచరేత్
వంశమూలేతు వాసంస్యాత్ వంశాగ్రే రంగమీరితమ్
సర్వత: పరిత: కుడ్యం రంగం పాదస్య సంయుతమ్
భాగేన పురతోలిందం పార్శ్వయో పృష్ఠతస్తువా
ప్రసాదవదలంకుర్యాత్ దండకం తదుదీరితమ్

**(మయమతం 26 అ, 8,9 పేజీ)**

ఈ దండకశాల రెండుగదులు గలయిల్లు. యిందు వంశమూలము అనగా వెనుబద్ద మొదలువైపున గలగది, పడకగది, వంశాగ్రమునందు గలగది రంగము అనుపేరు గల హాలు, నిర్మాణశైలి గమనింపుదు -

గృహవిస్తారమును మూడు సమభాగములుగ జేసి, అందు రెండు భాగములు శాలాగర్భముగను, ఆరుభాగములు పాదవుగను ఒక భాగము చుట్టూ వరండాలుగను నిర్మించవలయును. మధ్యయందు శిరామర్మవేధలు లేనిచోట గోడను నిర్మించి వంశమూలమున అనగా వెనుబద్ద మొదలుగల దిక్కున పడకగదియును, చివరగల వైపున రంగము అనగా హాలును నిర్మించవలయును. యధావిభవమునమపరించి ముఖ మండపమును యేర్పరచుకొనవలయును. ప్రాసాదము అనగా మేడవలె అలకంరించు కొనుటకు కూడా తగిన నిర్మాణము. ఆంధ్రదేశమున పర్వజనాదరణీయమగు శైలిగల గృహము.

దండకశాల : 4

తదేవ మధ్యమే రంగం వాసా వంశాగ్రమూలయో:
యుక్త్యాన: స్తంభ సంయుక్తం వంశద్వారం నయోజయేత్
శేషం పూర్వవదుద్దిష్టం దండకం తదుదీరితమ్

ఇందు వర్ణింపబడిన దండకశాల మూడు గదులుగల నిర్మాణము. అనగా వంశాగ్ర మూలములయందు (వెమబద్ద మొదలునందు చివరయందు) రెండు పడకగదులు మధ్యభాగమునందు రంగము అనగా హాలు నిర్మించు శైలి. ఈ పద్ధతి ఆంధ్ర దేశమునందన్ని ప్రాంతములయందు వాడుకలోనున్నది.

ఈ దండకశాలా నిర్మాణమున గృహవిస్తారమును భాగములుగాజేసి అందు రెండుభాగములు శాలాగర్భముగాను ఆరుభాగములు పొడవుగాను ఏర్పరచవలయును. వెమబద్ద మొదలుగల దిక్కున, చివరగల దిక్కున పడక గదులు నిర్మించవలయును. మధ్యభాగము రంగము అనగా హాలు ఏర్పరచవలయును. ఒకభాగము ముందు వెనుకల యందుగాని, చుట్టువసారాలు గల నిర్మాణముగా గాని నిర్మింపవచ్చును. శిరామర్మవేధలు లేకుండా ద్వారములు ఏర్పరుచుకొనవలయును. దీనిని కూడ ప్రాసాదమువలె అలంకారము చేయవచ్చును.

*దండకశాల : 5*

షడంశం విస్తృతంచైవ ద్వాదశాంశం తదాయతం
భాగేన పరితోలింద్రం శాలాభాగం విభాగతః
తత్సమం పరితోలింద్రం యుక్త్యాంత స్తంభసంయుతం
పార్శ్వయోః ద్వ్యత్రిభాగేన శాలాయామే ద్వివాసగా
ద్విచతుర్భాగ విస్తారా యామం మధ్యేతు రంగకమ్
దండకం తదపిప్రోక్తం శేషం పూర్వ వదాచరేత్

**(మయమతం 26 అ, 10 పేజీ)**

ఈ దండకశాల - మూడుగదులు చుట్టూ వసారాలు గలయిల్లు. గృహవిస్తారమును ఆరు సమభాగములుగా జేసి అందు రెండుభాగములు శాలావిస్తారము అనగా గర్భముగాను పన్నెండు భాగములు పొడవుగాను, రెండేసి భాగములు చుట్టు వరండాలుగాను ఏర్పరచ వలయును. పార్శ్వముల యందు అనగా వెమబద్ద మొదలున్న వైపున మూడుభాగములతో ఒకగదియు, చివరివైపున రెండు భాగములతో రంగమును నిర్మింపవలయును లేదా

వంశమూలమున నాలుగు భాగములతోను వంశాగ్రమున రెండు భాగములతోను గదులను మధ్యయందు మిగిలిన ఆరుభాగములతోను హాలును నిర్మింపవలయును. ఈ దండకశాలను కూడ ముఖమండపముతో ప్రాసాదము వలె అలంకరించుకొనవచ్చును.

మయమతము 26వ అ, 6-7-8-9-10 పేజీలయందు గల పైనుదహరించిన దండక శాలా నిర్మాణశైలి సాంకేతిక విలువలతో నిండియున్నది. అందు వర్ణింపబడిన ఒకగది, రెండు గదులు, మూడు గదులు గల దండకశాలా నిర్మాణము ఆంధ్రదేశమునందన్ని ప్రాంతముల యందును జనసామాన్యమునకు అనువుగా నున్నది.

కాని నిపుణుడగు స్థపతిగాని, వాస్తుశాస్త్రవేత్తగాని మయునిచేత వర్ణింపబడిన శైలిని గ్రహించి, ఆ శైలికి అనువుగా దేశ,కాల,పాత్రతలకు అనువైనట్టియు, శుభప్రదమగు ఆయాదులు సిద్ధించునట్టియు కొలతలను గ్రహించి గృహనిర్మాణమునకు ఉపక్రమింపవలయును.

## రెండు గదుల యిల్లు :

రెండుగదుల యింటిని నిర్మించుట శాస్త్రసమ్మతము గాదని కొందరు పుక్కిటి పురాణములు చెప్పుచున్నారు. అట్లు చెప్పుట ఏమాత్రము శాస్త్ర పరిజ్ఞానము లేకనే అని చెప్పవలసియున్నది. మయుడు రెండు గదుల యింటిని గూర్చి స్పష్టముగా వర్ణించియున్నాడు. అట్లే మయుని తర్వాత అంతటి మహనీయ వాస్తుశాస్త్రవేత్త మానసార మహర్షి కూడ ఈ రెండు గదుల యింటిని గూర్చి వర్ణించిన పద్ధతి గమనింపదగినది.

"ద్విచతుర్భాగ విస్తార మాయామం తత్ర్పకల్పయేత్
శాలావిశాలతాం శేన తత్పూర్వేలిందయం శకమ్
ఏకద్వ్యంవేన వాసంస్యాత్ యధామూలంతు యోజయేత్
అథవాద్విద్విభాగేన వాసం తద్వంశమూలకే

అథవా చాయతార్ధేన మధ్యేకుంధ్యంతు కల్పయేత్
ద్వారంతత్కుడ్య పార్శ్వేతు వాసమేకం, ద్వయంభవేత్"
(మానసారం)

రెండువంతులు వెడల్పు, నాలుగు వంతులు పొడవు అనగా గర్భప్రమాణమునకు రెట్టింపు పొడవుతో శాలను నిర్మించవలయును, గర్భప్రమాణమునందలి సగము ప్రమాణముతో ముందరవసారా ఏర్పరచవలయును. వెనుకబద్ద మొదలున్న దిశను పడకగదియు, చివరగలచోట రంగమును నిర్మించవలయును. లేదా పొడవునందు మధ్యభాగమున శిరామర్మవేధలు లేనిచోట గోడను ఏర్పరచి రెండుగదులుగా నిర్మింపవలయును. ఇట్టి రెండుగదుల నిర్మాణమునందు మధ్యగోడకు రెండుప్రక్కల ద్వారములు ఏర్పరచవలయునని మానసార మహర్షి వివరించియున్నాడు.

రెండుగదుల యింటినిగూర్చి యింతస్పష్టముగా శాస్త్రవేత్తలు చెప్పియుండగా, రెండుగదుల యిల్లు కట్టరాదనుట అవివేకము కాగలదు.

## ఇంటికి యేయేదిశయందు యెంతెంత స్థలము విడువవలయును?

ఏకశాలా నిర్మాణమునందు యింటికి నాలుగుదిశలయందును కాళీస్థలము విడిచిపెట్ట వలయును. ఏయే దిశలయందు యెంతెంత స్థలము విడిచిపెట్టవలయును? అను విషయము ముఖద్వారము ననుసరించియు, వర్గారూఢము ననుసరించియు, ఆయా స్థలపరిమాణము ననుసరించియు శాస్త్రవేత్త స్థపతి నిర్ణయింపవలయును. అంతేగాని అన్నియిండ్లకు ఒకేవిధముగా తూర్పుఉత్తరముల యందే హెచ్చుగ కాళీస్థలము విడిచిపెట్టవలయునని చెప్పుట శాస్త్రవిరుద్ధము. ప్రాకారమును జేర్చి నివాసగృహము నిర్మింపరాదుగాని వంటశాలలు, పశువుల శాలలు, ధాన్యపుకొట్టములు మొదలగు ఉపగృహములు నిర్మించుకొనవచ్చును.

నివాసగృహమునకు యేదిశయందు యెంతెంత కాళీస్థలము విడిచి పెట్టవలయునో వివరించుచూ విశ్వకర్మ ప్రకాశికయందున్న శ్లోకమును గమనింపుడు -

**ఉత్తరే ద్విగునా భూమిః సమభూమిశ్చ పూర్వకే**
**పశ్చిమేత్రిగుణాభూమిః క్రోశ మేకంతు దక్షిణే**

**(విశ్వప్రకాశిక 217 పేజీ)**

ఇంటియొక్క గర్భము యెంత యెత్తున్నదో దానికి రెట్టింపుస్థలము ఉత్తరదిశ యందును, సమమగు భూమి తూర్పుదిశయందును, మూడు రెట్లు భూమి పడమరదిశ యందును, దక్షిణదిశయందు యెంత యెక్కువ కాళీస్థలమున్న అంతశ్రేష్ఠము అని భావము. కాబట్టి విజ్ఞులు ఈ శాస్త్ర నియమమునందున్న వైజ్ఞానిక రహస్యమును అవగతము చేసుకొని గృహనిర్మాణమునకు ప్రయత్నింపవలయును.

# శాలా నిర్మాణపద్ధతి

ఈ సర్వజగత్తు శబ్దమయమైనది. అట్టి శబ్దము మాత్రాబద్ధమై గురులఘు రూపాత్మకమై సమస్త విజ్ఞాన వికాసమునకు మూలభూతమై లోకకల్యాణముమ చేకూర్చుచున్నవి. సంగీతము, సాహిత్యము మొదలగు కళలు గూడ ఈ గురులఘు రూపాత్మకమగు శబ్ద విన్యాసముచేతనే రూపొందుచున్నవి. అట్లే ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థ సాధనమునకు గృహమే మూలకందము. మానవ జీవనమున గృహము ప్రముఖస్థానమాక్రమించుచున్నది. అట్టి ఈ గృహనిర్మాణము గూడ సంగీత-సాహిత్యముల వలె గురులఘు ప్రస్తారక్రమమున విశ్వకర్మాది మహర్షులచేత శాసింపబడినది. ఈ గురులఘు ప్రస్తారక్రమములో మొదటిదగు "నాలుగు గురువుల ప్రస్తారము" చేత పదహారు ఏకశాలా గృహములు యేర్పడుచున్నవి. సమస్త వాస్తుశాస్త్రములయందు ఈ లఘుగురు ప్రస్తారక్రమము మతభేదములు లేకుండా ఒకేవిధముగా చెప్పబడియున్నది. ఈ లఘుగురు ప్రస్తారక్రమము మానవ గృహనిర్మాణ విజ్ఞానమునకు మూలసూత్రముగా పరిగణింపబడుచున్నది.

లఘువునకు గుర్తు = ।　　　ద్వారము గల దిశ

గురువునకు గుర్తు = ఽ　　　గోడనిర్మించు దిశ

నాలుగు గురువుల ప్రస్తారమునందు గల నాలుగు గురువులు నాలుగు దిక్కులకు చిహ్నములు. అందు -

**1వది ఆద్య = తూర్పుదిక్కునకు గుర్తు**

**2వది ద్వితీయ = దక్షిణదిక్కునకు గుర్తు**

**3వది తృతీయ = పడమర దిక్కునకు గుర్తు**

**4వది చతుర్థ = ఉత్తరదిక్కునకు గుర్తు**

**ముఖ్య గమనిక :** ఈ ప్రస్తారమునందు "।" లఘువుగల దిక్కునందు ద్వారము, ద్వారము గల దిక్కున వరండాలనగా అళిందము తప్పక నిర్మించవలయును. "ఽ" గురువుగల దిక్కున గోడను నిర్మించవలయును. అందు కిటికీలు మాత్రమే ఏర్పరచవలయును. వసారాగాని గుమ్మముగాని నిర్మింపరాదు.

# నాలుగు గురువుల ప్రస్తారము

## 16 రకముల ఏకశాలా గృహములు, వాటి నామములు

| తూ ద ప ఉ | | గృహనామము | ద్వార, అళింద నిర్ణయము |
|---|---|---|---|
| 1. | ఽ ఽ ఽ ఽ | ధృవము | ద్వారహీనము |
| 2. | । ఽ ఽ ఽ | ధాన్యము | తూర్పు ముఖద్వారము |
| 3. | ఽ । ఽ ఽ | జయము | దక్షిణ ముఖద్వారము |
| 4. | । । ఽ ఽ | నందము | తూర్పు దక్షిణద్వారములు |
| 5. | ఽ ఽ । ఽ | ఖరము | పడమర ద్వారము |
| 6. | । ఽ । ఽ | కాంతము | తూర్పుపడమర ద్వారములు |
| 7. | ఽ । । ఽ | మనోరమము | దక్షిణ పడమర ద్వారములు |
| 8. | । । । ఽ | సుముఖము | తూర్పు,దక్షిణ,పడమరద్వారములు |
| 9. | ఽ ఽ ఽ । | దుర్ముఖము | ఉత్తరద్వారము |
| 10. | । ఽ ఽ । | ఉగ్రము | తూర్పు ఉత్తరద్వారములు |
| 11. | ఽ । ఽ । | సుపక్షము | దక్షిణ ఉత్తరద్వారములు |
| 12. | । । ఽ । | ధనదము | తూర్పుదక్షిణ ఉత్తరద్వారములు |
| 13. | ఽ ఽ । । | క్షయము | పశ్చిమ ఉత్తరద్వారములు |
| 14. | । ఽ । । | ఆక్రందము | తూర్పు, పశ్చిమ, ఉత్తర ద్వారములు |
| 15. | ఽ । । । | విపులము | దక్షిణ,పశ్చిమ,ఉత్తరద్వారములు |
| 16. | । । । । | విజయము | నాలుగుదిశలయందుద్వారములు |

ప్రతియింటియందు రెండు ప్రధాన భాగములుండును. అందు మొదటిది శాలాభాగము. దీనికే "గర్భము" అనుపేరు వాడుకలో నున్నది. రెండవభాగము అళిందము. ఈ అళిందమునకే వసారాయని వ్యవహరింతురు. ఈ అళింద సంయోజన వైవిధ్యముచేత 105 రకముల ఏకశాలాలు ఏర్పడుచున్నవి. మయుడు మానసార మహర్షి ఈ యేకశాలలు

గృహమును దండకశాల యనుపేరుతో వ్యవహరించి ఛందోబద్ధమగు రీతిలో శాలాస్వరూపమును చక్కగా వివరించియున్నారు.

పైనుదహరించిన షోడశ గృహప్రస్తారమునందలి 16 రకములగు యిండ్లలోను ధాన్యశాల, జయశాల, కాంతశాల, సుపక్షశాల, ధనదశాల, విజయశాల అని ఆరువిధములగు యిండ్లు మాత్రమే శుభప్రదములుగా భావింపబడి ఆంధ్రదేశమున వాడుకలోనున్నవి. ఈ ఆరుశాలలకు అళింద సంయోజనముచేత రమ్యాది విశేషగృహములు రూపొందింపబడు చున్నవి. కావున విజ్ఞులు ఈ గృహనిర్మాణశైలిని బాగుగా అవగతము చేసుకొని యిండ్లను నిర్మింపవలయును.

### 1. ధాన్యశాల : । ∩ ∩ ∩

పడమటి గోడను చేర్చి తూర్పుదిశయందు మాత్రమే ఒక వసారాయును గుమ్మములును పెట్టి నిర్మించిన యింటికి ధాన్యశాలయని పేరు. దక్షిణ, ఉత్తర, పశ్చిమదిశలకు కిటికీలు మాత్రమే ఏర్పరచుకొనవచ్చును. ఈ ధాన్యశాలకు వృషభాయము శ్రేష్ఠమైనది. గజాయము కూడ గ్రహింపవచ్చును. ఈ యిల్లు త,య,శ వర్గులవారికి శుభప్రదమగు గృహము.

### 2. రమ్యశాల : । ∩ ∩ ∩

ధాన్యశాలకు తూర్పుదిక్కున గల మొదటి వరండా తరువాత మరియొక వరండా అదే ప్రమాణముతో నిర్మించినచో అట్టి యింటికి రమ్యశాలయని పేరు. సమస్త శుభములను అష్టైశ్వర్యములను ప్రసాదించు నిర్మాణమని ఋషుల అభిప్రాయము.

### 3. జయశాల : ∩ । ∩ ∩

ఉత్తరగోడను చేర్చి గర్భమును, దక్షిణదిశయందు ముఖద్వారమును, ముఖద్వారము ముందు వరండాయును ఉంచి నిర్మించిన యింటికి జయశాలయని పేరు. తూర్పు పశ్చిమ ఉత్తర దిశలయందు కిటికీలు మాత్రమే ఏర్పరచవలయును. ఈ జయశాలకు గజాయము శ్రేష్ఠము. ధ్వజాయము కూడ గ్రహింపవచ్చును. ఈ గృహము య,శ, వర్గులవారికి శుభప్రదము.

### 4. కాంతశాల : । ∩ । ∩

లోకమునందు మిక్కిలిగా వాడుకలోనున్న తూర్పు పడమరలయందు

వసారాలుగల యింటికి కాంతశాలయని పేరు. ఈయింటికి తూర్పున ఒక వరండా పడమర ఒక వరండా యుండును. గర్భమునందు ఒకగదిగిని, రెండుగదులు గాని మూడుగదులు గాని కల్పించు కొనవచ్చును. కోణముల యందు గదులు ఏర్పరచుకొనవచ్చును. సింహద్వారము గృహ యజమాని వర్గనమనుసరించిగాని, రాశి ననుసరించిగాని తూర్పుదిశయందైనను పడమర దిశయందైనను ఏర్పరచుకొన వలయును. దక్షిణోత్తర దిశలయందు కిటికీలు మాత్రమే పెట్టవలయును. దీని వెనుబద్ధ దక్షిణోత్తర దిక్కులను సూచించుచుండును. ఇది మిక్కిలి శ్రేష్ఠమగు నిర్మాణవిశేషము. ఈ యింటికి పశ్చిమ ముఖద్వారముంచినచో ధ్వజాయము గల పదమును తూర్పుముఖద్వార ముంచినచో వృషభాయము గల పదముగాని గజాయము గల పదముగాని గ్రహింపవలయును.

**5. ముదితశాల : ॥ ∩ । ∩**

ఈ కాంతాశాలకు తూర్పుముఖద్వారము ఏర్పరచినప్పుడు ముఖద్వారము దిశయందలి మొదటి వరండా తరువాత మరియొక వరండా నిర్మించినచో ఆ యింటికి ముదితము అనిపేరు. మిక్కిలి శుభప్రదమైన నిర్మాణ విశేషము. నిర్మాణశైలి ననుసరించి వరండాలయందు కూడ గదులను ఏర్పరచుకొనవచ్చును.

**6. ఉత్తమశాల : ॥ ∩ ॥ ∩**

ఈ కాంతాశాలకు ముఖద్వారము తూర్పు పడమరలలో యేదిక్కునందేర్పరచినను, తూర్పున రెండు వసారాలు పడమర రెండు వసారాలు నిర్మించినచో అట్టి నిర్మాణమునకు ఉత్తమశాల యనిపేరు. సర్వోత్తమమగు గృహము. వరండాలలో గదులు నిర్మించుకొనవచ్చును. 6 గురువుల ప్రస్తారముచే సిద్ధించిన గృహము.

**7. సుపక్షశాల : (1) ∩ । ∩ ।**

ఇదియు మిక్కిలి వాడుకలోనున్న నిర్మాణము. దీనివెనుబద్ధ తూర్పు పడమర దిశలను సూచించుచుండును. దక్షిణమున ఒక వరండా ఉత్తరమున ఒక వరండా యుండును. వరండాల యందు కోణగృహములు ఏర్పరచుకొనవచ్చును. తూర్పు పడమర దిశలయందు కిటికీలు మాత్రమే నిర్మించవలయును. వర్గారూఢమునను సరించి గాని, రాశ్యాను కూలము ననుసరించిగాని దక్షిణోత్తరములలో నేదిక్కునందైనను ముఖద్వారముంచవచ్చును. దక్షిణ ముఖ ద్వారముంచినచో గజాయముగల పదమును,

ఉత్తరముఖ ద్వారముంచినచో సింహాయము గల పదమును గ్రహింపవలయును. ధ్వజాయము గల పదము గ్రహించినచో యేముఖ ద్వారమైనను శుభప్రదమగును. ఇట్టి నిర్మాణమునకే సుపక్షమని పేరు.

సుపక్షము :- (2) ౧. ౧౧. ౧. ౧౧.

ఈ సుపక్షశాలకు దక్షిణముఖ ద్వారమైనను ఉత్తర ముఖద్వారమైనను దక్షిణదిశయందు రెండు వరండాలును ఉత్తరదిశయందు రెండు వరండాలును నిర్మించుటచే సమస్త కోరికలు సిద్ధింపగలవని సమరాంగణసూత్రధారుని యభిప్రాయము.

"యస్యస్యాతామలిందౌ ద్వావగత: పృష్ఠస్తథా
ధనధాన్యమవాప్నోతి సౌభాగ్యంచాపి తద్గృహే."

(సమరాంగణం 113 పేజీ)

అనగా యేముఖద్వారముగల యింటికైనను ముందువెనుకలయందు రెండేసి వరండాలు నిర్మించిన సమస్త కోరికలు సిద్ధించునని భావము.

8. ధనదశాల :- ।. ।. ౧. ।.

పడమటి గోడకు చేర్చి గర్భమును దక్షిణ, ఉత్తర, తూర్పు దిశలయందు వరండాలును, గర్భగృహమునుండి మూడుదిశలయందలి వరండాలలోనికి ద్వారములును పడమర దిశయందు కిటికీలు మాత్రమే ఏర్పరిచి నిర్మించిన యింటికి ధనదశాల యనిపేరు. వరండాలయందు గదులు శైలీ భేదమునమసరించి నిర్మించుకొనవచ్చును. ఈ యింటికి వృషభాయపదముగాని, గజాయపదముగాని గ్రహింపవలయును. ఇది మూడు వరండాలు గలయిల్లు. ఛందో బద్ధమగు నిర్మాణమగుట చేత ముప్పంచ దోషము దీనికి వర్తించదు. ఇది త,య,శ వర్గుల వారికి శ్రేష్ఠము.

9. సునాభశాల : ॥ । ౧ ।

ఈ ధనదశాలకు తూర్పుదిశయందు మాత్రమే ముఖాలిందము అనగా రెండవ వరండా నిర్మించినచో అట్టి నిర్మాణమునకు సునాభము అని పేరు. ఈ వరండాయందు కూడ కోణగృహములు నిర్మించుకోవవచ్చును. రెండు వరండా భాగములను కలిపి విశాలమగు గదులుగా రూపొందింపవచ్చును. అయితే రెండు వరండా భాగములను "అంధారిక" అను తనాబీలను చూపి వేరుపరుచవలయును. ముఖభద్రము కూడ అట్లే

విశాలముగా నిర్మించుకొన వచ్చును. ఈ నిర్మాణపద్ధతియంతయు నిపుణుడగు స్థపతియొక్క విచక్షణపై ఆధారపడి యుండును.

**10. వృషభశాల : ॥ ॥ ఽ ॥**

ధనదశాలకు తూర్పు, దక్షిణ, ఉత్తర దిశలయందు ప్రతిదిశయందు రెండేసి వరండాలు చొప్పున నిర్మించిన యింటికీ వృషభశాలయని పేరు. వృషభశాలకు తూర్పు ముఖద్వారము మాత్రమే శ్రేష్ఠము. పైనుదహరించిన సునాభశాలకు గల నియమము లన్నియు దీనికి వర్తించును. ఇది ఏడు గురువుల ప్రస్తారముచే సిద్ధించిన నిర్మాణవిశేషము.

**11. విజయశాల : । । । ।**

నాలుగు దిశలయందు ద్వారములు, నాలుగు దిశలయందు వరండాలు గలయ యింటికి విజయము అనిపేరు. దీనికే "చుట్టూవరండాల యిల్లు" అని వ్యవహారము గలదు. గృహయజమాని వర్గు ననుసరించి గాని, రాశి ననుసరించిగాని నాల్గుదిశలయం దేదిక్కునందైనను సింహద్వారము యేర్పరవచ్చును. నాలుగు కోణములయందు నాలుగు గదులు నిర్మించుకొనవచ్చును. వెనుబద్ద ముఖద్వారము ననుసరించి తూర్పు పడమరలకు గాని, దక్షిణోత్తరములకు గాని వేయవచ్చును. విజయశాలకు నాలుగుదిశలయందు కాళీ స్థలము విడువవలయును. విశాలమగు కాళీస్థలము లభించినచో స్థలానుగుణ్యముగానైనను కాళీస్థలము విడువవలయును. దీనికే సర్వతో భద్రగృహమని పండితు లందురు. ఈ విజయశాల సౌభాగ్యప్రదము, పుత్రపౌత్రాభివృద్ధిదము అని శాస్త్రవచనము.

**12. సమృద్ధశాల : ॥ । । ।**

విజయశాలకు తూర్పు సింహద్వారము ఏర్పరచినప్పుడు ముఖద్వారము గల తూర్పుదిశయందు రెండవ వరండా నిర్మించినచో సమృద్ధశాలయని పేరు. ఈ సమృద్ధశాల పేరుకు తగినట్లుగా సర్వసంపత్సమృద్ధిని కలుగచేయగలదు. చక్కని నిర్మాణ విశేషము. విజయశాలకుగల నియమములన్నియు దీనికి వర్తించును.

*గమనిక :* విజయశాలకు యేముఖద్వార ముంచినను ముఖద్వారముంచిన దిశయందు ముఖాలిందము అనగా రెండవ వసారా వేయవచ్చునని మతాంతరము. కావున విజయశాలను ముఖాళిందముతో సమృద్ధశాలగ రూపొందించి తదుపరి ముఖమండపము అనగా "పోర్టికో"తో అలంకరించుకొనినచో ఈనాటి "శ్లాబ్" వేయు గృహములకు మిక్కిలి అనుకూలముగా నుండగలదు.

### 13. సునందశాల : ॥ ॥ ॥ ॥

విజయశాలకు యేదిశయందు ముఖద్వారముంచినను నాలుగుదిశలయందు రెండేసి వరండాలు నిర్మించిన యెడల అట్టి గృహమునకు సునందశాల యనిపేరు. విజయశాలకు వర్తించు నియమములన్నియు ఈశాలకు వర్తించును. కోణములయందు గదులు నిర్మించునపుడు రెండు వరండా భాగములను కలిపి ఒకే విశాలమగు గదిగా రూపొందించ వచ్చును. "ఆంధారిక"తో వసారాభాగములను వేరుపరచి చూపుట మరువరాదు. "స్తంభాంధారికయా యుక్తం సమకల్పన శోభితం" విశ్వకర్మ వాస్తుశాస్త్రం 554 పుట. ఇది యెనిమిది గురువుల ప్రస్తార వశమున సిద్ధించిన గృహము.

### 14. వర్ధమానము : ॥ । । ఽ

ధృవాది షోడశశాలలోను సుముఖశాలకు ముఖాలిందము నిర్మించుటచే యేర్పడు గృహము. దీనికి ఉత్తరదిశయందు గోడమాత్రమే నిర్మించి అందు కిటికీలుంచవలయును. తూర్పు దక్షిణ పశ్చిమములయందు వరండాలు ద్వారములు ఏర్పరచవలయును. సింహద్వారము తూర్పునకు మాత్రమే ఏర్పరచవలయును. ఆ సింహద్వారము ముందు రెండు వరండాలుండును. దీని వెనుబద్ద దక్షిణోత్తరములను సూచించును.

### 15. శ్రీధరశాల : ॥ । ఽ ఽ

తూర్పు దక్షిణ దిశలయందు హాలకాలిందము గల నందశాలకు తూర్పు ముఖద్వారము ఎదుట రెండవ వసారా అనగా ముఖాళిందము నిర్మించినచో అట్టి నిర్మాణమునకు శ్రీధరశాల యనిపేరు. ఇది సర్వసంపత్కారమైన నిర్మాణవిశేషము.

### 16. ప్రతిక్రమశాల : ॥ ఽ ఽ ॥

శాలోత్తరే ద్వావలిందౌ క్వచిత్ పూర్వే తథైవచ
ప్రతిక్రమేతి తన్నామా కర్తవ్యా సర్వకామదా

(అపరాజిత పేజీ 252)

అనగా యింటికి తూర్పు ఉత్తరదిశలయందు మాత్రము రెండేసి వరండాలు ఏర్పరచినచో అట్టి యింటికి ప్రతిక్రమశాల యనిపేరు. ఇది విశేష నియమము గల నిర్మాణ విశేషము. సమస్త శుభముల నిచ్చునని భువన దేవాచార్యుని మతము.

గమనిక : పైన వివరింపబడిన పదహారు శాలలు మిక్కిలిగా వాడుకచేయుటకు అనువైనవి. ఇంకను అనేక విధములగు శాలాభేదములు గలవు. కాని వాటి వివరములు గ్రంథవిస్తర భీతిచే విడువబడినవి. అభిరుచి గల విజ్ఞులు అపరాజితపృచ్ఛ అను గ్రంథము నందలి పీఠిక గృహసంయోజనము అను ప్రకరణము నందును, వాస్తురాజ వల్లభము ఆరవ అధ్యాయము నందును పరిశీలింపగలరు.



# అళింద నిర్మాణ విశేషవిధులు

శాలా స్వరూప లక్షణము (నిర్మాణశైలి) మరియు ఛందోబద్ధమగు శాలా నిర్మాణ పద్ధతి ఇంతవరకు పరిశీలింపబడినవి. ఈ ప్రకరణమునందు అళింద రచనా విశేష విధులు వివరింపబడుచున్నవి.

"అళిందము" అనగా వరండాయనియు "శాల" యనగా గృహగర్భము అనియు వెనకటి ప్రకరణములయందు చదివియుంటిమి. ఈ శాలాళింద భాగముల మొత్తమునకే "గృహము" అనుపేరు చెల్లును. ఈ గృహమునకు ముఖద్వారము గల దిశ ముఖము. పాణి ద్వారము గల దిశ, పృష్ఠము అనగా "వీపు" అని గ్రహించవలయును. అట్లే యింటికి కుడి యెడమలను కూడ గమనింపవలయును.

తూర్పు ముఖద్వారము గల యింటికి దక్షిణము కుడిప్రక్క, ఉత్తరము యెడమప్రక్క, దక్షిణ సింహద్వారము గలయింటికి పడమరదిశ కుడిప్రక్క, తూర్పుదిశ యెడమప్రక్క, పడమర ముఖద్వారము గలయింటికి ఉత్తరదిశ కుడిప్రక్క, దక్షిణదిశ యెడమప్రక్క, అట్లే ఉత్తర సింహద్వారము గల యింటికి తూర్పు కుడిప్రక్క, పడమర యెడమప్రక్కగా గమనింపవలయును.

దండకశాలా నిర్మాణశైలి యందు చెప్పబడిన విధముగా వెనుబద్ద మొదలున్నచోటు గృహయజమానికి పడకగది యేర్పరచుకొనుటకు వీలుపడనిచోట "దక్షిణాపవరకం గృహేశితుః" అను మయవాస్తు 17వ అధ్యాయం 102వ పేజీయందున్న ప్రమాణము ననుసరించి యింటికి కుడిపార్శ్వము నందున్న గదియందు గృహయజమానికి పడక యేర్పరచవలయును. ఈ విశేషవిధియు శాస్త్రబద్ధమైనది.

అళింద సంయోజన విశేషవిధులు అనేక విధములుగా వర్ణింపబడియున్నవి. కాని యిందు ముఖ్యముగా మనవాడుక చేయుచున్న విశేషములు మాత్రమే క్లుప్తముగా వివరింపబడు చున్నవి.

**1. ముఖాళిందము :** ముఖద్వారము ముందు భాగమున గల వరండాను

ముఖాళిందము అని పేరు. ముఖద్వారము ముందుగల "ఒంటి వరండా"కు ముఖాళిందమని అందురు. తూర్పు సింహద్వారము గల యింటికి తూర్పునందు, దక్షిణ సింహద్వారము గల యింటికి దక్షిణమునందు, పడమర సింహద్వారము గల యింటికి పడమరయందు, ఉత్తర సింహద్వారము గల యింటికి ఉత్తరమునందును ముఖాలిందము నిర్మింపవలయును.

*గమనిక :* ఈ నాలుగు విధములగు ముఖాలిందములలోను పడమర సింహద్వారము పెట్టి పడమర మాత్రమే ముఖాలిందము యేర్పరచి గృహము నిర్మింపరాదు. ధృవాది షోడశ గృహములలోను దీనికి "ఖరము" అను పేరు గలదు. కావున నింద్యమైనది. తూర్పువకు పాణిద్వారము లేని పడమర ముఖద్వార గృహము సర్వదా నింద్యమైనది. అట్లే ఉత్తరదిశ యందు ముఖద్వారము ఉత్తర ముఖాలిందము గల యింటికి ఉగ్రము అని పేరు. ఇదియు నివాస గృహముగా ఉపయోగింపరాదు. వంటశాలగాను ధాన్యపు కొట్టములుగాను ఉపయోగింపవచ్చును.

**2. పృష్టాలిందము :** ఏ సింహద్వారము గల యింటికైనను ముఖద్వారము ముందు వరండా లేకుండా పృష్టాలిందము అనగా వెనుక వరండా నిర్మింపకూడదు. కాబట్టి ముఖాలిందము అనగా ముందు వరండా చిన్నదైనను స్థలానుగుణ్యముగా యేర్పరచి పిమ్మట వెనుక వరండా నిర్మించుకొనుట శుభప్రదము.

**3. హాలకాలిందము :** హాలకాలిందము అనగా యే సింహద్వారము గల యింటికైనను రెండు దిశలయందలి వరండాలను కలిపి ఎల్ ఆకారముగా నిర్మించుట. ఈ హాలకాలిందము ముఖద్వారము గల దిశయందలి వరండాను యింటికి కుడిపార్శ్వము నందుగల మరియొక వరండాను కలిపి నిర్మించుట శుభప్రదము. ఎట్లనగా తూర్పు సింహద్వారము గల యింటికి తూర్పు దక్షిణదిశలయందు రెండు వరండాలను నిర్మించుట శ్రేష్ఠము. ధృవాది షోడశ గృహములలో యిట్టియిట్టి హాలకాళింద నిర్మాణము గల "నందశాల" శుభప్రదమైనది. మిగిలిన దిశలయందు హాలకాళిందము నిషేధింపబడినది.

**4. ముఖాళిందము :** ఏ యింటికైనను సింహద్వారము ముందుగల వరండా తరువాత మరియొక వరండా నిర్మించిన అదియు ముఖాలిందమనబడును. రమ్యాది గృహ విశేషములకు యిట్టి ముఖాళిందములు చేర్చబడును.

5. అళిందద్వయము : అలిందద్వయ మనగా ఒకేదిశయందు రెండు వరండాలు గాని, లేదా యే సింహద్వారము గల యింటికైనను ముఖద్వారము ముందు రెండు వరండాలు, వెనుక రెండు వరండాలుగా గాని నిర్మించుట అళింద ద్వయనిర్మాణమని అందురు. మరియు యే సింహద్వారము గల యింటికైనను నాలుగు దిశలయందు రెండేసి వరండాలు నిర్మించుట చాల శుభప్రదమని శాస్త్రములు చెప్పుచున్నవి.

6. అళిందత్రయము : అళిందత్రయమనగా మూడు వరండాలు, యీ మూడు వరండాలు గలయిల్లు ముప్పంచ అని కొందరు నిషేధింతురు. కాని ధృవాది షోడశ గృహప్రస్తారముచే సిద్ధించిన "ధనద" గృహమునకు తూర్పు, ఉత్తర, దక్షిణములయందు మూడు వరండాలు గలవు. దీనికి తూర్పుముఖద్వారము మాత్రమే శ్రేష్ఠము. కావున "ముప్పంచ" అను దోషము ఈ ధనద గృహమునకు వర్తించదు. ఈ "ముప్పంచ" అను దోషము ఆయా దిశలనుబట్టి యుండునని గ్రహింపవలయును.

7. పరితోలిందము : పరిత:+అలిందము అనగా చుట్టూ వసారా యని గ్రహింపవలయును. నాలుగు దిశలయందు వరండాలు శాలాభాగము నుండి నాలుగు దిశలయందున్న వరండాలలోనికి ద్వారములు గల యింటికి విజయమని పేరున్నది గదా? అట్టి పరితోలిందము గల గృహము సర్వతోభద్రమై సమస్త శుభములను యివ్వగలదు.

8. ముఖభద్రము : భద్రము అనగా మూడుదిశలయందు గోడ ఒకదిశయందు స్థంభములు గల వరండాభాగము. సాధారణముగా మూడు గదుల యింటికి ముందుగల వరండాయందు కోణముల యందలి గదులు పోను మిగిలిన వరండాభాగమునకు ముఖభద్రమని పేరు చెల్లును.

9. ముఖమండపము : ముఖమండపమనగా నేటి "పోర్టికో" వంటి నిర్మాణము. మయుడు దండకశాల లన్నింటికి ఈ ముఖమండప నిర్మాణము మిక్కిలి శుభకరమైనదని వివరించియున్నాడు. విశ్వకర్మ వాస్తుశాస్త్రమునందు ఈ ముఖమండప నిర్మాణమును గూర్చి ప్రత్యేకమగు అధ్యాయమున వివరింపబడినది. ఈ ముఖమండప నిర్మాణమునందు ఆయాదులు చూడనవసరము లేదు.

10. కోణగృహము : మూలగదులకు కోణగృహములని పేరు. వరండాలయందు యిరుప్రక్కలయందు నిర్మించు గదులకు కోణగృహములను పేరు చెల్లును. ఇది 1.దిగోడ సారులకైనను లేదా దూలముల సారునకైనను నిర్మింపవలయును.

"భిత్తిభేదో న కర్తవ్యం తులాగ్రైరకి లైరపి

కుర్యాద్బ్రహ్మ పదన్యస్తో భారపట్టకుల క్షయమ్"
(సమరాంగణ 266 పేజీ)

తుల అనగా దూలము. దూలముయొక్క కొనలు లేక చివర భాగములకు యెదురుగా అళిందములందు గోడలు నిర్మించి కోణగృహములు నిర్మింపవలయును. కోణగృహములు నిర్మించునప్పుడు అళిందములయందు నిర్మించు గోడలు దూలముల చివరలకు గాని, మొదళ్ళకు గాని సమానముగనే యుండవలయును గాని భేదింపరాదని భావము.

ముఖ్యగమనిక : ఈ అళింద విన్యాసమునందు యింకను ఎన్నో విశేషములు గలవు. ఒక్కొక్క దిశయందు రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు వరండాలు గల నిర్మాణములు వాస్తు రాజవల్లభమునందు చెప్పబడియున్నవి. ఆసక్తి గలవారు రాజవల్లభమును పరిశీలింపగలరు. ఒక ముఖ్య విశేషము మాత్రము ఇట వివరించి ఈ ప్రకరణము ముగింపబడుచున్నది.

ఇంటికి యే దిశయందలి వరండాయైనను గర్భప్రమాణము కంటె తగ్గియుండవలయును. నాలుగు వైపులయందు గాని గృహాగ్ర పృష్టములయందు అనగా ముందు వెనుకల యందుగాని సమప్రమాణము గల వరండాలుంచుట శ్రేష్ఠము. నిర్మాణశైలి ననుసరించి -

"స్యాదున్నతిః పూర్వ నతేనరాణాం
వాస్తౌ దక్షిణభాగ తుంగే"

అను శాస్త్రవచనము ననుసరించి గృహభూమి వలె గృహఛాద్యము అనగా పైకప్పు గూడ కొలదిగ తూర్పు ఉత్తర దక్షిణ పడమరల కంటె పల్లముగా నుండవలయునను సూత్రమును పాటింపవలసియున్నందున తూర్పు ఉత్తర వరండాలు ఒకటి లేక రెండంగుళములు హెచ్చుగ పెట్టినచో పై సూత్రమునకు అనుగుణముగా ఉత్తరము, తూర్పు దిశలయందలి యింటిచూరు కొంచెము క్రిందగును. వడ్రంగపు పనివారు ఈ విషయమును బాగుగా గమనించి దక్షిణ పడమరలచూరు కంటె తూర్పు ఉత్తరముల యందలి యింటిచూరు కొద్దిగ దిగియుండునట్లు నిర్మింపవలయుననుట శిల్ప సమయము. పారంపర్యముగా వచ్చుచున్న ఆచారము.

# గృహభాగత్రయ విధి

ఏకశాలా గృహమునకు నాలుగు దిశలయందు స్థలానుగుణ్యముగ, శాలానుగుణ్యముగ కాళీస్థలమును విడువవలయునని వెనుకటి ప్రకరణములయందే వివరింపబడియున్నది. యింటికి చుట్టును ప్రహారీ గోడ నిర్మింపబడియుండి గృహ యజమానికి అరణ్యగల ముఖద్వారముతో నిర్మింపబడిన గృహమునందు యేయే భాగములు యేయే పనులకు వినియోగింపవలయునో ఈ "గృహభాగ త్రయవిధి" వివరించుచున్నది. ఈ భాగత్రయ గృహవిభాగము ననుసరించి ఆయా శాలాభాగములను, ఆయా నిర్దిష్ట కార్యములకే వినియోగింపవలయునని విశ్వకర్మ శాసించియున్నాడు.

"బ్రహ్మ గంధర్వ మానుష్య భాగత్రయ విభాజితమ్
కారయేత్ మతిమాన్ శిల్పీ కల్పనార్థ పృథుక్రియమ్"
*(విశ్వకర్మ వాస్తుశాస్త్రమ్ 533 పుట)*

పై ప్రమాణముననుసరించి గృహము మూడు ప్రధాన భాగములుగా విభజింపబడు చున్నది.

1. దేవభాగము = సింహద్వారము ముందుగల వసారా భాగము
2. గంధర్వభాగము = శాలాభాగము అనగా గర్భగృహము
3. మానుషభాగము = పాణిద్వారము దాటిన పిమ్మట గల వెనుక వరండా.

**1. దేవభాగము :** ఏ ముఖద్వారము గల యింటికైనను ముఖద్వారమునకు ముందుగల వరండాభాగమునకు బ్రహభాగమనియు లేక దేవభాగమనియు పేరు గలవు. మానవునకు ముఖము యెంతటి ప్రధానమైనదో యింటికి ఈ దేవభాగము అంత ముఖ్యమైనది. మానవుని హృదయగతమగు సుఖమునుగాని, దుఃఖమును గాని, ముఖమును బట్టి మనము యెట్లు గ్రహింపగలమో అట్లే యింటి ముంగిలిని చూడగనే మనమా యింటిలో నివసించు వారి సుఖదుఃఖములను స్థితిగతులను అంచనా వేయగలము. కావున ప్రతియింటియొక్క ముఖభాగమునందలి వరండా ముంగిలి యెల్లప్పుడు కలకలలాడుచుండు నట్లుండ వలయునని శాస్త్రకర్తల యభిప్రాయము. ఈ

దేవభాగమువందు అతిథిసత్కారము, పురాణ శ్రవణము, విద్యావ్యాసంగము, మిత్రసమాగమము మొదలగు కార్యములకు వినియోగింప వలయును.

**2. గంధర్వ భాగము :** గంధర్వభాగ మనగా గృహగర్భము. ఈ గర్భగృహమును రెండు లేదా మూడు భాగములుగా విభజింపవలయును. గర్భగృహమును రెండు భాగములుగా విభజించినప్పుడు

"వంశమూలేతు వాసంస్యాత్ వంశాగ్రే రంగమీరితమ్"

అను మయుని వాక్యము ననుసరించి వెనుబద్ద యొక్క మొదలు చివరగల దిశలయందు గాని లేదా శ్లాబు నిర్మాణమైనచో కుడి ఎడమ పార్శ్వములయందుగాని రెండు గదులు మధ్యహాలును నిర్మింపవలయును. గదులయందు గృహ యజమాని నివాసముగాను, మధ్యహాలు పిల్లలు తదితరులు మనలున్థలములుగాను ఉపయోగింపవలయును.

**3. మానుష భాగము :** పాణిద్వారము దాటిన పిమ్మటగల లోపలి వరండా భాగమునకు మానుష భాగమని పేరు. ఇది గృహపృష్ఠమందున్న వరండా భాగము కాబట్టి యిందు వంటశాల, భోజనశాల, భండారము అనగా "స్టోరేజీ" సామానులు నిలువచేయు గదులు యేర్పరుచుకొన వలయును. ఈ విధముగ వంటశాల యింటికి వెనుక భాగమునందున్నప్పుడే గృహ యజమానురాలు వంట పనులయందు తగు అజమాయిషీ వహించియుండగలదు.

మన పూర్వఋషులు యెంతయో దూరదృష్టిగలవారగుట చేతనే యింటియొక్క యేయే భాగమును యేయే పనులకు వినియోగింపవలయునో వైజ్ఞానికదృక్పథముతో పరిశీలించి పై విధమగు గృహభాగ త్రయవిధిని బాగుగా అన్వయించుకొని ఆయా నిర్మాణములు సాగించుకొనుట శుభప్రదము.

**గమనిక :** గృహము వాస్తుపురుష స్వరూపమనియు, ముఖద్వారము వాస్తుపురుషుని ముఖమనియు యిదివరకే వివరింపబడినది. కాబట్టి గృహమువందలి యేయే భాగములు యేయే పరిస్థితులకు తగినవిగా నిర్దేశింపబడినవో అట్లు వినియోగింపక తద్విరుద్ధముగా వినియోగించినచో విరుద్ధమగు ఫలితములనే పొందగలరు.

# హస్తాది మాన నిర్ణయము

గృహాదీనాం తు హస్తేన యానేచ శయనే బుధైః
వితస్తినా విధాతవ్యం క్షుద్రాణా మంగుళాన తు
యవే నాల్పీయసాంమాన మేవం మానక్రమం విదు :
**(మయమతం 5 అధ్యాయం 22 పుట)**

మన ప్రాచీన శిల్పఋషులు గృహాది నిర్మాణ కార్యములయందు ఉపయోగింప తగిన మానదండము అనగా కొలబద్దను "హస్తము" అను పేరుతో వ్యవహరించిరి. అందుచేతనే మయుడు - "గృహాదీనాం తు హస్తేన" అనగా గృహాది నిర్మాణములయందు "హస్తము" అను కొలబద్దనే ఉపయోగింపవలయునని శాసించి యున్నాడు. వాహనాది నిర్మాణములయందును, శయ్యాదికము అనగా మంచములు, సోఫాలు మొదలగువాటియందు "వితస్తి" అనగా అడుగును కొలబద్దగా గ్రహింపవలెనని వివరింపబడినది. ఇంకను తక్కువ పరిమాణము గలవాటియందు అంగుళమానము చేతగాని లేదా యవాదుల చేతనుగాని ఆయాదులను సాధన చేయవలయునని మయుని అభిప్రాయము. సమరాంగణ సూత్రధారుడు కూడ పై యభిప్రాయమునే అనుసరించియున్నాడు.

ఆయవ్యయాంశ కర్షాణి ప్రవక్ష్యామోద వేశ్మనామ్
గృహమానవశాత్ సమ్యక్ కర్తుః స్థానబలా బలమ్
నగరేవా, పురాదౌవా దండైర్మానం విధీయతే
తదలాభేకరైః కార్యం సమ్యగాయ విశుద్ధయే
యత్రహస్తైర్మితి క్షేత్రే తత్రాయో హస్త సంశ్రితః
క్షేత్రా లాబేతు తత్రైవ గ్రాహ్యాః సస్యాదిహాంగులైః
అంగులైస్తుమితే క్షేత్రే సోంగులైస్తద లాభతః

పాదైర్వాధయవైర్వాపి గ్రాహ్యక్షేత్రానుసారత:
(సమరాంగణం 26 అధ్యాయం 147 పుట)

అనగా నగర, పుర గ్రామాది నిర్మాణములయందు దండమానము చేత ఆయాది సాధన చేయవలయును. అట్లు దండమానము చేత ఆయవ్యయాది సాధన సిద్ధించని పక్షమున హస్తమానము చేత ఆయవ్యయాదులు సాధించుట ఉత్తమమని సమరాంగణము స్పష్టపరచుచున్నది.

ఇండ్లు మొదలగు వాటి నిర్మాణములయందు "హస్తము" అను కొలబద్దచేతనే ఆయవ్యయాదులు సాధించవలయును. అట్లు హస్తమానము చేత శుభప్రదమగు ఆయవ్యయాదులు సిద్ధింపని యెడల "గ్రాహ్యః క్షేత్రానుసారతః" అను వాక్యము ననుసరించి అడుగులలో గాని, అంగుళములలో గాని శుభప్రదమగు ఆయాదులు సిద్ధించు క్షేత్రీకృతమును సాధింపవలయును. ఈ సమరాంగణమునందలి అభిప్రాయమును మయమతమునందలి అభిప్రాయమును ఒకేవిధముగా నున్నందున హస్తమానము చేత శుభప్రదమగు ఆయాది వర్గము సిద్ధింపనియెడల క్షేత్రానుకూలమగు ప్రమాణమును గ్రహించి అడుగులలో గాని అంగుళములలో గాని కడకు యవలలో గాని ఆయాది శుభవర్గమును సాధించుట శాస్త్రసమ్మతమని ఋజువగుచున్నది. అనగా "భిన్నపదము" హస్తమునకు భిన్నమైన క్షేత్రీకృతపదము గ్రాహ్యమని ఋషుల యభిప్రాయముగా గమనింపవలయును.

హస్త ప్రమాణము : హస్తమనగా కొలబద్ద అని గ్రహించియుంటిమి. కాని సుమారు మూడు వందల సంవత్సరములకు పైబడి భారతీయ జనజీవనమునందు బ్రిటీషువారి "గజము" ప్రముఖమగు స్థానమునాక్రమించి యున్నది. ప్రభుత్వ ప్రభుత్వేతర నిర్మాణ కార్యములన్నింటను ఈ "గజము" కొలబద్దగా వాడుకలో నున్నది. కాని మనకు స్వతంత్రము వచ్చిన పిమ్మట మరియొక "కొలబద్ద", అవతరించినది. అదియే "మీటరు". దశాంశ పద్ధతిలో గల మానోపకరణము. ఈనాటి భారతీయ ప్రభుత్వము ఈ "మీటరు"నే ప్రామాణికమైన కొలబద్దగా స్వీకరించినది. ఈ పరిస్థితులలో ప్రాచీన భారతీయ హస్తము, గజము, మీటరు అను మూడింటిలోను దేనిని గ్రహింపవలయునని సందిగ్ధావస్థలో నుండుట సహజము. కాబట్టి ఈ మూడు కొలబద్దలను గూర్చి వాటి వాటి అర్హతలను గూర్చి విమర్శింపవలసియున్నది.

హస్తప్రమాణమునకు ప్రాతిపదిక అంగుళము. శిల్పముని శ్రేష్ఠుడగు మయుని అభిప్రాయము ననుసరించి -

8 యవలు = ఒక అంగుళము

12 అంగుళములు = ఒక వితస్తి

2 వితస్తులు = ఒక "కిష్కు" హస్తము.

ఈ అంగుళమానము భారతీయమైనది. పై వివరము ననుసరించి 24 భారతీయాంగుళములు గల హస్తము ఒక "కిష్కు" అను పేరు గల హస్తమగునని వివరింపబడియున్నది. శిల్పరత్నము మొదలగు దాక్షిణాత్య సాంప్రదాయ శిల్పగ్రంథములు మయుని మానమునే స్వల్పభేదముతో అంగీకరించినది. గృహాది సమస్త నిర్మాణ కార్యములందును మానోపకరణముగా ఈ కిష్కుహస్తమునే గ్రహింపవలయునని మయుని అభిప్రాయము.

మయుడు మూడు హస్తములు వివరించియున్నాడు. గమనింపుడు

మాత్రాంగుళములు = 24 = కిష్కు హస్తము

మాత్రాంగుళములు = 25 = ప్రాజాపత్యము

మాత్రాంగుళములు = 26 = ధనుర్ముష్టి

పై నుదహరించిన మూడు విధములగు హస్తములు మయునిచే వివరింపబడినవే. "కిష్కు" హస్తము అనుకూలింపనిచోట ప్రాజాపత్యమును గాని, ధనుర్ముష్టిని గాని వినియోగింపవచ్చును. ఇందు ధనుర్ముష్టి బ్రిటీషువారి "గజము" నకు 99% సరిపడియున్నది. గమనింపుడు.

"శిల్పస్పెగాల్" అను తమిళ శిల్పగ్రంథమునందు ఒక భారతీయాంగుళము విలువ = 1 3/8 = బ్రిటీషు అంగుళములని వివరింపబడినది. సుప్రసిద్ధులగు దాక్షిణాత్య శిల్పివరేణ్యులందరు ఈ అంగుళమానమునే స్వీకరించి దేవాలయాది సమస్త నిర్మాణ కార్యములు కొనసాగించుచున్నారు. ఇట్టి భారతీయాంగుళ ప్రమాణము = 1 3/8 అయినచో ధనుర్ముష్టి = 1 3/8 26 = 35 - 3/4 = 36 బ్రిటీషు అంగుళములు.

కాబట్టి ధనుర్ముష్టి అనగా బ్రిటీషువారి గజము అగుచున్నది. అట్టి "గజము" మయముని ప్రతిపాదితమైన "ధనుర్ముష్టి" అను పేరుగల హస్తమునకు సమానము. కావున "గజము"ను కొలబద్దగా గ్రహించుట శాస్త్ర సమ్మతమేయని ఋజువగుచున్నది.

అంగుళ ప్రమాణమునందు మరియొక మత మున్నది. కొందరు భారతీయ శిల్పశాస్త్ర

హస్తప్రమాణమునకు ప్రాతిపదిక అంగుళము. శిల్పముని శ్రేష్ఠుడగు మయుని అభిప్రాయము ననుసరించి -

8 యవలు = ఒక అంగుళము

12 అంగుళములు = ఒక వితస్తి

2 వితస్తులు = ఒక "కిష్కు" హస్తము.

ఈ అంగుళమానము భారతీయమైనది. పై వివరము ననుసరించి 24 భారతీయాంగుళములు గల హస్తము ఒక "కిష్కు" అను పేరు గల హస్తమగునని వివరింపబడియున్నది. శిల్పరత్నము మొదలగు దాక్షిణ్యాత్య సాంప్రదాయ శిల్పగ్రంథములు మయుని మానమునే స్వల్పభేదముతో అంగీకరించినది. గృహాది సమస్త నిర్మాణ కార్యములందును మానోపకరణముగా ఈ కిష్కుహస్తమునే గ్రహింపవలయునని మయుని అభిప్రాయము.

మయుడు మూడు హస్తములు వివరించియున్నాడు. గమనింపుడు

మాత్రాంగుళములు = 24 = కిష్కు హస్తము

మాత్రాంగుళములు = 25 = ప్రాజాపత్యము

మాత్రాంగుళములు = 26 = ధనుర్ముష్టి

పై నుదహరించిన మూడు విధములగు హస్తములు మయునిచే వివరింపబడినవే. "కిష్కు" హస్తము అనుకూలింపనిచోట ప్రాజాపత్యమును గాని, ధనుర్ముష్టిని గాని వినియోగింపవచ్చును. ఇందు ధనుర్ముష్టి బ్రిటీషువారి "గజము" నకు 99% సరిపడియున్నది. గమనింపుడు.

"శిల్పస్పెగాల్" అను తమిళ శిల్పగ్రంథమునందు ఒక భారతీయాంగుళము విలువ = 1 1/8 = బ్రిటీషు అంగుళములని వివరింపబడినది. సుప్రసిద్ధులగు దాక్షిణాత్య శిల్పవరేణ్యులందరు ఈ అంగుళమానమునే స్వీకరించి దేవాలయాది సమస్త నిర్మాణ కార్యములు కొనసాగించుచున్నారు. ఇట్టి భారతీయాంగుళ ప్రమాణము = 1 3/8 అయినచో ధనుర్ముష్టి = 1 3/8 26 = 35 - 3/4 = 36 బ్రిటీషు అంగుళములు.

కాబట్టి ధనుర్ముష్టి అనగా బ్రిటీషువారి గజము అగుచున్నది. అట్టి "గజము" మయముని ప్రతిపాదితమైన "ధనుర్ముష్టి" అను పేరుగల హస్తమునకు సమానము. కావున "గజము"ను కొలబద్దగా గ్రహించుట శాస్త్ర సమ్మతమేయని ఋజువగుచున్నది.

అంగుళ ప్రమాణమునందు మరియొక మత మున్నది. కొందరు భారతీయ శిల్పశాస్త్ర

కాబట్టి ఈ రెండు గ్రంథములనే గాక వీటి అనుయాయి గ్రంథములగు శిల్పరత్నము, సమరాంగణము మొదలగువని పరిశీలించిన మీదట ఈ క్రింది సమన్వయ విధానము రూపొందింపబడినది.

1. కిష్కుహస్తము = 18 బ్రిటీషు అంగుళములకు సమానము (విశ్వకర్మ)
2. కిష్కు హస్తము = 33 బ్రిటీషు అంగుళములకు సమానము (మయుడు)
3. ధనుర్ముష్టి = 36 బ్రిటీషు అంగుళములకు సమానము (మయ, విశ్వకర్ములు)
4. మీటరు = భారత ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడినది.

ప్రాజ్ఞుడగు స్థపతి పై నాలుగింటియందును మొదటి మూడు విధములగు హస్తములలోను యేదో యొకటి ఆయా దేశ, కాల, క్షేత్రములకు అనుకూలమగు హస్తమును మానోపకరముగా గ్రహించి యిండ్లు మొదలగు నిర్మాణములు కొనసాగించ వలయును.

"వాస్తూనాం చ ధనుర్ముష్టిః గ్రామాదీనామియంతువా"

అను శిల్పరత్న ప్రమాణముచేత గూడ "ధనుర్ముష్టి" సమస్త వాస్తుకర్మలకు శుభ ప్రదమని తెలియవలయును. ఈ ధనుర్ముష్టి యనగా "గజము"గా వివరింపబడియున్నది.

నాలుగవదగు మీటరు భారత ప్రభుత్వముచే ప్రామాణికమగు మానోపకరణముగా నిర్ధారింపబడియున్నది. కాబట్టి సార్వజనికమగు నిర్మాణములయందు అనగా రైసుమిల్లులు, సినిమాహాలు, ప్రభుత్వ భవనములు, లైబ్రరీలు, విద్యాలయములు మొదలగు కట్టడములయందు ఈ మీటరును కొలబద్దగా గ్రహించి ఆయాదికమును సాధింపవలయును. కుశలుడగు స్థపతి దేశకాల పరిస్థితులను గమనింపవలయును గదా!

# క్షేత్రీకృత సాధనవిధి

గ్రామ, గృహ, ప్రసాదాది నిర్మాణ కార్యములయందు, ఆయాది వరసాధన నిమిత్తము స్వీకరింపబడు స్థల పరిమాణ విశేషమునకు క్షేత్రీకృతము అనిపేరు. దీనికే క్షేత్రఫలము, పదము, పిండము అను పేర్లు పర్యాయ పదములుగా వ్యవహారమునందున్నవి. ఈ క్షేత్రీకృత సాధన నిమిత్తము నాలుగు పద్ధతులు అవలంబింపబడుచున్నవి.

మొదటి పద్ధతి - 2 పొడవులు + 2 వెడల్పులు = పరిధి (మయమతం)

రెండవ పద్ధతి - పొడవు ఇంటు వెడల్పు = పదము (కాలామృతము)

మూడవ పద్ధతి - ఇష్ట నక్షత్రము ననుసరించి (ముహూర్త చింతామణి)

నాల్గవ పద్ధతి - పర్యంతమానము (వాస్తు విద్య)

పై నుదహరించిన నాలుగు పద్ధతులలోను మొదటిదగు "పరిధి" అనగా చుట్టుకొలతను (పిండము) ఆయాది వర్గసాధనకు ప్రాతిపదికగా గ్రహించు పద్ధతి ఆంధ్రదేశమునందు కొన్ని ప్రాంతములయందు తప్ప, మిగిలిన దక్షిణ భారతదేశమునందంతటను వ్యవహారము నందున్నట్లు తెలియుచున్నది.

రెండవదగు వైశాల్యమును "పిండము"గా గ్రహించి ఆయాది వర్గమును సాధించు పద్ధతి ఆంధ్రదేశమునందలి కొన్ని ప్రాంతములయందు ముఖ్యముగా కృష్ణా గోదావరీ పరీవాహక ప్రాంతములయందు వ్యవహారమునందున్నది.

మూడవదగు ముహూర్త చింతామణ్యాది గ్రంథముల యందలి యిష్ట నక్షత్రము ననుసరించి పిండమును సాధించి ఆ పిండమును ప్రాతిపదికగా ఆయాది వర్గమును సాధించు పద్ధతి ఉత్తరాదియందు బహుళ ప్రచారమునందున్నది.

నాలుగవదగు పర్యంతమాన పద్ధతి వాస్తువిద్యయందు మాత్రము ప్రతిపాదింప బడినది. ఈ పద్ధతి ఆంధ్రదేశమునందంతగా ప్రచారము లేదు. పిండితార్థమేమనగా ప్రస్తుతము బహుళ ప్రచారమునందున్న రెండు పద్ధతులను గూర్చి మాత్రమే ఇట వివరింపబడుచున్నది.

**పరిధి = పిండము :-**

మయుడు గొప్ప విజ్ఞానవేత్తయని వేరుగ చెప్పనక్కర లేదు. అట్టి మయముని

వచనము ననుసరించి "రెండు పాదవులు + రెండు వెడల్పులు = పరిధి"

ఆయాదిసాధనకు ప్రాతిపదికగా గ్రహింపవలసియున్నది. పరిధి అనగా చుట్టుకొలత

"వ్యాసాయామ సమూహే వసునిధి గుణితే దినేశ ధర్మహృతే
ఆయవ్య యమవశిష్టం రామఘ్నే అష్టాపహృచ్ఛేషమ్
ధ్వజధూమ సింహశ్వా వృషఖర గజకాకాశ్చ యోనిగణాః"
(మయమతం 9వ అ, 62పుట)

పై ప్రమాణము ననుసరించి "వ్యాసాయామ సమూహము" అనగా రెండు పాదవులు +రెండు వెడల్పులు అని అర్థము. అట్టి వ్యాసాయామ సమూహము అనగా చుట్టు కొలతను ప్రాతిపదికగా (యూనిట్) గ్రహించి ఆయాది వర్గమును సాధింపవలయునని భావము. ఈ మయుని అభిప్రాయము ననుసరించియే మనుష్యాలయ చంద్రికా కారుడు కూడ

"ఇష్టాతాన వితాన మాన నిచయే త్రిఘ్నేష్టభిర్భాజితే
శేషోయోని రిహవ్యయో మునియుజాదాయోష్టనిష్టఘ్నే ఋణైః"
(మనుష్యాలయ చంద్రిక 3 అ, 25 శ్లోకం)

అని వివరించియున్నాడు. "ఇష్ట ఆతాన వితాన మాన నిచయము" అనగా యజమానునకు అభీష్టమగు పొడవు వెడల్పుల సమూహము అని అర్థము. దీనికే పరిధి లేక చుట్టుకొలత అను వ్యవహారమని అందరు యెరిగియున్నదే. ఈ పరిధిని ప్రాతిపదికగా గ్రహించి, ఆయువ్యయాది వర్గసాధన చేయుపద్ధతి మయుని అభిప్రాయము ననుసరించియే చెప్పబడియున్నది.

ఇంకను అగస్త్యప్రోక్తమగు సకలాధికారము నందును మానసారము, విద్యా మాధవీయము మొదలగు గ్రంథములయందు పరిధిని గాని, పొడవును గాని, వెడల్పును గాని ప్రాతిపదికగా స్వీకరించి ఆయాది వర్గమును సాధింపవచ్చునని "వికల్పము" చెప్పబడినది.

దేవాలయాది నిర్మాణములయందు పై మూడింటిలో నేదో యొకదానిచేత గాని లేదా యెత్తుచేత గాని ఆయాదికము సాధింపవచ్చునని వివరింపబడియున్నది. మానసారము 9వ అధ్యాయమునందు ఆయాది లక్షణమునందు విపులముగా చూడగలరు.

పిండితార్థమేమనగా మొత్తముమీద దాక్షిణాత్య శిల్పఋషులందరు "పరిధి"ని ప్రాతిపదికగా స్వీకరించి గృహాది నిర్మాణములయందు ఆయాదికమును సాధించుట

శుభప్రదమని వక్కాణించి యున్నారు.

ఆర్యశిల్పఋషి శ్రేష్ఠుడును, ప్రఖ్యాత గోళశాస్త్రవేత్తయు సూర్యసిద్ధాంతకర్తయు అగు మయుడు ప్రతిపాదించిన ఈ వైజ్ఞానిక పద్ధతి ననుసరించి గృహాది నిర్మాణములయందు ఆయాదికము సాధించు విధానము ఆంధ్రదేశమునందలి కొన్ని ప్రాంతములయందు ముఖ్యముగా కృష్ణా గోదావరీ మండలములయందు విస్మరింపబడుటకు కారణమేమో దురూహ్యముగా నున్నది. అంతేగాక మయమతమునందలి అనేక విషయములు ఆంధ్ర దేశమునకు అపరిచితములుగా నున్నవి.

కావున ఆంధ్రదేశమునందలి వాస్తుశాస్త్ర కోవిదులు మయబ్రహ్మయొక్క ఈ శిల్ప రహస్యమును గూర్చి పరిశీలించి ఆంధ్రదేశమునందు బహుళప్రచారము చేసి అందలి వైజ్ఞానిక సత్యమును నిరూపింతురు గాక.

## క్షేత్రీకృతము :- కాళిదాసమతము :

ఆంధ్రదేశమునందలి కొన్ని ప్రాంతములయందు ముఖ్యముగా కృష్ణా గోదావరీ మండలముల యందు వాడుకలోనున్న క్షేత్రీకృత సాధనవిధి కాళిదాస కృతమగు కాలామృతమను జ్యోతిష గ్రంథమునందు ప్రతిపాదింపబడినది. ఈ పద్ధతి ననుసరించి గుణించి ప్రకటింపబడిన సువర్గపదములు బహుళ ప్రచారమునందున్నవి. ఈ పద్ధతిని గూర్చి శాస్త్ర ప్రమాణములు గమనింపుడు.

1."ఆయామేనవిశాలమేవగుణయేత్క్షేత్రీకృతంయత్పదం"(కాలామృతము)

2. "విస్తారేణహతం దైర్ఘ్యం విభజే దష్టభిస్తతః"

(విశ్వకర్మ ప్రకాశిక)

3. "విస్తారేణహతం దైర్ఘ్యం విభజేదష్టభిస్తతః
యచ్ఛేషం సంభవేదాయా ధ్వజాద్యాస్తేస్యురష్టధా" (సమరాంగణము)

పైనుదహరించిన ప్రమాణముల ననుసరించి పొడవు ఇంటు వెడల్పు = "పదము" అనగా క్షేత్రీకృతముగా గ్రహించి ఆయాదికమును సాధింపవలయునని వివరింపబడియున్నది. ఈ పద్ధతియు శాస్త్రసమ్మతమగు విధానమేనని స్పష్టముగా గమనింపగలము.

**ఇష్టనక్షత్ర పద్ధతి :-**

ఈ పద్ధతి ఆంధ్రప్రాంతమునందు వ్యవహారింపబడుట లేదు. కావున ఈ పద్ధతియొక్క విచార విమర్శనము అప్రస్తుతముగా విడువబడినది.

**పర్యంతమానము :-**

"ఇష్టదీర్ఘంతు యద్వ్యఘ్నం తద్రామైకాంశ సంయుతమ్
ఇష్టయోనేర్గుణైకాంశయుతం పర్యంత ముచ్యతే"

(వాస్తువిద్య)

ఇష్టదీర్ఘమనగా మనము నిర్మింపదలచిన యింటియొక్క పొడవును 2చేత గుణించి ఆ సంఖ్యను మూడు భాగములు చేయవలయును. అందు ఒక భాగమును గ్రహించి ఒకచోట నుంచవలయును. మరల మనకు యే "యోని" అనగా ఆయము కావలయునో ఆ సంఖ్యను మూడు భాగములు చేసి అందొక భాగమును గ్రహింపవలయును. పిమ్మట రెట్టింపబడిన పొడవునందు మనము గ్రహించి యుంచిన రెండు సంఖ్యలను కలుపవలయును. అట్లు కలుపగా సిద్ధించిన సంఖ్యయే పర్యంతమానము.

ఉదాహరణ : నిర్మింపదలచిన యింటియొక్క పొడవు 25 హస్తములని భావింపుడు. 25 ఇంటు 2 = 50 అగుచున్నది. అనగా యింటియొక్క పొడవును రెట్టించిన 50 అయినది. దీనిని మూడుచేత భాగింపగా 16 2/3 అయినది. మరల మనకు ఇష్టమగు ఆయము వృషభాయము అనకొనుడు. వృషభాయపు సంఖ్య 5 అగును. 5ను మూడుచేత భాగింపగా 1 2/3 లబ్దము వచ్చినది. పిమ్మట

రెట్టించిన పొడవు =50

రెట్టించిన పొడవునందలి 1/3 = 16 2/3

వృషభాయపు సంఖ్యనందు 1/3 = 1 2/3

మొత్తము = 68 1/3 = పర్యంతమానము.

ఈ పద్ధతి ననుసరించి 68 1/3 పిండముగా గ్రహిచి ఆయాదికమును సాధింపవలయును. ఈ పద్ధతి ఆచారమునందు లేకున్నను ఆయాది సాధనకు "భిన్నపదము" శాస్త్రసమ్మతము కాదనువారికి ఈ పర్యంతమానము స్పష్టమగు జవాబుగా నుండగలదు. "వాస్తువిద్య" ప్రతిపాదితమగు ఈ పర్యంతమానము శాస్త్రీయ పద్ధతి

యనుటలో సందేహము లేదుగదా!

కావున ప్రాజ్ఞుడగు స్థపతి ఆయా దేశకాలానుగుణ్యమగు పద్ధతిని గ్రహించి ఆయాధికమును సాధించవలయును. ముఖ్యముగా మయమతమును గాని కాళిదాసమతమును గాని అనుసరించుట ఆంధ్రదేశ ప్రజలకు శుభప్రదమగుచున్నది.



# సూత్ర లక్షణము

"ప్రమాణ సూత్రమిత్యుక్తం ప్రమాణైః నిశ్చితం హియత్
తద్బహిః పరితో భాగే సూత్రం పర్యంతమిష్యతే
పదవిన్యాససూత్రం హి విన్యాసః సూత్రమిష్యతే
గృహాణాం దక్షిణే గర్భః తత్పార్శ్వే సూత్రపాతనమ్
(మయమతం 6 అధ్యాయం 32 పుట)

సూత్రమనగా త్రాడు. ప్రమాణసూత్ర మనగా యిండ్లు మొదలగు నిర్మాణ కార్యములందు కొలత నిమిత్తము ఉపయోగించు త్రాడు అని అర్థము. ఈ సూత్రములు మూడు రకములు గలవు.

1. ప్రమాణ సూత్రము : అనగా గృహనిర్మాణ స్థలము యొక్క పొడవు, వెడల్పులను కొలుచుటకు ఉపయోగించు త్రాడు

2. పర్యంత సూత్రము : అనగా గృహనిర్మాణస్థలము యొక్క పరిహద్దుల చుట్టును పట్టి కొలిచిన సూత్రము.

3. పద విన్యాససూత్రము : అనగా చతుష్షష్టి, ఏకాశీతి, శతపదాది వాస్తుపద విన్యాసము నందు వినియోగించు సూత్రము.

ఈ సూత్రవిన్యాస విధి యెట్లు ప్రారంభింపవలయును? అనగా యెక్కడనుండి యెంతవరకు సూత్రము పట్టవలయును? అను విషయములు వివరింపబడ వలసియున్నది. ఈ సూత్రప్రసార పద్ధతి రెండు విధములుగా ఆచారమునందున్నది.

మొదటి పద్ధతి : గృహాది నిర్మాణములయందు భిత్తిమధ్యము నుండి సూత్రము బట్టుట మొదటి పద్ధతి. అనగా ఒకగోడ మధ్యనుండి రెండవ గోడ మధ్యవరకు సూత్రము బట్టి ఆ కొలతను ఆయాది సాధన నిమిత్తము స్వీకరించుట. కాబట్టి ఆయాది సాధనయందు

గృహ పిండమును రూపొందించు నిమిత్తము యింటియొక్క గర్భగృహము వందలి పాదవు వెడల్పుల యొక్క కడగోడల మధ్యకు వరండాలతో సహా మొత్తము గృహనిర్మాణస్థలమును కంతకు ఆయాది వర్గ సాధన చేయువారు పాదవు వెడల్పులలో కడగోడల మధ్యకు సూత్రమును బట్టి కొలువవలయును. ఇందు నిమిత్తము శాస్త్ర వచనములను గమనింపుదు -

ఈ భిత్తి మధ్యము గ్రహించు పద్ధతి శ్రేష్టమని మయుడు, విశ్వకర్మ, పరాశరుడు, మండన సూత్రధారుడు మొదలగు శిల్పశాస్త్రవేత్తలు తమ తమ గ్రంథములయందు వివరించి యుండిరి.

*1. "మధ్యేప్రోక్తం వాస్తుగేహంఘ్రికానాం"*

*(మయమతం 27 అధ్యాయం 102 పుట)*

*2. "భిత్యంతరస్య మానేన మానయేత్సర్వధామమ" (శిల్పరత్నం)*

*3. "పాషేణ పూర్ణగేహాని భిత్తిర్మధ్యేతు ఇష్టికా" (వాస్తురత్నాకరము)*

*4. "కాష్టపాషాణ యోర్బాహ్యా మిష్టికాయాంతదర్ధకమ్ (పరాశర సంహిత)*

*5. పాషాణే సర్వతో బాహ్యామిష్టికాయాంతదర్ధకమ్" (బృహద్వాస్తుమాల)*

*6. "గృహగత శుభమానం పాద మధ్యంచ భిత్తేః" (పూర్వకారిక)*

ఈ విధముగా సంస్కృతమునందున్న యించుమించు అన్ని గ్రంథములయందు భిత్తి మధ్యము నుండియే సూత్రమును పట్టవలయునని ముక్త కంఠముతో చెప్పబడియున్నది. అంతేగాక ఆచరణ రీత్యా కూడా ఈ పద్ధతి దోషరహితము శుభప్రదము అనుట నిర్వివాదమగు పద్ధతి. ఎందుచేతనందురా?

గోడమందము 18 అంగుళములనుకొనుడు. అందు భిత్తి మధ్యబిందువు నుండి 9 అంగుళములు పిండము నిమిత్తము గ్రహింతుము. దీనినే ఆధునిక యింజనీర్లు "సెంట్రల్" మార్కుగా గ్రహింతురు. ఈ పద్ధతిలో సూత్రమును కొలిచి పిండమును

సాధించినచో ఆ భవనము యెన్ని అంతస్తులు గలదిగా నిర్మించినను గర్భప్రమాణము ఒకే విధముగా నుండును. అంతేగాక తాపీ పనివారు మట్టితో గాని, సిమెంటుతో గాని గోడలు కట్టునప్పుడు పిండము నందు సాధించిన అంగుళాదులను సంరక్షించుటకు శ్రమపడవలసిన పనిలేదు. సుప్రసిద్ధులగు పండితులందరు ఈ భిత్తి మధ్యమునే గ్రహించి క్షేత్రీకృతమును సాధించుచున్నారు.

రెండవ పద్ధతి : రెండు గోడలకు బయటకు విడిచిపెట్టి ఉరిలోపు కొలతనే గ్రహించి ఆ కొలతల చేత పిండమును సాధించి ఆ పిండము ననుసరించి ఆయాది వర్గగణితము చేయుట రెండవ పద్ధతి. ఈ పద్ధతి ఆంధ్రదేశమునందు ప్రచారమునందున్న "శ్రీకృష్ణవాస్తు" ప్రతిపాదించినది. ఈ గ్రంథము గూడ సంస్కృత గ్రంథములయందలి అనేక విషయములను క్రోడీకరించి తెలుగువారికి అందించింది. ఈ సూత్ర విషయమున మాత్రము ప్రత్యేక పద్ధతి అనుసరించినది. దీనికి కారణము ఈ మధ్యనే అనగా 1950 సంవత్సరములో వెలుగు చూచిన అపరాజిత పృచ్ఛయందలి ప్రమాణము కావచ్చును. ఈ పద్ధతికి శాస్త్ర ప్రమాణము.

1. "భిత్తికి లోనగునిండ్లకు" (శ్రీకృష్ణవాస్తు)

2. "గృహేభిత్తిస్తుబాహ్యాత:" (అపరాజిత పృచ్ఛ 125 పుట)

పైనుదహరించిన శాస్త్రవచనముల ననుసరించి ఉరిలోపు కొలతలు గ్రహించి పిండమును సాధించి ఆ పిండమును ప్రాతిపదికగా ఆయాది వర్గమును గణించుట ఆంధ్ర దేశమున, కొన్ని ప్రాంతములయందు మాత్రమే వ్యవహారమునందున్నది. అయినను ఈ పద్ధతియు శాస్త్ర సమ్మతమే యని చెప్పవచ్చును.

కాని ఈ పద్ధతియందు కొంత అపవాదమున్నది. మనము క్షేత్రీకృతము చేయునప్పుడు అంగుళాదికమును గూడ లెక్కింతుము. ప్రాక్టికలుగా మట్టితోగాని, సిమెంటుతోగాని గోడలు కట్టునప్పుడు ఈ అంగుళమును కాపాడుకొనుట యెంత కష్టమో అనుభవజ్ఞులైన స్థపతులకు తెలియకపోదు. మరియు అంతస్తులు నిర్మించునప్పుడు క్రింది గర్భము కంటె పై అంతస్తు గర్భము యించుమించు రెండు లేక మూడంగుళములు హెచ్చగుచున్నది.

అయినను ఈ రెండు పద్ధతులు శాస్త్రీయములే అవి ఋజువగుటచేత వివాదమునకు తావీయక యేయే ప్రాంతములయందు యేయే పద్ధతులు ఆచారమందున్నవో ఆయా

పద్ధతుల నవలంబింపవలయును. దేశకాలముల గమనింపక తప్పదు గదా?

## గర్భగృహమునకు మాత్రమే పిండసాధన :

"పిండము" లేక "పదము" కేవలము శాలాభాగమునకు మాత్రమే సాధింపవలయునమట ఇందుకు శాస్త్ర ప్రమాణము-

"అళింద, నిర్వ్యూహ, వినిర్గమాద్యాః చ్ఛతుర్దశం యే గృహాంభూషణాయ ఆయాదికం, తేషు, నచింతనీయం యతోనతేవాస్తు పరిగ్రహాస్స్యుః"

(వాస్తురత్నాకరము 59పుట)

అనగా వరండాలు, పోర్టికో మొదలగు గృహాలంకరణ నిమిత్తము చేయు నిర్మాణములయందు ఆయాదికమును చూడనవసరము లేదని భావము. ఆంధ్రదేశమునందు గర్భగృహమునకు మాత్రమే ఆయాదికమును సాధించు పద్ధతి పరంపరాగతముగా వచ్చు చున్నది.

## పర్యాయము - విశేషవిధి :

కాని అక్కడక్కడ కొందరు పండితులు "పర్యాయము" అను పేరుతో అళింద సహితముగా ఆయాదికమును సాధించుచున్నారు. అట్టి సందర్భములయందు ప్రత్యేకముగా గర్భమునకు ఆయాదికమును సాధించి, పిమ్మట పర్యాయమును సాధించుటలో దోషము లేదు. ఒక విధముగా అదియు శాస్త్రసమ్మతమగుచున్నది. ఏమందురా మయుడు, మానసారుడు మొదలగు మహర్షులు శాలాస్వరూప నిర్ణయమునందు "సమస్త గృహమును" (అనగా అళింద సహితము) ఒక "యూనిట్"గా గ్రహించి గృహస్వరూపమును వర్ణించి యున్నారు. కాబట్టి పర్యాయము కూడ శాస్త్ర విహితము కాగలదు. ఈ పర్యాయగణితము విశేషవిధిగా మిక్కిలి శుభప్రదమైనదిగా గ్రహింపవచ్చును. కాని ఈ విశేషవిధి సామాన్య గృహనిర్మాణముల యందు వినియోగింపరాదు.

# శంకుస్థాపన అనగానేమి?

మనము "శంకుస్థాపన" అను పేరుతో చేయు వాస్తుకర్మకు మయుడు, విశ్వకర్మ "ప్రథమేష్టికాన్యాసము" అను పేరుతో వివరించిరి. ప్రథమేష్టికాన్యాసము అనగా గృహనిర్మాణ కార్యమునందు మొదటి ఇటుకను స్థాపించుట. ఈ ప్రథమేష్టికాన్యాసము రెండు భాగములుగా విభజింపబడినది. అందు మొదటిది "గర్భన్యాసము" రెండవది "ప్రథమేష్టికాన్యాసము".

ముందుగా గర్భన్యాసము చేయవలయును. ఈ గర్భన్యాసమును గూర్చి మయుని అభిప్రాయము గమనింపుడు.

"తైతిలానాం ద్విజాతీనాం వర్ణానాం హర్మ్యకే గృహే
గర్భన్యాసవిధి స్సమ్యక్ సంక్షేపాత్ వక్ష్యతేధునా
సర్వద్రవ్యై స్సుసంపన్నం గర్భం తత్సంపదాం పదమ్
ద్రవ్యహీన మసంపన్నం గర్భం సర్వవిపత్కరమ్
తస్మాత్ సర్వప్రయత్నేన గర్భం సమ్యక్ వినిక్షిపేద్
గృహిణీ గర్భిణీభర్తు: యదిగర్భం న నిక్షిపేత్"

**(మయమతం 12 అధ్యాం 129 పుట)**

పై ప్రమాణము ననుసరించి సమస్త జాతులవారికి గృహాది సమస్త నిర్మాణకర్మల యందు గర్భన్యాసము సర్వసంపత్కరమైనదిగా వివరింపబడినది. గర్భన్యాసము చేయని నిర్మాణము శుభప్రదము కాదు.

"సగర్భం సర్వసంపత్త్యై విగర్భం సర్వనాశకమ్"

అనికూడ మయుడు గర్భన్యాసమును గూర్చి నొక్కిచెప్పి యున్నాడు. ఈ గర్భస్థాపన రాగిపాత్రయందుంచి చేయవలయునని మయుని మతము.

"ధాన్యోపరినిధాతవ్యం తామ్రభాజన మభ్రమమ్"

అనగా గర్తమునందు కొద్దిపాటి ధాన్యమును ఉంచి ఆపైన తామ్రపాత్రము నుంచవలయును. ఆ పిమ్మట అందుంచవలసిన ద్రవ్యములన్నియు ఉంచి ఆ పిమ్మట ప్రథమేష్టికాన్యాసము చేయవలయును.

ఈనాడు శంకుస్థాపన అనుపేరుతో మనము చేయు నవధాన్యములు లోహాదులు రత్నాదికములన్నియు ఆ రాగిపాత్రయందుంచి ఆ పాత్రపైన ప్రథమేష్టికాన్యాసము చేయవలయునని మయుడు వక్కాణించి యున్నాడు. గమనింపుడు.

ప్రథమేష్టికాన్యాసము :

"మృత్కంద ధాన్యసల్లోహ ధాతురత్నౌషధైస్సహ
యద్యస్థానంతు గర్భస్య తత్రస్థా ప్రథమేష్టికా
గంధద్రవ్యైశ్చ బీజైశ్చ విధేయాప్రథమేష్టికా
శైలేశిలామయీ ప్రోక్తా చైష్టకే చేష్టకాశ్శుభా:"

**(మయమతం 12వ అధ్యాయం 156పుట)**

అనగా పంచమృత్తికలు, పంచమూలములు, పంచలోహములు, సప్తధాతువులు, నవరత్నములు, ఓషధులు పైనుదహరించిన రాగిపాత్రయందుంచి గర్భస్థాపన చేయవలయును. అనగా పైన చెప్పబడిన సమస్త ద్రవ్యములతో నిండిన రాగిపాత్రకే గర్భమని పేరు. అట్టి గర్భము యెక్కడ స్థాపింపబడినదో అక్కడనే సుగంధద్రవ్యములతోను నవధాన్యములతోను ప్రథమేష్టికాన్యాసము చేయవలయును.

మయుడు ఈ ప్రథమేష్టికా స్వరూపమును కూడ అసందిగ్ధముగా రాతితో నిర్మించు కట్టడములకు రాతితో చేయబడినదే ప్రథమేష్టికగాను ఇటుకతో నిర్మించు కట్టడములకు ఇటుకనే ప్రథమేష్టికగాను స్వీకరింపవలయునని స్పష్టపరచియున్నాడు. ఈ ప్రథమేష్టికాస్థాపన గృహమునందేస్థానమున చేయవలయునో మయుడు వివరించిన విధమున గమనింపవలయును.

## శంకుస్థాపన అనగా ప్రథమేష్టికాన్యాసము ఎక్కడ చేయవలయును?

ఈ గర్భస్థాపన వేత్రభిత్తియందు అనగా ముఖద్వారము గల గోడయందు

చేయవలయునని మయుని వచనము. ఆయా దిక్కులయందు చేయునప్పుడు తూర్పున మహేంద్రపదమునందును, దక్షిణమున గృహాక్షత పదమునందును, పడమర పుష్పదంత పదమునందును, ఉత్తరమున భల్లాటపదమునందును గర్భస్థాపన చేయవలయును. ఈ పద్ధతి యే కారణముచేతనో మన ఆంధ్రదేశమున ఆచారమునందు లేదు. కొంచెము క్లిష్టమయిన విధి.

విశ్వకర్మ ఈశాన్యమునందు మాత్రమే ప్రథమేష్టికాన్యాసము చేయవలయునని చెప్పియున్నాడు. ఆంధ్ర ప్రాంతమున ఈ పద్ధతియే బహుళ ప్రచారమునందున్నది. ఏ ముఖ ద్వారముగల యింటికైనను గృహగర్భమునకు ఈశాన్య మూలయందు అనగా తూర్పు ఉత్తరపు గోడలు కలియు మూలయందు శంకుస్థాపన అను ప్రథమేష్టికాన్యాసము చేయుట ఆంధ్రదేశమునందు ఆచారసిద్ధమగు కార్యము.

"సమ్యక్ తప్తం వక్రహీనం కకశం కుంకుమాన్వితమ్
సూత్రప్రసారే కలితే వాస్తు నిర్మాణభూమిషు
ఐశాన్యాం విన్యశేత్ ప్రాజ్ఞః కకశం తం ప్రసన్నధీః
అధోభిత్త్యాదికం కృత్వా దృఢీ కుర్యాచ్చ తద్బుధః"
(విశ్వకర్మ వాస్తుశాస్త్రము 44పుట)

అనగా మనము స్థిరపరచుకొనిన యింటియొక్క ప్లానునందలి గర్భగృహమునందలి ఈశాన్యమూల యందుగల గోడకు క్రిందిభాగమున బాగుగా ఎరుపురంగు కలిగి కాలినట్టిన్ని వంకరలు లేనట్టిన్ని పసుపు కుంకుమలతో అలంకరించి పూజించినట్టిన్ని ప్రథమేష్టికను మంగళతూర్య ధ్వనులమధ్య యజమానుడు ప్రతిష్ఠింపవలయును అని భావము.

కాబట్టి పైనుదహరించిన మయ విశ్వకర్మల శిల్పహృదయమును బాగుగా అవగతము చేసుకొని సర్వజన సులభమగునట్టియు ఆంధ్రదేశమున అనూచానముగా వచ్చుచున్న ఆచార ప్రసిద్ధమగునట్టియు విశ్వకర్మమతము ననుసరించి ఈశాన్యమునందు గర్భస్థాపన ఆపైన ప్రథమేష్టికాన్యాసము చేయవలయును. ఆ పిమ్మట అధిష్ఠానము అనగా ఫౌండేషను కట్టుటకు ప్రారంభింపవలయును.

గమనిక :- ఈ గర్భన్యాస, ప్రథమేష్టికాన్యాసములకే కొందరు శంకుస్థాపనయనియు, స్తంభప్రతిష్ఠయనియు, శిలాన్యాసమనియు పర్యాయ పదములుగా తమ తమ గ్రంథములయందు ఉపయోగించి యున్నారు.

## ఏదిశ నుండి గోడలు కట్టుట ప్రారంభింపవలయును?

ఈ విషయమును గూర్చి విశ్వప్రకాశిక 69వ పేజీ యందిట్లున్నది.

"ఆదౌ పూర్వోత్తరా పంక్తిః పశ్చాద్దక్షిణ పశ్చిమే"

(విశ్వప్రకాశిక 69 పేజీ)

అనగా ముందుగా మనము ప్రథమేష్టికాన్యాసము చేసిన చోటునుండి పని ప్రారంభించి తూర్పు ఉత్తరపు గోడలు నిర్మింపవలయును. తరువాత దక్షిణ పడమర గోడలు కట్ట వలయును అని భావము. ఇట్టి సర్వసంపత్కరమగు ప్రథమేష్టికాన్యాసమును గూర్చి మయుడు చెప్పిన సమయశుద్ధి గమనింపవలసి యున్నది

"సుముహూర్తే సులగ్నేచ హోరా కరణసంయుతే
రాత్రౌ గర్భ మహన్యేవ స్థాపయే చ్చతురిష్టకమ్"

(మయమతం)

అనగా పంచాంగ శుద్ధిగల సుముహూర్తమున రాత్రియందు గర్భన్యాసము ఆపైన ప్రథమేష్టికాన్యాసము చేయవలయునని భావము. మరియు విశ్వకర్మ ప్రకాశికయందు గృహారంభ సమయమును గూర్చి 58వ పుటలో -

"మధ్యాహ్నేతు కృతంవాస్తు కీర్తి విత్త వినాశనమ్
మహానిశాస్వపి తథా సంధ్యయోర్నైవకారయేత్"

అని యున్నది. అనగా మధ్యాహ్న కాలము, అర్ధరాత్రి, ఉభయసంధ్యలు గృహారంభమునకు తగవని భావము. కాబట్టి విశ్వకర్మ మతమునందు గృహారంభమునకు రాత్రికాలము నిషేధింపబడలేదు.

కాని ఆంధ్రదేశమున రాత్రి 12 గం॥ల లోపున గృహారంభము చేయు ఆచారము లేదు. పంచాంగకర్తలు రాత్రి పన్నెండు గంటలు దాటిన పిమ్మట పగలు పన్నెండు గంటల లోపున గృహారంభ ముహూర్తములుంచుచున్నారు. ఇట్లు ముహూర్తములుంచుట యెంతయో సమంజసము. కాని కొందరు రాత్రి 12 గంటలు దాటిన పిమ్మట గల ముహూర్తములు గృహారంభమునకు తగినవి కావనుట శాస్త్రసమ్మతము కానేరదు.

మరియొక ముఖ్య గమనిక :

"గృహిణీ గర్భిణీ భర్తుః యదిగర్భం న నిక్షిపేత్"

అన్న మయుని వాక్యము ననుసరించి భార్య గర్భతిగా నుండగా గృహారంభము చేయుట తగనిపని. కాని భార్యకు మూడు మాసముల గర్భము నిండులోపల గృహారంభము చేయవచ్చునని కొందరు పెద్దలు చెప్పుదురు. మూడు మాసములు దాటినచో గృహారంభము చేయరాదు.

# వేదికా నిర్మాణము

గృహవేదిక అనగా "ఫౌండేషను" అనే నిర్మాణ విశేషము. ఈ గృహవేదిక మిక్కిలి దృఢముగాను పరిసరములకు అనువగు యెత్తు గలదిగాను నిర్మించవలయును. వీధికి ఉచితమగు రీతిలో యెత్తును నిర్ణయించుకొన వలయును. ఈ వేదికా నిర్మాణమువందే యింటియొక్క సౌభాగ్యము, సౌందర్యము, దృఢత్వము మొదలగు సాంకేతిక విషయములన్నియు ఆధారపడియుండును. కాబట్టి నిపుణుడగు స్థపతి ఆయా నిర్మాణస్థలమునకు ఉచితమగునంత లోతు గర్తమును తీయించి శల్యదోషాదికము లేకుండ పరిష్కరించి నిర్ణయించుకొనిన ప్లానునకు అనువగుచోట ప్రథమేష్టికాన్యాసము చేయించిన పిమ్మట ఫౌండేషను గోడలు కట్టుటకు ప్రయత్నించవలయును.

వేదికా నిర్మాణము పూర్తియైన పిమ్మట, శిరోభాగమున "స్పిరిట్ లెవెల్" అనగా లెవెల్ మట్టము అను సాధనముతో అన్ని దిక్కులు సమతలముగా సవరించిన పిమ్మట మనము నిర్ణయించుకొనిన ప్లానుయొక్క కొలతలకు అనువుగా గోడలను పోల్చి పున:పరిశీలన చేసి పిమ్మట గోడలు కట్టుటకు ప్రారంభింపవలయును.

స్థపతి పై మదహరించిన గోడలయొక్క "పోలిక" యందే తగు జాగ్రత్త వహించవలయును. శాలాభాగమునందు మనము నిర్ణయించుకొనిన కొలతలకు సరిగా గదులు అమరినవా? లేదా?యని పరిశీలింపవలయును. నాలుగు మూలలయందు మూలమట్టమునకు సరిపడుయుండునట్లు సరిచేయవలెను. అట్లు నాలుగు మూలలు మూలమట్టమునకు సరిపడనిచో "విషమకర్ణము" అను దోషము సంభవించును. ఈ దోషము యజమానునకే గాక స్థపతి అనగా తాపీ మేస్త్రికి వడ్రంగపు మేస్త్రికి కూడ అరిష్టము కలుగజేయునని శాస్త్రకారుల యభిప్రాయము. కాబట్టి వేదికా నిర్మాణము మిక్కిలి శ్రద్ధతో స్థపతి పర్యవేక్షింపవలయును. వేదికయే గృహసౌభాగ్యమునకు మూలాధారము గదా?

**చయవిధి :** చయవిధి అనగా తాపీపని. సందర్భానుసారముగా ఈ తాపీపని యందలి గుణదోషములను పరిశీలింపవలసి యున్నది. గృహశోభయంతయు తాపీపనివారి విజ్ఞతపైనే ఎక్కువగా ఆధారపడియుండును. కాబట్టి గృహయజమానియు తగిన విజ్ఞాన సంపదగల

వారినే ఆయా పనులయందు నియమింపవలసి యుండును.

## తాపీపనియందు గమనింపవలసిన కొన్ని దోషములు :

1. తూర్పుగోడ వెలుపలకు ఒరిగియున్నచో యజమాని సివిలు లేక క్రిమినలు కేసులయందు తగుల్కొని యిబ్బందులకు గురియగును. లేదా యేదో విధమగు రాజదండనకు గురియగును.

2. ఇంటియొక్క దక్షిణపు గోడ వెలుపలకు ఒరిగియున్నచో గృహయజమానుడు వ్యాధి గ్రస్తుడై పీడింపబడును. అట్టి గృహమందుండు వారికి అపమృత్యు భయములు గలుగుచుండును.

3. ఇంటియొక్క పడమర గోడ వెలుపలకు ఒరిగియున్నచో మిక్కిలి ధనహానియు, దొంగల వలన భయమును కలుగును.

4. ఇంటియొక్క ఉత్తరపు గోడ వెలుపలకు ఒరిగియున్నచో అది యజమానికిని, తాపీపని వానికిని గూడ అనేక కష్టనష్టములను కలుగజేయును. అంతేగాక గృహయజమానునకు మానసిక వికారమును కలుగజేయును.

ఇంటిగోడలు వెలుపలకు యెట్లు వంగియుండరాదో అట్లే లోపలకు కూడ వంగి యుండరాదు. గోడలు వెలుపలకు వంగియుండిన యేయే దోషములు సంభవించునో అట్లే లోపలకు వంగియున్నను ఆయా దోషములే సంభవించునని వివరింపబడి యున్నది.

ఇంటియొక్క దిశాభాగముల యందేగాక కోణముల యందుకూడ వెలుపలకు ఏ మాత్రమును ఒరిగి యుండరాదు. మూలలయందు గల రెండు దిశాభాగముల యందు గోడ ఒడంబడునకు పరిపడియుండ వలయును. అట్లు లేనిచో ఈ క్రింది ఫలితములు కలుగునని సమరాంగణ సూత్రధారుడు వివరించియున్నాడు.

1. ఇంటికి ఆగ్నేయమూలయందు దక్షిణముగా గాని, తూర్పుగా గాని, ఒరిగియుండినచో గృహయజమానునకు అపమృత్యుభయము కలుగును. లేదా దినదినము ప్రాణభయముతో కంపించి పోవుచుండును.

2. నైఋతి మూలయందు పడమరగాగాని, దక్షిణముగా గాని వెలుపలకు ఒరిగి యుండినచో యజమాని భార్యకు కీడు కలిగించును. కలహముల వలన మానసిక

శాంతి నశించును.

3. వాయువ్య మూల వెలుపలకు ఒరిగియుండినచో పశునష్టము కలుగును. పాడిపంటలు అక్కరకు రావు. సంతానమునకు వ్యాధిపీడ కలుగును.

4. ఈశాన్య మూలయందు వెలుపలకు ఒరిగియుండినచో సంతానమునకు అరిష్టములును, ఈతిబాధలును కలుగును.

ఇంటిగర్భము యొక్క నాలుగు గోడలు సమమగు ఎత్తు గలిగియుండ వలయును. మరియు నాలుగు మూలలు సమముగ నుండవలయును. అనగా పాడవు వెడల్పులలో కోణముల యందు పెంచి కట్టరాదు. ఈ విధముగా నేర్పరియైన స్థపతి నిర్మాణ దోషములు వాటిల్లకుండ గృహనిర్మాణము చేయవలయును. అట్లు చేయుట కర్తకు, భర్తకు శుభప్రదము. ఈ విషయమున యింకను వివరములు అభిలషించువారు సమరాంగణము గృహదోష నిరూపణమను ప్రకరణమునందు 159,160 పేజీలయందు విపులముగా చూడగలరు.



# గృహగర్భము యొక్క ఎత్తు యెంత?

గర్భగృహము యొక్క గోడ యెంత యెత్తు కట్టవలయునను సందేహము కలుగుట సహజము. ఎందుచేతననగా ఆయా నిర్మాణ విశేషములను బట్టి యెత్తు యెంత యుండవలయునో నిర్ణయించుకొన వలసియున్నది. అంతేగాని అన్ని కట్టడములకు ఒకేవిధముగా యెత్తును నిర్ణయింపరాదు. ఈ యెత్తును నిర్ణయించునప్పుడు మానవ నివాసములకు వేరుగాను, పశువుల కొట్టములు, ధాన్యపుగాదులు, మిల్లులు, సినీమా హాలులు, విద్యాలయములు మొదలగువాటికి వేర్వేరు విధములుగాను నిర్ణయింపవలసి యున్నది.

నివాస గృహములకు : ఆంధ్రదేశమువందలి వాస్తుశాస్త్రవేత్తలు పరంపరాగతముగా యింటియొక్క వెడల్పు యెంతయుండునో అంతయెత్తు గర్భగృహము యొక్క గోడను నిర్మింతురు. దీనికి శాస్త్ర ప్రమాణము -

"క్షితతలాద్యావచ్ఛ పట్టోర్ధ్వకమ్" (వాస్తురత్నాకరమ్)

అనగా గృహభూమి నుండి (నేల) దూలముయొక్క పై యెత్తునకు గృహవిస్తారము అనగా యింటియొక్క వెడల్పు సరిపడి యుండవలయును అని అర్థము. కావున యింటి యొక్క గర్భగృహము యెంత వెడల్పు గలిగియుండునో అంత ఎత్తునకు దూలములపై యెత్తునకు సమముగా నుండవలయునని తాత్పర్యము. కాని కొందరు స్థపతులు గృహవిస్తారమును దూలముల క్రింది మాత్రమునకు సరిపెట్టుచున్నారు. ఇదియు శాస్త్రసమ్మతమే. ఎందుచేతనందురా?

"విస్తార షోడశాంశః సచతుర్హస్తో భవేత్ గృహోచ్ఛ్రాయః
ద్వాదశ భాగేనోనో భూమౌ, భూమౌ సమస్తానామ్"

(బృహత్సంహిత)

అనగా గృహవిస్తారము యెంతయున్నదో అందలి పదహారవ భాగము విస్తారమునందు కలిపి ఆ ప్రమాణమునకు సమముగా గర్భగృహము యెత్తు నిర్మింపవలయును. అనగా దూలముల యొక్క అడుగునకు గృహవిస్తారము సరి పెట్టినప్పుడు దూలముయొక్క యెత్తు

యించుమించు పదహారవ భాగమునకు సరిపడును. కావున గృహవిస్తారమును దూలముల క్రింది సూత్రమునకు సరిజేయుట శాస్త్రదూష్యము కాదు. అంతస్తులు నిర్మించునప్పుడు గృహ విస్తారమునందు పన్నెండవ భాగము తగ్గించుచూ అంతస్తులు నిర్మించవలయును.

మయుడు గృహగర్భము యొక్క యెత్తును గూర్చి యింకను స్పష్టముగా వివరించి యున్నాడు. గమనింపుడు-

"విస్తార సమమత్సేధం, సపాదం సార్ధమేవవా
త్రిపాదం ద్విగుణంచైవ, ఉత్సేధం పంచధామతమ్"

**(మయమతం *26* అధ్యాయం *3* పుట)**

మయుని అభిప్రాయం ననుసరించి అయిదు విధములైన యెత్తు సాధింపవచ్చును.

1. గృహవిస్తారము = గర్భగృహము యెత్తు = సమము
2. గృహవిస్తారము + 1/4 = గర్భగృహము యెత్తు = సపాదము
3. గృహవిస్తారము+ 1/2 = గర్భగృహము యెత్తు = సార్థము
4. గృహవిస్తారము+ 3/4 = గర్భగృహము యెత్తు = త్రిపాదము
5. గృహవిస్తారము×2 = గర్భగృహము యెత్తు = ద్విగుణము

పై వివరణము ననుసరించి గృహవిస్తారము యెంతగలదో అంతయెత్తు గర్భగృహమును నిర్మించుట సాధారణ నియమము. అట్లుగానిచో ఆయా నిర్మాణ విశేషము ననుసరించి స్థపతి యొక్క బుద్ధికుశలత నుపయోగించి విశేషవిధి చేత గృహవిస్తారమునందు 1/4 వంతుగాని 1/2 రెండు వంతులు గాని 3/4 మూడు వంతులు గాని లేదా గృహవిస్తారమునకు రెట్టింపుగాని యింటియొక్క యెత్తును నిర్మించవలయునని మయుని అభిప్రాయము.

ఈ పైనుదహరించిన శాస్త్ర ప్రమాణముల ననుసరించి యింటియొక్క యెత్తు గృహవిస్తారము కంటె అధికముగా నుండవచ్చును గాని యేమాత్రమును తగ్గియుండరాదని వాస్తుశాస్త్రవేత్తలు ముక్తకంఠముతో చెప్పియుండిరి.

"తుంగహీనంచ చిపిటమ్ వ్యంగ్యంచానర్థ దర్శనమ్"

అను ప్రమాణము ననుసరించి గృహవిస్తారము కంటె గర్భగృహము యొక్క యెత్తు తగ్గియున్నచో "చిపిట"మను దోషము సంభవించునని భావము. కావున గృహవిస్తారము

కంటె యెత్తు యేమాత్రము తగ్గియుండరాదు. మనుష్య నివాసములకు మాత్రమే ఈ నియమము చెల్లును.

*గమనిక :* పశువులశాలకు ఈ నియమము పాటింపరాదు. అట్లే వ్యవసాయ సంబంధమగు శాలలకు కూడ ఈ నియమము వర్తింప చేయరాదు. ఆయా నిర్మాణ విశేషములకు యోగ్యమయిన రీతిలో యెత్తు తగ్గించియు నిర్మించవలయును.

అట్లే సినీమాహాలులు, రైసుమిల్లులు మొదలగువాటికి వాటివాటి ప్రత్యేక నియమములు గమనించి ఆయా నిర్మాణములకు గల సాంకేతిక పరిజ్ఞానముతో యెత్తును నిర్ణయించుకొన వలయును.



# "ఛాయా" నిర్మాణవిధులు

"ఛాయా" అనగా యింటిపై కప్పు అని భావం. ఈ ఛాయానిర్మాణమునందు దూలములు ముఖ్యపాత్ర వహించుచున్నవి. తనాబీలు బాజాలు అనే మందర శ్రేణులు గుర్జులు "వంశము" అని పేరుగల వెనుబద్ద మొదలగువాటి అమరికను గూర్చి మయబ్రహ్మ తన మయమతమునందు చాల విపులముగా వివరించియున్నాడు. మందర శ్రేణులు అమర్చునప్పుడు ఆయాదిశల యందు యే విధముగా సంధింపవలయునో వివరించుచు మయమతమునందు "సంధికర్మ" అను పేరుతో వడ్రంగపు పనివారు తీసుకొన వలసిన జాగ్రత్తలన్నియు సవివరముగా చెప్పియున్నాడు.

**తుల: ఉపతుల :** "తుల" అనగా దూలము. "ఉపతుల" అనగా తనాబీ. వంశము అనగా వెన్నువాసము. "భారతుల" అనగా గోడకు బదులుగా వేయు తనాబీ. ఈ తనాబీపైన దూలములు వేయుదురు. లుప అనగా వాసము. "కోటి" అనగా మూలవాసములు. "గుజి" అనగా గుర్జి. "శ్రేణి" అనగా బాటు లేక మందర శ్రేణి పాదము. అనగా స్థంభము హస్తము అనగా శ్రేణి.

**దూలముల సంఖ్య :**

*"హస్తస్థంభ తులాదికావ్ వరగృహే యుంజ్యాద యుగ్మంయథా*
*యుగ్మాయుగ్మక సంఖ్యయా సురగృహే యుంజీతహస్తాదికావ్"*

**(మయమతం 26 అధ్యాయం 57 పుట)**

ఇంటి పైకప్పు నిర్మించుటలో యింటి మొత్తమును ఒక "యూనిట్"గా పరిగణింప వలయును. దూలములు, బాజాలు, గుర్జులు, గుమ్మములు, కిటికీలు, స్తంభములు మొదలగు ద్రవ్యములు మానవ గృహములయందు వేటికవి సమసంఖ్యగా నుండవలయును. దేవాలయములయందు బేసిసంఖ్యగా గాని సమసంఖ్యగా గాని యుండవచ్చును. ఈ విషయమును గూర్చి మరియొక శాస్త్ర ప్రమాణము నుదహరింపుదు.

"గృహేకాష్టం సమం(శ్రేష్ట, మళిందం విషమం శుభమ్"

ఇందు కాష్ఠమనగా దూలము అనియు అళిందమనగా దూలమునకు దూలమునకు మధ్యగల ఖాళీయనియు గ్రహించవలయును. అళిందమనగా వరండా అను అర్థము ఇక్కడ గ్రహింపరాదు. కావున గృహమునందు సమసంఖ్యగా నున్న యెడల దూలమునకు మరియొక దూలమునకు మధ్యగల అళిందములు బేసిసంఖ్య గలవిగా నగును. ఈ పద్ధతి ఆంధ్రదేశము నందలి గృహనిర్మాణ శిల్పులకు వంశపారంపర్యముగా లభించిన విద్యయే. మయబ్రహ్మ వంశీయులకు ఈ నిర్మాణ కుశలత సహజముగానే అలవడినది.

కాని కొందరాధునికులు శాస్త్రవచనమును వక్రీకరించి చెప్పుచు ఏ గదికాగదియందు దూలములు, కిటికీలు, అలమరలు సమసంఖ్యగా నుండవలయునని అట్లే నిర్మింపజేయు చున్నారు. ఇది యెంతయో శాస్త్ర విరుద్ధమగు కార్యము.

## దూలములు వేయుపద్ధతి :

"దక్షిణాపర భాగేతు ద్రవ్యమూలం ప్రశస్యతే
అగ్రమగ్రం తథైవాన్యే తేషాం బంధనముచ్యతే"

**(మయమతం 17 అధ్యాయం 241 పుట)**

అనగా దూలములు, బాజులు, తనాబీలు మొదలగు ద్రవ్యముల యొక్క మూలము అనగా మొదళ్ళు దక్షిణపశ్చిమములకును, చివళ్ళు ఉత్తర తూర్పులకును ఉండునట్లు అమరిక చేయవలయునని మయుని శాసనము. కావున స్థపతులు ఈ విషయమును శ్రద్ధతో గమనింపవలయును.

## దూలముల అమరికలో గల కొన్ని ప్రాంతీయ భేదములు :

దూలములు అమర్చుటకు ముందుగా గర్భగోడల యొక్క ఉపరితలమును అనగా పై భాగమును "స్పిరిట్ లెవెల్" తో సమతలముగా సవరింపజేయ వలయును. అట్లు సవరించిన గోడలపైన దూలములను దక్షిణమునకు గాని, పడమరకు గాని, మొదళ్ళు గలవాటినిగా అమర్చవలయును.

దూలములను అమర్చుటలో సమసంఖ్యగా అనగా 2-4-6-8-12-14-16 యిట్లే లెక్కించుట సంప్రదాయసిద్ధమగు ఆచారము. సున్నగల సమసంఖ్య నిషిద్ధమని శాస్త్రము

నందు పేర్కొనబడకపోయినను, శాస్త్రమునందు చెప్పబడని చోట ఆచారమే పరమ ప్రమాణము. కాబట్టి సున్నగల సంఖ్యను గ్రహింపకుండుటయే శ్రేష్ఠము.

దూలములను లెక్కించుటలో శాలాభాగము నందలి మధ్యగోడలను ఆ గోడలపై దూలములు వేసినను వేయక పోయినను పరిగణనలోనికి తీసుకొనుట శిల్పసమయము. పరంపరాగతమగు ఆచారము.

కాని కొన్ని ప్రాంతములయందు కడగోడలను కూడ లెక్కించి దూలముల సంఖ్యను నిర్ధారించు ఆచారము గలదు. కాబట్టి నిపుణుడగు స్థపతి వివాదమునకు తావీయక ఆయా ప్రాంతీయాచారమును గౌరవించుట యుక్తము. అయినను కడగోడలను లెక్కించి దూలముల సంఖ్యను నిర్ధారించుటలో గల లోపమును గమనింపవలయును.

కడగోడలపై దూలములు వేయబడవు. దూలములు వేసినను వాటిపై గుజ్జులు నాటబడవు. ఆ కడగోడలపై మందర శ్రేణియను బాజులను మాత్రము అమర్చి వాటిపై వాపములను నాటెదరు. మధ్యగోడలపై అట్లుగాక దూలములను వేసి గుజ్జు నాటెదరు. కనుక మధ్యగోడలను మాత్రమే దూలములను లెక్కించుటలో గ్రహించి కడగోడలను విడుచుట శ్రేష్ఠము. శాస్త్రమునందు కడగోడలపై వేయబడు మందర శ్రేణిబాజులకు ప్రత్యేకమగు పేర్లుకూడ చెప్పబడి యున్నవి. ఆ కడగోడలకు దూలములుగా శాస్త్రకారులు లెక్కించిన యెడల ఆ గోడలపై గల బాజులకు ప్రత్యేకమగు పేర్లు పెట్టి పిలువరు గదా! ఈ విషయమును విజ్ఞులు గమనింపగలరు.

## బాజులు - వాటి అమరిక :

పెంకుటింటి కప్పు నిర్మించునప్పుడు శాలాభాగమునకు నాలుగు దిశలయందు గోడల పైభాగమున "మందరశ్రేణి" యను పేరు గల బాజులను అమర్చెదరు. వీటినే కొన్ని ప్రాంతములయందు "శ్రేణి" యని కూడా వ్యవహరింతురు. ఈ శ్రేణియందు ముందుగా తూర్పుదిశయందు వేయు బాజులను అమర్చవలయును. ఈ బాజునకే "ఆధారము" అని పేరు. ఈ తూర్పునగల బాజునకే "గజము" అనియు, దక్షిణమున వేయు బాజునకు "యెనుబోతు" అనియు, పడమర వేయు బాజునకు "వృషభము" అనియు, ఉత్తరమున వేయు బాజునకు "అజము" అనియు పేర్లు గలవు. ఈ విషయము శ్రీకృష్ణవాస్తు నందు కూడ చూడగలరు.

ఈ బాజుల అమరిక యెట్లుండవలయునో మయుడు స్పష్టపరచి యున్నాడు.

"ఆధారం ప్రథమం ప్రాచ్యాం మూలాగ్రచ్ఛేదనాన్వితమ్
దక్షిణోత్తరయో రగ్రం తస్యోపరినిధాపయేత్
దక్షిణోత్తరయోర్మూల మూర్ధ్వచ్ఛేదన సంయుతమ్
పశ్చిమస్త మధచ్ఛేదం క్షేప్యమాధేయ యోగతః"

**(మయమతం 17 అధ్యాయం 241 పుట)**

అనగా గర్భగృహమునకూ తూర్పుదిశయందలి గోడపై మొదటి శ్రేణి వేయవలయును. దానికి మొదలునందు చివరయందు సంధికర్మకు అనువుగా పై భాగమున "కప్పు" చేయవలయును. అటుపిమ్మట దక్షిణ దిశయందలి బాజును ఉత్తర దిశయందలి బాజును గ్రహించి వాటి మొదళ్ళు పడమరదిశకు ఉండునట్లుగా అమర్చవలయును. ఆ పిమ్మట పడమర దిశయందలి బాజును గ్రహించి బాజునకు అడుగు భాగమున మొదటయందు చివరయందు "కప్పు" అమర్చి దక్షిణోత్తరముల బాజులపై సంధింపవలయును. అనగా మొదలు దక్షిణ దిశయందును, చివర ఉత్తర దిశయందును కలుపవలయును. ఈ సంధికర్మయందు మొదలు అడుగు భాగమునను చివర పైభాగమునందును అమరిక చేయవలయును. ఈ విధమగు సంధికర్మ యందు ఈశాన్యకోణమున రెండు చివళ్ళును, నైఋతిమూల రెండు మొదళ్ళును కలియును. ఈ కలయికను గూర్చి శాస్త్రప్రమాణము గమనింపుడు.

"ఈశానే చాగ్ర మగ్రేణ మూలే నాగ్రంతు పావకే
మూలం మూలేన నిఋతౌ మూలమగ్రేణ మారుతే"

**(వాస్తువిద్య 115 పుట)**

అనగా ఈశాన్యకోణమున రెండు చివళ్ళు కలియును. అగ్నికోణమున మొదలు చివర కలియును. నిఋతికోణమున రెండు మొదళ్ళు కలియును. వాయువ్యమూల మొదలు చివర కలయును అని భావము.

మరియు సాధారణ సంధికర్మయందు అనగా రెండు తనాబీలను గాని లేదా రెండు

బాజులను గాని కలిపి ఒకటిగా చేయవలసి యున్నప్పుడు -

"మూలే మూలం సయుంజీయా దగ్రేచాగ్రం తథైవచ
మూలాగ్రద్వయ యోగేన సంధికర్మ సుఖప్రదమ్"

(వాస్తువిద్య 114 పుట)

అనగా మొదలు మొదలుతోను, చివర చివరతోను కలుపరాదు. మొదలు చివర కలిపి సంధించుట మిక్కిలి శుభప్రదమని భావము. కావున నిపుణుడగు స్థపతి ఈ సంధికార్యము మిక్కిలి శ్రద్ధగా శాస్త్రములయందు చెప్పబడిన విధముగా చేయవలయును. అట్లు చేయనిచో విపరీతమగు ఫలము కలుగునని మయుడు నొక్కి వక్కాణించి యున్నాడు.

## గుజి = గుర్జులు :

గుజి అనగా గుర్జు. ఈ గుర్జులు పై కప్పు నిర్మాణమునందు భారవాహికలు. అనగా బరువును మోయునవి. ఈ గుర్జులు నాటుపద్ధతి సాంకేతికపరమైనది. గుర్జులు దూలములపై నాటుదురు. దూలములేనిచోట గుర్జు నాటరాదు. కాని కొందరు "పాతికనాటు" దూలము వేయకయే "వికర్ణము" అను పేరుగల శ్రేణులు వేసి వాటిపై గుర్జులు వాటి పై కప్పు నిర్మించుచున్నారు. ఇట్టి నిర్మాణములు శుభఫలమునీయజాలవు. మరియు కొందరు దూలములపై నుండి సరాసరి వెన్నుబద్దకు ఒకే పొడవుగల గుర్జులను నాటి ఆపైన వెనుబద్ద వేయుచున్నారు. ఈ పద్ధతియు శాస్త్రసమ్మతము కాదు. గుర్జులు కూడ సమసంఖ్యలో నుండుట శ్రేయోదాయకము. కాబట్టి స్థపతులు, గృహయజమానులు ఈ విధముగు నిర్మాణముల యందు మెలకువతో వ్యవహరింపవలయును. వివాహ గృహములయందీ నియమము తప్పరాదు.

**గమనిక** : రామకోవెలలు, దేవతా మందిరములు, భజన మందిరములు మొదలగు వాటియందు ఆయా నిర్మాణక్రమము ననుసరించి విశేషవిధిచేత ఈ నియమము పాటింపబడకున్నను దోషము లేదు.

## స్తంభములు :

సంస్కృతమున స్తంభములకు పాదములని పేరు. ఈ స్తంభములు యింటికి సమసంఖ్యలో నుండవలయును. ఈ స్తంభనిర్మాణమునందు కఱ్ఱతో చేయు

స్తంభములైనచో కర్ర యొక్క మొదలు చివర గుర్తించి మొదలు క్రిందకు చివర పైభాగమువకు అమరిక చేయవలయునని మయుని వచనము. గమనింపుడు

"స్థితస్య పాదపస్యాంగ ప్రవృద్ధి వశతో విధుః
ఊర్ధ్వమూల మధశ్చాగ్రం సర్వసంపద్వి నాశనం"
(మయమతం 17 అధ్యాయం 247 పుట)

ఈనాటి నిర్మాణముల యందు సిమెంటుతోనే స్తంభములు అమర్చుచున్నారు. కావున అట్టి స్తంభములు మొదట లావుగను చివర సన్నముగను నిర్మించవలెను గాని విపర్యముగా చివర లావుగలవిగా నిర్మించినచో మతిభ్రమ గలుగునని శాస్త్రవచనము.

మరియొక గమనిక స్తంభములకు మధ్యగల కాళీప్రదేశములు యించుమించు సమమగు రీతిలో నుండవలయును. మరియు పాదవునందు గాని వెడల్పు నందుగాని స్తంభములు సమసంఖ్యగా నుండవలయును. మయమతం 17వ అధ్యాయం 88వ పుటలో-

"విస్తారేచ తథాయామే సమాః పాదాస్తు సంఖ్యయా"

అని చెప్పబడియున్నది. కావున ఈ విషయమును గూడ స్థపతులు గమనింప వలయుము. సాధారణ గృహనిర్మాణముల యందు స్తంభములు గోడ పారులయందుగాని దూలముల పారులయందు కాని గృహ సౌందర్యము చెడక యుండునట్లు పాదకల్పన చేయవలయును.

**వంశము = వెనుబద్ద :**

వంశము అనగా వెనుబద్ద. ఛాద్యనిర్మాణమునందు ఈ వెనుబద్దకు మిక్కిలి ప్రాముఖ్యమున్నది. మానవునకు వెన్నుదండి యెట్టిదో గృహపురుషునకు వెనుబద్ద అట్టిది. ఈ వెన్నుబద్దలు రెండు సమాంతరముగా ఛాద్యమునకు పై భాగమున అమర్చెదరు. ఈ రెండు వెనుబద్దలు వెన్నుదండి యందలి ఇడాపింగళనాడులకు సంకేతము కావచ్చును. వెన్నుబద్ద ఒకటి మాత్రమే వేయు ఆచారము లేదు. ఒకే వెన్నుబద్ద వేసి ఛాద్యమును అమర్చు పద్ధతి నిషేధము. ఈ శిల్ప సమయము సర్వత్ర పాటింపబడుచున్నది. అన్ని ద్రవ్యములకు వలెనే ఈ వెనుబద్దల యొక్క మొదళ్ళు దక్షిణ పడమరలకును చివళ్లు ఉత్తర తూర్పులకును అమరిక చేయుదురు.

మయబ్రహ్మ గృహయజమానుడు నివసించు గదిని గూర్చి ఈ వెనుబద్దనే ప్రాతిపదికగా గ్రహించి నిర్వహించి యున్నాడు. కాబట్టి ఈ వెనుబద్దలను యెన్నుకొనునప్పుడు యే విధమగు పుండ్లు గాని, కణుపులు గాని, తొఱ్ఱలు గాని, పగుళ్ళు గాని లేనట్టి మనోహరమగు ద్రవ్యమును గ్రహించి భక్తితో పూజించి నూతన వస్త్రాదికముతో అలంకరించి అమర్చ వలయును. మయుని ఈ క్రింది వచనమును బట్టి వెన్నుబద్దకు యెంతటి ప్రాముఖ్యము

గలదో ఊహింపుడు -

"వంశమూలేతు వాసంస్యాత్ వంశాగ్రేరంగ మీరితమ్"

అనగా వెనుబద్ద మొదలున్నచోట యజమాని పడక గదియు చివరయందు హాలును నిర్మించవలయును. ఈ విధి రెండు గదుల యింటికి చెందినది. మూడు గదులు నిర్మించినప్పుడు

"తదేవ మధ్యమేరంగం వాసంవంశాగ్ర మూలయోః"

అనగా వెన్నువాసము మొదలు చివర గలచోట్ల రెండు పడక గదులు మధ్యయందు రంగము అనగా హాలు నిర్మించవలయునని భావము.

ఈ విధముగా మయుని దృష్టిలో వెన్నుబద్ద ప్రాణతుల్యమైనది. కావున ఈ విషయమును స్థపతులు బాగుగా గమనించి నిర్మాణములు చేయవలయును. ఈ వెనుబద్ద తూర్పు పడమరలు సూచించునప్పుడు తూర్పునందు కొంచెము పల్లముగా నుండవలయును. దక్షిణోత్తరములు సూచించునప్పుడు ఉత్తర దిశయందు కొంచెము తగ్గియుండ వలయును. దూలములకు వెనుబద్దకు సరాసరి గుర్జులతో సంబంధము కలుపరాదు. కత్తెర గోడలు పెట్టి నిర్మించిన యింటికి కడగోడలలోనికి చొచ్చుకొని యున్న వెనుబద్దలు బయటికి కనుపించరాదు. ఏ కారణముచేతనైనా ఒక యింటిని తప్పనిసరిగా రెండు భాగములుగా విభజింప వలసి వచ్చినపుడు వెనుబద్దను రెండుగా కోసి విడదీయుట నరక హేతువు. విభజన తప్పని సరియైనచో కప్పును పూర్తిగా తీసివైచి విభజించి మరల రెండు భాగములను విడిగా నిర్మించుకొన వలయును.

## వెన్నుపోటు :

వీధి అడ్డముగానున్నచో వెన్నుపోటు దోషము లేదు. వీధి అడ్డమైనను తనయింటి గర్భప్రమాణమునకు రెట్టింపు దూరమునందున్నచో శ్రేయస్కరము. ఎదురింటి వెన్నుపోటు తనయింటి వెన్నుబద్దకు మొదటగాని చివరగాని మధ్యగాని యెచ్చటను తాకరాదు. దాబా యిండ్లకు వెన్నుపోటు దోషము లేదు. కాని సింహద్వారమునకు ఎదురుగా యెదురింటి వెన్నుపోటు ఉండరాదు. మొదటి అంతస్తునకు గల వెన్నుపోటు రెండవ అంతస్తునకు ఉండదని కొందరు స్థపతుల అభిప్రాయము. వెన్నుపోటు సమాంతరముగా లేనప్పుడు దోషము లేదని మరి కొందరి మతము. వీరి వాదనకు శాస్త్రప్రమాణము కావరాదు. రెండవ పక్షముగా గ్రహించినను గ్రహింపవచ్చును.

# ఉపగృహములు - నీటి పారుదలలు

ప్రధాన గృహమునకు నలువైపుల దిక్కులయందు గాని విదిక్కులయందు గాని నిర్మించు గృహములకు ఉపగృహములని పేరు. ఉపగృహములలో ముఖ్యమైనవి వంటశాల, ధాన్యశాల, పశువులశాల, పూజాగృహము మొదలైనవి.

**వంటశాల :**

మానవునకు ఆరోగ్యమే మహాభాగ్యము. ఆరోగ్యవంతుడు గాని మానవునకు యెన్ని సంపదలున్నను నిరర్థకమే కాగలవు. అట్టి ఆరోగ్య సంపద నిత్యము మనము భుజించు ఆహారముపై నాధారపడి యుండును. ఆహారము పుష్టికరముగను, శుచిర్భూతముగను ఉండ వలయును. క్రిమికీటకాదుల బారినుండి ఆహారమును సంరక్షించుట ప్రథమ కర్తవ్యము.

ఆహారమును దోషరహితముగా తయారు చేయుటలో వంటశాలకు మిక్కిలి ప్రాధాన్యత యున్నది. వంటశాల తగినంత వెలుతురు గాలి ప్రసరించునట్లుగా నిర్మించ వలయును. వండిన ఆహార పదార్థములకు దృష్టిదోషము తగులక యుండునట్లుగా వంటశాల యింటికి పృష్ఠభాగమున అనగా లోతట్టున గల పెరడునందు నిర్మింపవలయును. గృహిణి అనగా గృహయజమానురాలు స్వయముగా వంటపనులు నిర్వర్తించుటకు గాని, లేదా పరిచారికల చేత వంటపనులు చేయించి వారి పనులపై అజమాయిషీ చేయుటకు గాని వంటశాల గృహమునకు లోపలిభాగమున ఉన్నప్పుడే సాధ్యమగును.

కాని ఆధునికులు కొందరు వంటశాల యింటికి ఆగ్నేయము నందే తప్ప మరెక్కడ నిర్మింపరాదని చెప్పి తూర్పు సింహద్వారము గల యింటికి సింహద్వారమునకు ముందుగల వరండాయందు ఆగ్నేయ కోణమునందలి గదిలో వంట చేయుటకు ఏర్పాట్లు చేయుచున్నారు. లేదా సింహద్వారము ముందుట గల కాళీస్థలమునందు ( ఈ కాళీస్థలము వాస్తు పురుషుని ఊపిరితిత్తులని చెప్పబడినది) ఆగ్నేయ కోణమున వంటశాలలు కట్టించుచున్నారు. ఈ విధమగు కట్టడములు శాస్త్రవిరుద్ధములు. అంతేగాక లోకజ్ఞాన రహితమగు మూర్ఖత, ఏమందురా? నిత్యము అతిథి అభ్యాగతులతోను,

బంధుమిత్రులతోను కలకలలాడుచుండ వలసియున్న యింటియొక్క ముఖభాగమున గృహిణి ఇతర పరిచారికా జనము వంటలు చేయుచు మసలుచుండుట యేపాటి నాగరికత అనిపించుకొనును. విజ్ఞులు పూర్వా పరములను బాగుగా విమర్శింపవలయును.

ప్రతికార్యమునకు సాధారణవిధి, విశేషవిధి, అను రెండు పద్ధతులుండునని యిదివరలో చదివియుంటిమి. మయుడు ఉపగృహనిర్మాణమును గూర్చి చెప్పిన సాధారణ నియమము గమనింపుడు -

"యమదిశి భోజనశాలా సౌమ్యే ధన సంచయావాసమ్
అగ్నౌ ధాన్యాగారం ఖేవక్త్రైర్వ్యం జనాని తత్రైవ
ఆరాధన గృహమీశే కూపం తత్రోదితం స్నానమ్
యస్మిన్ యదుక్తముచితం అన్యానిహి తత్ర సంప్రయోజ్యాని"

*(మయమతం 26 అధ్యాయం 63 పుట)*

దక్షిణమున భోజనశాల, ఆగ్నేయమున ధాన్యశాల, తూర్పు ఆగ్నేయముల మధ్య యందు గల అంతరిక్ష పదమందు వంటశాల, ఈశాన్యమున పూజాగృహము, అందే నుయ్యి స్నానగృహము నిర్మింపవలయును. మరియు ఇతర గృహములు ఉచితములగు స్థానముల యందు నిర్మింపవలయునని స్థపతికి ఆధికార మీయబడినది. ఈ నియమము సర్వ సాధారణమగు నియమము.

"ఉత్తరేశాన పర్జన్యే సర్వేషాం పచనాలయం
యామ్యేచ నైఋతేవాపి సర్వేషాం భోజనాలయం"

(మానసారం 258 పుట)

పై ప్రమాణము ననుసరించి కూడ ఉత్తర ఈశాన్య పర్జన్య స్థానములయందు వంటశాల యుండవచ్చుననియు, దక్షిణమున గాని నైఋతిదిశయందు గాని భోజనశాల యుండవచ్చుననియు తెలియవచ్చుచున్నది.

ఈ వంటశాలా నిర్మాణమును గూర్చి ముఖద్వారమును బట్టి యేయే స్థానముల యందు వంటశాలలు నిర్మించవలయునో మయ విశ్వకర్మలు విశేషవిధి చేత శాసించి

యున్నారు. విశ్వకర్మ వివరించిన గృహభాగత్రయ విభాగము ననుసరించి తూర్పు దక్షిణ పశ్చిమ ఉత్తర దిశలయందు ముఖద్వారములు గల యిండ్లకు వంటశాలలు వివరింప బడుచున్నవి.

### *1. తూర్పు సింహద్వారము గల యింటికి :*

తూర్పు ముఖద్వారము గల యింటికి పడమర దిశయందు మానుష భాగముండును. కాబట్టి ఈ యింటికి పడమర వసారా యందలి నైఋతి వాయవ్య కోణముల యందలి గదులను వంట గదులుగా ఉపయోగించ వచ్చును. లేదా పడమర గల కాళీ ప్రదేశము నందు నైఋతి వాయవ్య కోణములయందు వంటశాలలు నిర్మించుకొనవచ్చును.

### *2. దక్షిణ సింహద్వారము గల యింటికి :*

దక్షిణ ముఖద్వారము గల యింటికి ఉత్తర దిశయందు మానుష విభాగముండును. కాబట్ట ఉత్తర దిశయందలి వరండా భాగమున గల వాయవ్యము నందున్న గదియందు వంట చేయవలయును. లేదా కాళీస్థలము నందలి వాయవ్య కోణమున వంటశాలగా విడిగా కట్టవచ్చును.

### *3. పడమర సింహద్వారము గల యింటికి :*

పడమర సింహద్వారము గల యింటికి తూర్పుదిశయందు మానుష భాగముండును. కావున తూర్పు వసారాయందు యింటికి ఆగ్నేయ మూలయందున్న గదియందు వంట చేయవలయును. లేదా కాళీస్థలమునందు ఆగ్నేయమూల వంటశాల విడిగా నిర్మింపవచ్చును.

### *4. ఉత్తర సింహద్వారము గల యిల్లు :*

ఉత్తర సింహద్వారము గల యింటికి దక్షిణ దిశయందు మానుష భాగముండును. అందుచేత దక్షిణ వరండాయందలి యింటికి ఆగ్నేయ మూలయందున్న గదిలోగాని నైఋతి మూలయందున్న గదిలోగాని వంట చేయవలయును. లేదా కాళీస్థలమున్న యెడల ఆగ్నేయము నందుగాని నైఋతి దిశయందు గాని విడిగా వంటశాలలు నిర్మింపవచ్చును.

## మయబ్రహ్మ చెప్పిన-విశేషవిధి :

మయబ్రహ్మ చెప్పిన విశేషవిధి మిక్కిలి ఆశ్చర్యకరమైనది. ఆలోచించి చూచినచో యెంతయో విజ్ఞాన రహస్యము యిమిడియున్న విశేషవిధిగా గమనింప గలము.

"అంతరిక్షే భవేచ్చుల్లీ సత్యకేశ్యాదులూఖలమ్
ఐశాన్యం పచనస్థానం సర్వేషాం దేహినాం శుభమ్"
(మయవాస్తు 27 అధ్యాయం 93

పుట)

ఆగ్నేయము నందుగల అంతరిక్ష పదమునందు వంటశాల ఆ వంటశాలకు ఉత్తరమున రుబ్బురోలు అమరిక చేయవలయును. లేదా సమస్తమైన వారికి ఈశాన్యమున వంటశాల శుభప్రదమైనది. అని విశేషవిధి చేత సమస్తమైన వారికి ఈశాన్యమునందు వంటశాల శుభప్రదమైనదని మయుడు వక్కాణించి యున్నాడు.

ఈశాన్యమున వంటశాలా నిర్మాణము అనుటలోనే మనము నాలుక కఱచుకొందము. ఇది వాస్తుశాస్త్ర విరుద్ధమని యూపడింతుము. కాని వాస్తుశాస్త్ర విజ్ఞానమున తనకు తానే పాటియనదగు మయబ్రహ్మ అంత అనాలోచితముగా చెప్పియున్నాడని భావింతుమా! అట్లెన్నటికిని జరుగదు. ఈ నిర్ణయమునందు యిమిడియున్న వైజ్ఞానిక రహస్యమును గమనింపుడు.

భారతీయులకే గాక సమస్త దేశములవారికి వేదకాలము నుండియు అగ్ని ఆరాధ్య దైవము. అతి పవిత్రమైనది. అగ్ని వంటి పవిత్రమగు భౌతిక పదార్థము లోకమున మరొకటి లేనేలేదు. అట్టి అగ్ని ప్రతిష్ఠ నిత్యారాధనా తత్పరులైన వారికి ఈశాన్యమున శుభప్రదము. ఈశాన్య దిక్కునకు అధిపతి రుద్రుడు. "ఆరుద్రా నక్షత్రమ్ రుద్రోదేవతా" అని శ్రుతి ప్రమాణము.

ఈ రుద్రుడనగా యెట్టివాడు? ఆరుద్రా నక్షత్ర మండలమునకు అధిపతియగు రుద్రుడు యితడే. ఈ ఆరుద్రా నక్షత్రమును గూర్చి ఆధునిక వైజ్ఞానికులు చెప్పిన వివరములు గమనింప తగినవి.

సమస్త సముద్రములతో సహితముగా మనము నివసించు భూగోళము యొక్క

చుట్టుకొలత 25 వేల మైళ్లు. అట్టి భూగోళములు 14 లక్షలు కలిపినచో యెంత ప్రమాణ ముండునో అంత ప్రమాణము గలవాడు సూర్యుడు. అట్టి సూర్యగోళములు రెండుకోట్ల యాభై లక్షలు కలిపిన యెంత ప్రమాణముండునో అంత ప్రమాణము గలది ఆరుద్రా నక్షత్రము.

ఆరుద్రా నక్షత్రము మానవమాత్రుడు ఊహింపనలవి కానంతటి మహాగ్నిగోళము. దీనిని "హరునయనాగ్ని కొలిమి" యని కవులు గానము చేసినారు. రుద్రుని మూడవ నేత్రముగా భావించి ఆరాధింపబడు ఆరుద్రా నక్షత్రమునకు అధిదైవతమగు రుద్రుడే ఈశాన్య దిక్కునకు అధిపతి. అట్టి ఈశాన్యమునందు వంటశాల యేర్పరచుట ఆగ్నేయము కంటెను శ్రేష్ఠమని అపర విశ్వకర్మావతారుడగు మయుని అభిప్రాయము గావచ్చును.

మరియొక వ్యవహారానుకూలత యిందిమిడి యున్నది. ఈశాన్యమున నయ్యి, అందే పూజాగృహము ఉండును గదా! పూర్వము నుండియు చేసిన వంటకములు గృహగత పరమేశునకు నివేదన చేయు ఆచారము గలదు. ఈశాన్య దిశయందు వంటశాల ఈ నివేదనకు అనుకూలముగ నుండును. ఈ విషయమును గూర్చి విజ్ఞులు పరిశీలింతురు గాక.

పూజా గృహము :

ప్రతి యింటియందు పూజాగృహమును ఏర్పరచుకొనుట అవసరము. ఇంటియందు పూజించు దేవునకు మయుడు "గృహగత పరమేశుడు" అని నామకరణ మొనర్చియున్నాడు. అట్టి గృహగత పరమేశునకు యే ముఖద్వారము గల యింటియందైనను ఈశాన్యము నందే స్థానము కల్పింప వలయునని చెప్పలేదు.

పూజాగృహము సాధారణముగా యింటికి ముందరభాగమగు దేవభాగము నందు కంటే పృష్టము నందున్న మానుష భాగమునందే ఏర్పరచుకొనుట ఉచితము. అందుచేతనే అన్నాలయ, ధాన్యాలయ, ధనాలయ, సుఖాలయములకు

"గృహగత పరమేశం రాక్షసే పుష్పదంతే
శుభకర మథ భల్లాటాంశకే మహేంద్రే"

**(మయమతం 26 అధ్యాయం 101 పేజీ)**

పూజాగృహమును దక్షిణ దిశయందైనచో గృహక్షత పదమునందును, పడమర దిశయందైనచో పుష్పదంత పదమునందును, ఉత్తర దిశయందైనచో భల్లాటపదము నందును, తూర్పుదిశయందైనచో మహేంద్ర పదమునందును ఏర్పరచుకొన వలయును. ఈ పద విభాగము ఏకాశీతి పదవాస్తు విభాగము ననుసరించి చేయవలయునని గమనింపగలరు.

## ధాన్యశాల :

ధాన్యశాల మానవునకు ప్రాణప్రదమైనది. మానవులు అన్నగత ప్రాణులు గదా? అట్టి అన్నము అనగా ధాన్యము నిలువచేయు గృహములు తగిన రక్షణ గల చోటులయందు నిర్మింపవలయును. మూడు దిశలయందు గోడలను, ఒకదిశయందే ద్వారములును యేర్పరచవలయునని విశ్వకర్మ వివరించి యున్నాడు. గుమ్మములు సమసంఖ్యగాని బేసి సంఖ్యగా గాని ఉండవచ్చును.

ఈ ధాన్యశాలలు ప్రధానగృహమునకు వాయవ్యమున గాని నైఋతి దిశయందు గాని ఆగ్నేయ దిశయందు గాని నిర్మించుకొనవచ్చును. ధాన్యశాలలకు ఆయా స్థలాను గుణ్యముగ యే దిశయందైనను ద్వారము లుంచవచ్చును. గ్రంథ విస్తరభీతిచే శ్లోకములు విడువబడినవి.

## పశువుల శాలలు :

మనదేశమున పశుసంపదయే నిజమైన సంపదగా భావింపబడుచున్నది. కావున పశు క్షేమమును గూర్చి శాస్త్రముల యందు చక్కని వివరణమున్నది. సమస్తమైన పశువులకు వాయవ్య దిశయందు పశువులశాల నిర్మింపవలయునని సాధారణ నియమము గలదు. ఈ సాధారణ నియమము పాటింపబడనప్పుడు ఈ క్రింది విశేషవిధి ననుసరించి పశువులశాలలను నిర్మించుకొన వలయును.

"అపిచ శిఖినిగోష్టం నైఋతే జావికానాం
పవన దిశి నివాసం మాహిషంచై శకోణే
భవతి తురగశాలా నాగశాలాచ తస్మిన్
దిశిచ దిశిచ సర్వే వాహనా ద్వారవామే"

(మయమతం 26 అధ్యాయం 64 పుట)

ఆగ్నేయ దిశయందు గోష్ఠాగారము శ్రేష్ఠమని మయుని అభిప్రాయము. ఈ నిర్ణయమునకు కూడ అంతరార్థము గలదు. వృషభమునకు ఖగోళమునందలి వృషభరాశికి సంబంధమున్నది. వృషభరాశి కొమ్మలయందు అగ్ని దైవతమగు కృత్తికలు చిక్కుకొని యున్నవి. కాబట్టి అగ్నికోణమునందు వృషభజాతులకు నివాసము శ్రేష్ఠమైనదని భావము. అగ్నికోణమున గోవులు వృషభములు ఇతర పశుజాతులు. నివసించుట కెంతయో ఉచితమని విజ్ఞానవేత్తయగు మయుడు వివరించి యున్నాడు.

మేకలు, గొఱ్ఱెలు మొదలగు పశుజాతులకు నైఋతిదిశ మిక్కిలి శ్రేష్ఠమైనది. వాయవ్యదిశ గేదెలు, పోతులు మొదలగు పశువులకు మిక్కిలి శ్రేష్ఠము. గుఱ్ఱములకు ఏనుగులకు ఈశాన్యము శుభప్రదమైనది. అది మయుని అభిప్రాయము.

**నీటిపారుదల :** గృహావరణ యందలి నీటిపారుదలలను గూర్చి మయుడు సాధారణ నియమములు, విశేషవిధులు అను రెండు విధములుగా వివరించియున్నాడు.

**సాధారణ నియమములు :** ఈ సాధారణ నియమములను గూర్చి ఉచ్చ - నీచలు అను ప్రకరణమునందు విపులముగా వివరింపబడినది. ప్రస్తుతము మయమతం రెండవ అధ్యాయమునందు జాతిపరమైన నియమములు చెప్పుచు ఈ క్రింది విధమగు భూములు నివాసయోగ్యములని వివరించియున్నాడు.

*1. ఉత్తర ప్రవణము - ఉత్తరదిశగా నీటిపారుదల గలభూమి*

*2. ప్రాఙ్నిమ్నము - తూర్పుదిశగా నీటిపారుదల గలభూమి*

*3. పూర్వావనతము - తూర్పుదిశగా నీటిపారుదల గలభూమి*

*4. ప్రాక్ ప్రవణము - తూర్పుదిశగా నీటిపారుదల గలభూమి*

సారాంశమేమనగా సమస్త వర్ణముల వారికి తూర్పు ఉత్తరదిశలకే నీటిపారుదల గల భూములు గృహనిర్మాణ యోగ్యమైనవని మయుని అభిప్రాయము. కాని దేశకాలముల ననుసరించి అన్ని స్థలములయందు తూర్పు ఉత్తర దిశయలకే నీటిపారుదలలు గల నివాస భూములు లభించుట దుస్తరము. ఈ విషయము సర్వజన విదితము. ఋషిసత్తముడు త్రికాలజ్ఞుడు అగు మయుడు పై విషయమును దృష్టియందుంచుకొనియే సింహద్వారము ననుసరించి నీటిపారుదల విశేషవిధిచే శాసించినాడు.

## నీటిపారుదల విశేషవిధి :

ఈ విశేషవిధి యందు ఒక నియమము పాటింపవలసియున్నది. నీటివాటము అనగా గృహావరణ యందలి నీటిపారుదల, అనగా యింటికి యెడమప్రక్కన గల దిశనుండి ప్రాకారము బయటకు నీరుపోవు మార్గము, తూములు మొదలగునవి ఏర్పరచవలయును.

### 1. తూర్పు సింహద్వారము గల యిల్లు :

"మహేంద్రాంశే భవేద్వారం ముఖ్యాంశే వారి నిస్రణమ్"

అనగా తూర్పు సింహద్వారము గల యింటికి యెడమ పార్శ్వమునందున్న ఉత్తరదిశయందు ఉత్తరవాయవ్య దిశల మధ్య భాగమున గల ముఖ్యపదమునందు నీటిపారుదలకు తూములు ఏర్పరచవలయును.

### 2. దక్షిణ సింహద్వారము గల యిల్లు :

"గృహక్షతాంశకే ద్వారం జయంతే వారి నిస్రణమ్"

అనగా దక్షిణ సింహద్వారము గల యింటికి యెడమ పార్శ్వమున గల తూర్పు దిశయందు, తూర్పు ఈశాన్య దిశలమధ్య యందున్న జయంత పదమునందు గృహావరణము నుండి నీరు బయటకు పోవు తూము ఏర్పరచవలయును.

### 3. పడమర సింహద్వారము గలయిల్లు :

"పుష్పదంతే పదే ద్వారం వితథేవారి నిస్రణమ్"

అనగా పడమర సింహద్వారము గల యింటికి యెడమ పార్శ్వమందున్న దక్షిణ దిశయందు దక్షిణ ఆగ్నేయములకు మధ్యగల వితథ పదస్థానమునందు నీటిపారుదలకు తూము నిర్మించవలయును.

### 4. ఉత్తర సింహద్వారము గల యిల్లు :

"భల్లాటంశే భవేద్వారం సుగ్రీవే వారి నిస్రణమ్"

అనగా ఉత్తర సింహద్వారము గల యింటికి యెడమ పార్శ్వమున గల పడమర దిశయందు, పడమర నైఋతి దిశల మధ్యభాగమున గల సుగ్రీవ పదస్థానమునందు గృహావరణ యందలి నీరు బయటకు పోవు నిమిత్తము తూము యేర్పరచవలయును.

గమనిక : ఈ విధమగు విశేష విధులున్నందున ఆయా సింహద్వారము గల యిల్లు కాకున్నను ఆయా దిశలయందు ఆయా పద స్థానములయందు నీటిపారుదలలకు

తూములు ఏర్పరచుకొనుటలో దోషము లేదు.

**మాతులు :**

బావులు, మాతులు యింటికి ఉత్తరమున, ఈశాన్య దిశయందు, తూర్పు దిశయందు నిర్మించవచ్చును. నీళ్లకుండీలు కూడా ఆయా దిశలయందు నిర్మించుటయే శ్రేష్ఠము. ఈ మూడు దిశలయందు మాయి తీయుటకు ఎట్టి పరిస్థితులలోను అవకాశము లేనియెడల యింటికి పడమర దిశయొక్క పొడవును నైఋతి కోణము నుండి వాయవ్య కోణము వరకు కొలిచి మూడు సమభాగములు చేసి అందు మధ్యభాగము నందు అవగా పడమర దిశకు లభించిన భాగమువందు ద్వారవేధలు లేకుండునట్లుగా పరిశీలించి నుయ్యి నిర్మించు కొనవచ్చును. ఇది శాస్త్రసమ్మతము. "పశ్చిమేపుత్ర వర్ధనం" అని గ్రంథాంతరములయందున్నది.

ఆగ్నేయము నందుగాని నైఋతియందుగాని, దక్షిణ దిశయందుగాని, వాయువ్య కోణమువందుగాని నుయ్యి నిర్మించకూడదు. ఆధునికమగు నీటి కుళాయిలు మొదలగునవి నిర్మించుకొనినచో దోషము లేదు.





# గృహావరణ వృక్ష విజ్ఞానము

ప్రతి గృహస్తుడు తన నివాసగృహము యొక్క ఆవరణయందు అనగా ప్రాకారము యొక్క లోపలిభాగమున అవసరమగు చెట్లు, మొక్కలు, పూలు పూచే పొదలు పెంచుటకు ప్రయత్నించుట సహజము. ఎందుచేతననగా గృహావరణయందు చెట్లు మొక్కలు అందమైన పలురంగుల పూలు పూచే, లతాగుల్మములు పెంచుటచేత గృహపరిసర వాతావరణము ఆరోగ్యప్రదమై యుండుటయే గాక యచటి ప్రకృతి నయనానందకరముగా నివసించువారు ఆయురారోగ్య ఐశ్వర్యవంతులై యుందురని శాస్త్రవచనము. అందుచేత ప్రతిగృహస్తుడు తనయింటి ఆవరణయందు స్థలా మగుణ్యా మగు రీతిలో శాస్త్రములయందు శుభప్రదములని చెప్పబడిన చెట్లను, మొక్కలను, లతలను నాటి పెంచుట శుభప్రదము. మరియు గృహావరణ యందుడ తగవని శాస్త్రములు నిషేధించిన వృక్షలతా గుల్మములను గృహస్తుడు తనయింటి ఆవరణయందు యెంతమాత్రమును నాటి పెంచరాదు. ఈ ఆవరణ వృక్షవిజ్ఞానము విజ్ఞానశాస్త్ర సంబంధమగు నిర్ణయము. కాబట్టి వాస్తుశాస్త్రవేత్తలు, గృహస్తులు ఈ వృక్షవిజ్ఞానమును బాగుగా గమనింపవలయును.

గృహావరణయందుండదగిన వృక్షములలో వేపచెట్టుకు ప్రథమస్థానము లభించుచున్నది. రెండవస్థానము సహకార వృక్షమునకు అనగా మామిడిచెట్టునకు లభించుచున్నది. ఇందు వేపచెట్టునకు గల విశేషము గమనింపుడు.

మానవులకు ప్రాణవాయువు అనగా "ఆక్సిజన్" మిక్కిలి అవసరమైనది. సూర్యరశ్మియందు పుష్కలముగా లభించు ప్రాణవాయువును వేపచెట్టు పగలంతయు గ్రహించి తన ఆకులయందు భద్రపరచి రాత్రికాలమున బయటకు విడిచిపెట్టును. మరియు రాత్రియందు అధికముగానుండు బొగ్గుపులుసు వాయువును హరించి ప్రాణులకు మేలు చేయును. అంత శ్రేష్ఠమగు వృక్షమగుటచేతనే దానికి ప్రథమస్థానము లభించి మానవులకు నిత్యపూజార్హమై వెలయుచున్నది. మానవ ఆరోగ్య సంరక్షణ యందుగూడ వేపచెట్టునకు గల స్థానము అద్వితీయమైనదని ఆయుర్వేదము వివరించుచున్నది. అందుచేతనే మయుడు గృహనిర్మాణ యోగ్యమగు భూమిని గూర్చి

వివరించుచు -

"బిల్వానింబశ్చ నిర్గుండీ, పిండిత స్సప్తపర్ణకాః
సహకారశ్చ షడ్వృక్షైః ఆరూఢాయాసమస్థలా"

(మయమతం 3 అధ్యాయం 4వ శ్లోకం)

అని చెప్పెను. అనగా మారేడు, వేప, వావిలి, పిండితము, సప్తపర్ణి సహకారము అనగా మామిడిచెట్టు ఈ ఆరు వృక్షములు పెరిగిన స్థలము నివాసయోగ్యమని భావము. అట్లే విశ్వకర్మ

"శ్రీ వృక్షైః నింబ కాశోకైః రసనైః క్రముకై రపి
సౌవీరైరింగుదీభిశ్చ రసాలై ర్వేజులై రపి"

(విశ్వకర్మ వాస్తుశాస్త్రం 37 పేజీ)

అని వివరించెను. నింబ అనగా వేపచెట్టును గూర్చి విశ్వకర్మయు నిర్బంధముగా చెప్పియున్నాడు. అట్లే మామిడిచెట్టు గూడ గృహావరణయందుండ తగిన వృక్షము. మరియు వాస్తుప్రదీప యను గ్రంథమునందు

"పున్నాగ ఫలినీ నింబచూతా శోక జాతికాః
యత్ర యత్ర స్థితాశ్చేతే నారికేళాదయశ్శుభాః"

అని వివరింపబడినది. పున్నాగ వృక్షము. వేపచెట్టు మామిడిచెట్టు, అశోకవృక్షము, కొబ్బరిచెట్లు, ఫలవృక్షములు గృహావరణయందుండ తగినవని దీని భావము. మరియు

'సర్వత్ర పనసః శస్తో దక్షిణే సకలాఖిలాః"

(బృహద్వాస్తుమాల)

అనగా గృహావరణ యందే దిశయందైనను పనసచెట్టు శుభఫలమునిచ్చును. అంతియేగాక వృక్షదోషములను హరించునని గ్రంథాంతరమున వివరింపబడినది. గృహమునకు దక్షిణ దిశయందలి ఆవరణయందు యే విధమగు వృక్షములను నాటి

పెంచరాదని శాస్త్రవచనము. పనసకు ఈ నిషేధము వర్తింపదు.

గృహావరణయందుండ తగిన వృక్షములను గూర్చి చెప్పుచూ అపరాజిత పృచ్ఛ అను గ్రంథమునందు 213 పేజీలో

"నారంగైః, కర్ణ, జంభీర, తాల, తమాల, కేతకైః
పనసై ర్నారికేళైశ్చ వృక్షైః పూగీ ఫలై స్తథా
ద్రాక్షా నాగరవల్లీనాం వివిధైశ్చ లతాగృహైః"

అని వివరింపబడినది. నారింజ, నిమ్మ, పనస, నారికేళము, పోకచెట్టు మొదలగునవి గృహప్రాకారముకు లోపల నాటి పెంచవచ్చునని భావము. ద్రాక్ష మొదలగు లతాగుల్మములు కూడ శుభఫలము నిచ్చును.

మరియు సంపెంగ, గులాబి, మల్లి, జాజి, మాలతి, పారిజాతము మొదలగు పూలమొక్కలు పెంచవచ్చును. కాని పసుపుపచ్చని రంగు గల పూలచెట్లు యింటికి దూరంగా నాటవలయునని చెప్పబడియున్నది. పంచరంగులు గల పుష్పముల నిచ్చు మొక్కలు యింటి ముందర నాటవచ్చును. తెల్లమందారము యింటిముందు శుభప్రదము. ఎఱ్ఱమందారము యింటికి ఆగ్నేయదిశయందు వేయరాదు.

## ఉపవనము :

ఉపవనము లేక తోటలయందు ఆగ్నేయదిశయందు దానిమ్మ, నైఋతిదిశయందు చింతచెట్టు, వాయవ్యమునందు మారేడు, ఈశాన్యమునందు ఉసిరిక వృక్షమును నాటవలెను. మరియు ఉత్తరమున జువ్వి, తూర్పున మఱ్ఱి, దక్షిణమున బ్రహ్మమేడి, పడమర రావిచెట్లు నాటి పెంచుట శుభప్రదము. మామిడిచెట్లు మధ్యభాగమున నాటవలయును. తోటకు బయట తూర్పు దిశయందు వెదురుపొదలు నాటుట శుభప్రదము.

మరియు దక్షిణ నైఋతి దిశలమధ్య యందు నేరేడు, కడిమిచెట్లు, తూర్పు ఈశాన్యములకు మధ్య పనస, మామిడి చెట్లు శుభము నిచ్చును. ఉత్తరమున జమ్మి వేయవలెను.

ఒక రావిచెట్లును, ఒక వేపచెట్టును, ఒక మర్రి చెట్టును, పది చింత చెట్టును, మూడేసి వెలగ, మారేడు, ఉసిరిక చెట్టును, ఐదు మామిడి చెట్లను నాటిన మనుష్యుడు

వరకమును పొందదని అనగా మిక్కిలి పుణ్యాత్ముడగునని శాస్త్రములు వివరించుచున్నవి.

## గృహావరణ యందుండతగని చెట్లు, మొక్కలు :

అతీంద్రియ వైజ్ఞానిక దృష్టిసంపన్నులైన భారతీయ వాస్తు శాస్త్రవేత్తలు గృహావరణ యందు ముఖ్యముగా కొన్ని రకములైన చెట్లును, మొక్కలు యందుండరాదని శాసించి యున్నారు.

"బదరీ కదలీచైవ దాడిమీ బీజపూర కా
ప్రరోహంతి గృహేయత్ర తద్గృహం నప్రరోహతి"

(సమరాంగణం 268 పేజీ)

రేగు, అరటి, దానిమ్మ, బీజపూరిక అనగా గజనిమ్మ అను ఈ నాలుగుచెట్లు ఏయింటి ఆవరణయందుండునో ఆ యింటి అభివృద్ధి కుంటుపడునని, అనగా అశుభప్రదమని భావము. అపరాజిత పృచ్ఛ మరియు బృహద్వాస్తుమాల యను ప్రామాణిక గ్రంథములయందు గూడ యిట్లే చెప్పబడినది గమనింపుడు.

"బదరీ, కదలీ, చైవ, హిక్షుదండశ్చ దాడిమీ
యత్ర గృహేప్రరోహంతి, తద్గృహం నప్రరోహతి"

(అపరాజిత పృచ్ఛ 235 పేజీ)

అశ్వత్థంచ కదంబంచ, కదలీ బీజపూరకమ్
గృహేయస్య ప్రరోహంతి సగృహీ నప్రరోహతి

పై నుదహరించిన గ్రంథప్రమాణము ననుసరించి అరటిచెట్లు గృహావరణ యందు పూర్తిగా నిషేధింపబడినవి. దానిమ్మ చెట్లు కూడా గృహావరణ యందుండరాదు. కాని ఆంధ్రదేశమునందు గృహావరణలో అరటిచెట్లు పెంచుటకు గల కారణము పరిశోధింపవలసి యున్నది.

మరియు పాలుగారే వృక్షములు, ఎఱ్ఱని పూలుపూయు వృక్షములు ముండ్లు గల వృక్షములు, యివి యింటి ఆవరణయందుండరాదు. అందున ముఖ్యముగా ఆగ్నేయమూల యెంతమాత్రము ఉండరాదు. అరిష్టప్రదము.

మరియు యింటికి సమీపమున ముండ్లపొదలు చెట్లు ఉన్నయెడల శత్రుభయమును, పాలుగారే మునగ, బొప్పాయి, గన్నేరు మొదలగు చెట్లున్నచో ధననాశనమును కలుగచేయునని శాస్త్రవచనము. ఫలవృక్షములు గృహమునకు చేరువముగాక కొంచెము దూరముగా నాటుట ఉత్తమమని తెలియవలయును.

## వృక్షచ్ఛాయ :

పగలు రెండవ, మూడవ ఝాముల యందు యేవిధమగు చెట్ల నీడయు యింటిపై పడరాదని శాస్త్రముల యందు వివరింపబడినది. కావున యే విధమగు చెట్లనైనను గృహావరణలో యింటికి దూరముగా నాటవలయునని గ్రహింపవలయును. ముఖ్యముగా యింటిగర్భము యెంత ప్రమాణము గలదో అంత దూరము యింటినుండి చుట్టుము విడిచియే మొక్కలను నాటుట ఉచితము.



# గృహారంభ యోగ్యకాలము

గృహారంభమనగా ప్రథమేష్టికాన్యాపమని మయుని అభిప్రాయము. "ఇష్టిక" అనగా ఇటుక. గృహనిర్మాణ ప్రారంభమునకు ముందు గర్భన్యాసము ఆపైన ప్రథమేష్టికాన్యాసము చేయుట ఆంధ్రదేశమునందు పరంపరాగతముగా వచ్చుచున్న ఆచారము.

"సుముహూర్తే సులగ్నేచ హోరాకరణ సంయుతే
రాత్రౌ గర్భమహన్యేవ స్థాపయే శ్చతురిష్టకమ్
యధ్యస్థానంతు గర్భస్య తత్రస్తా ప్రథమేష్టికా"

(మయమతం 12 అధ్యాయం 156 పుట)

అనగా పంచాంగశుద్ధి గల శుభదినమున ప్రథమేష్టికాన్యాపము చేయవలయునని మయుని అభిప్రాయము. విశ్వకర్మయు అట్లే వివరించియున్నాడు.

"ఆదౌ కాలం పరీక్ష్యేత సర్వకార్యార్థ సిద్ధయే
కాలోహి సర్వజీవానాం శుభాశుభ ఫలప్రదః
ప్రాసాద భవనారంభే స్తంభస్థాపన కర్మణి
ఇష్టికాన్యాసనం శస్తం శుభకాలే విశేషతః
తస్మాత్సర్వ ప్రయత్నేన శుభకాలం న లంఘయేత్"

(విశ్వకర్మ వాస్తుశాస్త్రం 13 పుట)

కాలము మహిమాన్వితమైనది. ఈ చరాచర జగత్తంతయు కాల ప్రభావమునకు లోను కావలసినదే. సర్వజీవుల యొక్క శుభాశుభ ఫలములు కాలప్రభావముపైననే ఆధార పడియుండును. కాబట్టి యేదేని కార్యము ప్రారంభించునప్పుడు యోగ్యకాలమును నిర్ణయించుకొనవలయును. అట్లే గృహాది నిర్మాణముల యందును యోగ్యమగు కాల

నిర్ణయము ముహూర్త జ్యోతిష సాంప్రదాయము ననుసరించి నిర్ణయించుకొని ప్రథమేష్టికా న్యాసము చేయవలయును.

ఈ ప్రకరణమున విశ్వకర్మ మతము ననుసరించి గృహారంభ ముహూర్తమునకు తగిన యోగ్యకాలమును గూర్చి సంగ్రహముగా వివరింపబడుచున్నది. ఇందు మతభేదములు గూర్చి వివరింపక పిండితార్థముగా ఆంధ్రదేశమునందు ఆచారసిద్ధమగు పద్ధతి మాత్రమే సంగ్రహముగా చెప్పబడుచున్నది.

## గృహారంభమునకు యోగ్యమగు మాసములు :

"చైత్రే వ్యాధిమవాప్నోతి యోనవం కారయే గృహం
వైశాఖే ధనరత్నాని జ్యేష్ఠే మృత్యుస్తథైవచ
ఆషాఢే భృత్యరత్నాని పశువర్గ్య మవాప్నుయాత్
శ్రావణే మిత్రలాభంతు హానిం భాద్రపదే తథా
యుద్ధంచైవాశ్వినేమాసి కార్తికే ధనధాన్యకం
ధనవృద్ధిర్మార్గశీర్షే పౌషేతస్కరతో భయం
మాఘే త్వగ్ని భయం విద్యాలక్ష్మీ వృద్ధిశ్చ ఫాల్గుణే"

(విశ్వకర్మ ప్రకాశిక 24పుట)

భావము సులభగ్రాహ్యము. కాని పై ప్రమాణము ననుసరించి చైత్రమాసము గృహారంభమునకు నింద్యము. మాఘమాసము అగ్నిభయము అని చెప్పబడియున్నది. అయినను మేషచైత్రమునందును మాఘమాసమునందును గృహారంభము చేయుట సాంప్రదాయ సిద్ధమగు ఆచారము. అందుకు కారణము ఈ క్రింది శాస్త్రవచనము కావచ్చును.

"సౌమ్య ఫాల్గుణ వైశాఖమాఘ శ్రావణ కార్తికాః
మాసాస్యుః గృహనిర్మాణే పుత్రారోగ్య ఫలప్రదాః

(జ్యోతిర్నిబంధము)

"మాసే తపస్యే తపసి మాధవే నభసి త్విషే
ఊర్జేచ గృహనిర్మాణం పుత్రపౌత్ర ధనప్రదమ్"

(వశిష్ఠ సంహిత)

పై ప్రమాణములను విచారించి చూడ పిండితార్థముగా నీ క్రింది విషయము గ్రహింప వలయును.

1. వైశాఖ, శ్రావణ, కార్తీక, మార్గశిర, మాఘ, ఫాల్గుణ మాసములయందు గృహారంభము మిక్కిలి శుభప్రదము.

2. మేషచైత్రము, వృషభజ్యేష్ఠము, తులా ఆశ్వయుజము సౌరమానము ననుసరించి
3. ఆషాఢము, భాద్రపదము, పుష్యము ఇవి గృహారంభమునకు నింద్యములు.

పంచాంగశుద్ధి :

1. గృహారంభమునకు శుభకరమగు తిథులు :

"ద్వితీయా పంచమీ ముఖ్యా తృతీయా షష్టికా తథా
సప్తమీ దశమీచైవ ద్వాదశ్యే కాదశీ తథా
త్రయోదశీ పంచదశీ తిథయస్స్యుః శుభావహాః

(వాస్తురత్నాకరము)

అనగా విదియ, తదియ, పంచమి, షష్ఠి, సప్తమీ, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, పూర్ణిమ - ఈ తిథులు గృహారంభమునకు శుభప్రదము.

2. గృహారంభమునకు శుభప్రదమగు వారములు :

"సౌరేందు జీవ సౌమ్యాభ్యాం భార్గవస్యచ వాసరే
సూత్రపాతాదికం కార్యమిష్టం సమభి వాంఛతా"

(రత్నమాల)

ఆది, సోమ, బుధ, గురు, శుక్ర వారములు గృహారంభమునకు శుభప్రదమని వివరింపబడియున్నది. "ఆదిత్య భౌమవారంతు సర్వేవారాః శుభప్రదాః" అని

గ్రంథారంతరము లందు కలదు. కావున ఆది మంగళవారములు తప్ప మిగిలిన వారములన్నియు గృహారంభమునకు శుభప్రదమైనవి. ఆదివారమును రెండవ పక్షముగా గ్రహింపవచ్చును. మంగళవారము నిషిద్ధము.

**3. గృహారంభమునకు శుభప్రదమగు నక్షత్రములు :**

"ఉత్తరేపిచ రోహిణ్యాం పుష్యే మైత్రే కరద్వయే
ధనిష్టా ద్వితయే పౌష్ణే గృహారంభ ప్రశస్యతే"

(జ్యోతిర్నిబంధము)

అనగా ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రా, రోహిణి, పుష్యమీ, హస్త, చిత్త, అనూరాధ, ధనిష్ఠా, శతభిషం, రేవతి. ఈ 11 పదునొక్క నక్షత్రములు గృహారంభమునకు మిక్కిలి శుభకరమైనవని భావము. మరియు

చిత్రా శతభిషక్ స్వాతీ హస్తః పుష్య పునర్వసూ
రోహిణీ రేవతీ మూలం శ్రవణోత్తర ఫల్గుణీ
ధనిష్ఠాచోత్తరాషాఢా తథా భాద్రపదోత్తరా
అశ్వనీ మృగశీర్షేద్వే అనూరాధా తథైవచ
వాస్తుపూజనమే తేషు నక్షత్రేషు కరోతియః
సప్రాప్నోతి నరోలక్ష్మీ మితిప్రాహ పరాశరః

(పీయుషధార)

ఈ పై శ్లోకభావము సరళము. కాని యిందు పైనుదహరించిన పదునొక్క నక్షత్రముల యందు పునర్వసు, హస్త, స్వాతి, మూల, శ్రవణం, అశ్వని, మృగశిర అను నక్షత్రములు శుభప్రదములుగా చేర్చబడినవి. ఆంధ్రదేశమునందలి పంచాంగకర్తలు ఈ నక్షత్రములను శుభ ప్రదములుగా గ్రహించి గృహారంభ ముహూర్తములు వ్రాయుచుండుట ఆచారము నందున్నది.

**4. గృహారంభమునకు నిషిద్ధ యోగములు :**

వజ్రము, వ్యాఘాతము, శూలము, వ్యతీపాతము, అతిగండము, విష్కంభము, గండము, పరిఘ ఈ యెనిమిది యోగములయందు గృహారంభము శుభప్రదము గాదు.

ఈ విధముగా పంచాంగశుద్ధి గల కాలమునందు చంద్రతారా బలయుక్తమగు ముహూర్తమును నిర్ణయించుకొని గృహారంభము చేయవలయును. ఇతరములైన వృషభ కలశ చక్రశుద్ధులు లగ్న బలాబలములు ముహూర్త గ్రంథముల నుండి గ్రహింపగలరు. గ్రంథవిస్తర భీతిని వ్రాయుట విడువబడినది. ఈ గృహారంభమునందు ముఖ్యముగా గ్రహించ వలసియున్న భూసుప్తజ్ఞానము వివరింపబడుచున్నది.

## 5. భూసుప్త పరిజ్ఞానము :

"సుప్తావస్థ అనగా నిద్రావస్థ. భూమి నిద్రావస్థయందుండగా గృహారంభము చేయుట శుభప్రదము గాదని వాస్తుశాస్త్రవేత్తల అభిప్రాయము. ఇదియొక సాంకేతిక వైజ్ఞానిక పరమగు నిర్ణయము. ఈ నిర్ణయము సూర్యుని పరముగ చేయబడినది. సూర్యాకర్షణ శక్తికి ప్రత్యేకమగు స్థానముల యందున్న భూమి తన చైతన్యమును కోల్పోగలదని భావము. అట్టి కాలముల యందు గృహారంభము చేయరాదు.

"ప్రద్యోతనా త్పంచనగాంక సూర్యనవేందు షడ్వింశమితేషుభేషు
శేతే మహీనైవ గృహం విధేయం తడాగ వాపీ ఖననం నశస్తమ్"
(వాస్తు రత్నాకరం)

అనగా సూర్యస్థిత నక్షత్రము నుండి 5-7-9-12-19-26 నక్షత్రములయందు భూమి నిద్రావస్థను బొందును. భూమి నిద్రావస్థయందుండగా గృహారంభము చేయరాదు.

ఈ పైనుదహరించిన నక్షత్రములయందు తప్పనిసరిగా గృహారంభము చేయవలసిన ఆగత్యము కలిగినప్పుడు

5వ నక్షత్రమునందు మొదటి 4 ఘడియలు
7వ నక్షత్రమునందు మొదటి 8 ఘడియలు
9వ నక్షత్రమునందు మొదటి 5 ఘడియలు
12వ నక్షత్రమునందు మొదటి 3 ఘడియలు
19వ నక్షత్రమునందు మొదటి 6 ఘడియలు
26వ నక్షత్రమునందు మొదటి 7 ఘడియలు

విడిచిపెట్టి మిగిలిన కాలమునందు శుభప్రదమగు లగ్నబలము గల ముహూర్తమునందు గృహారంభము చేయవచ్చును.

## గృహారంభమునకు శుభప్రదమగు లగ్న బలాబలములు :

గృహారంభమునకు వృషభం, మిధునం, కన్య, ధనుస్సు, కుంభం, మీనం - ఈ లగ్నములు శుభప్రదములు. సింహ వృశ్చిక లగ్నములు శుభగ్రహ యుక్తములై 3-6-11 స్థానములయందు పాపగ్రహములున్నచో గృహారంభము చేయవచ్చును.

గురుడు మకరరాశి యందున్న కాలమునందు గృహారంభము చేయరాదు. అట్లే శుక్రుడు కన్యారాశియందున్నప్పుడు కూడ గృహారంభము శ్రేష్ఠము కాదు. అంగారకుడు, కృత్తిక, పుష్యమి, మఘ, ఉత్తర, హస్త, మూల, రేవతి నక్షత్రముల యందున్నప్పుడు గృహారంభము చేయరాదు.

శని భరణి, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, పూర్వాభద్ర, ఉత్తరాభాద్రల యందున్నప్పుడు కూడ గృహారంభము చేయరాదు. గృహారంభమునకు వృషభచక్రశుద్ధి ముఖ్యముగా గమనింప తగినది. విశ్వకర్మ ఈ వృషభచక్రమును "వాస్తుచక్రం ప్రవక్ష్యామి" అని దీనిని వాస్తుచక్రమని వర్ణించియున్నాడు.

మరియు వాస్తుకర్తరి అనగా సూర్యుడు భరణీ నక్షత్రము మూడవ పాదమున ప్రవేశించిన నాటినుండి కృత్తికా సంచార కాలమంతయు అగ్నికర్తరి, మరియు రోహిణీ ప్రథమ పాద సంచార కాలమంతయు గృహారంభమునకు నిషిద్ధము. కాని భరణీ నక్షత్రమునందు 3-4 పాదములయందున్నప్పుడును రోహిణీ ఒకటవ పాదము నందున్నప్పుడును రెండవ పక్షముగా గృహారంభము చేయు ఆచారమున్నది.

సాధారణముగా ఈ కర్తరీ కాలము మే 4వ తేదీనుండి 28వ తేదీవరకు యించుమించుగా ప్రతి సంవత్సరము ఆసన్నమగుచుండును. కాబట్టి సాధారణముగా ఈ కాలము వర్జనీయము.

గురుశుక్ర మూఢములయందు గృహారంభ గృహప్రవేశములు పూర్తిగా నిషేధింప బడినవి. కావున గృహారంభాది శుభకర్మలు చేయరాదు. గురుశుక్రుల బాల్యవృద్ధావస్థలు కూడ గమనింపతగినవి.

# గృహప్రవేశ విధి

ఈ గృహప్రవేశవిధి గేస్తునకు మిక్కిలి పవిత్రమైన కార్యము. ఈ గృహప్రవేశ విధానమును గూర్చి మయమతము నందు ఒక ప్రత్యేకమగు అధ్యాయమున విపులముగా వర్ణింపబడినది. కాని అందలి ముఖ్యాంశములు మాత్రము ఇందు వివరింపబడుచున్నవి.

"అధ నిష్టన్నగృహం ప్రవిశ్యతం
త్వరితం నప్రవిశేత్ నిష్టితం
యదినిష్పన్న మవేశితం చిరం
సురభూతాది గణాశ్చరం తల్యమ్"

అని మయుడు అధ్యాయ ప్రారంభమునందే వివరించి యున్నాడు. శాస్త్రోక్తముగా గృహ నిర్మాణకార్యము పూర్తి అయిన పిమ్మట యజమానుడు ఒక సుమూహూర్తమున గృహప్రవేశము చేయవలెను. అట్లు వెనువెంటనే గృహప్రవేశము చేయక చిరకాలము విడిచిపెట్టినచో అందు సుర భూతాది గణములు సంచరించుననియు, ఆ కారణముచేత గృహనిర్మాణము పూర్తి అయిన వెంటనే గృహప్రవేశము చేయవలయుననియు మయుని అభిప్రాయము.

గృహప్రవేశమునకు నిర్ణయించిన సుముహూర్తమునకు ఒకరోజు ముందుగా యింటి పనులన్నియు పూర్తి చేసి గోడలకు సున్నపు చిలుకలు వేసి యిల్లంతయు గోమయాదుల చేత అలికి ముగ్గులు పెట్టి సర్వాలంకార శోభితముగా అలంకరించవలయును. ద్వారములకు తలుపు విధిగా అమర్చవలయును. తలుపు అమర్చని యింటియందు ప్రవేశింపరాదు. ఆగ్నేయ మూలయందున్న గదియందు పొయ్యిలు అమర్చవలయును. యింటికి కుడి పార్శ్వమునందున్న గదియందు శయ్యను అనగా క్రొత్తమంచమును సర్వాలంకార శోభితముగా నలంకరించి యుంచవలయును.

ఇట్లు సర్వాంగసుందరముగా నలంకరించిన యింటికి, గృహప్రవేశ సమయమునకు గల ముందునాటి సాయంకాలము నందు పంచాంగశుద్ధి గల సమయమున ఆవును, దూడను తీసుకొనివచ్చి అంగణము అనగా ముంగిలియందు కట్టవలయును. మామిడితోరణములతో నలంకరింప వలయును. ఆ పిమ్మట బ్రాహ్మణులచేత వేద పారాయణము జరిపించు ఏర్పాట్లు చేయవలయును. సంధ్యా సమయము కాగానే

పుణ్యస్త్రీల చేత దీపారాధన జరిపించ వలయును.

అటుపిమ్మట స్థపతి శుచిర్భూతుడై నిశ్చలమైన మనస్సుతో తెల్లని వస్త్రములు, పుష్పములు, గంధమాల్యాదులు ధరించి ఒక పాత్రయందు పూజాద్రవ్యముల నుంచుకొని ఆ యింటియందు ప్రవేశించి ఈశాన్య కోణమున గల గదియందు వాస్తుమండపమును రచించి ఆ భవనమునకు నిర్ణయించిన పదదేవతా విన్యాసము ననుసరించి దేవతాపూజలు జరిపి ఆపిమ్మట మరియొక మండపమును రచించి అందుబాడిత, ఉలి మొదలగు పనిముట్లను ఉంచి నూతన వస్త్రాదులతో నలంకరించి పూజించి ఇట్లు ప్రార్థించవలయును.

నిరుజా, ముదితా, సదనా, ప్రతికా యశసా, మహతాద్భుత, వీర్యయుతా
సతతం నిరుపద్రవ కర్మయుతా పృథివీపతి జీవతు కర్మవిధే
ధారానిపాతాత్, సలిలప్రకోపాత్ దంష్ట్రానిపాతాత్, పవనప్రకోపాత్
అగ్నేశ్చదాహాత్ ముషితాచ్చ చోరాత్ రక్షం ద్విదం పద్మ శివంచమేస్తు.

ఈ విధముగా ప్రార్థన ముగించి ఆ పరికరములను గ్రహించి ఒకచోటనుంచి బలి ద్రవ్య శేషమును ఈశాన్యకోణమున గల నూతియందు విడిచి సంతుష్ట చేతస్కుడై తన పరివారముతో స్వగృహమున కేగవలయును.

ఆపిమ్మట సుముహూర్త కాలమునకు ముందుగా నవధాన్యములను ద్వారముల యందు ఉంచి ఆ పిమ్మట గృహభర్త

"గృహపతి గృహిణీ సమంగళౌచ
సుజన, సుభృత్య, సుతానుజాధిభిః
స్వభవనం గృహవస్తు సమగ్రకం
ప్రవిశతామనుచింత్య జగత్పతిమ్"

శుచిర్భూతుడై తెల్లని వస్త్రమాల్య గంధాదులు ధరించి ధర్మపత్నీ సమేతుడై తెల్లని పూలతో గూర్చిన మాలను ధరించి -

"గృహపతి పురతో యథా వివాహే
గృహిణీకర గ్రహణం గృహప్రవేశే"

అనగా వివాహ కాలమునందువలె ధర్మపత్ని కరగ్రహణము చేసి, తమకు ముందుగా అనగా పురోభాగమున గోవును, పిమ్మట నీళ్ళబిందెలు ధరించిన ముత్తైదువలును, ఆ పిమ్మట స్థపతియు, ఆ పిమ్మట పురోహితుడును నడుచుచుండ బ్రాహ్మణులు స్వస్తి వాచకములు పఠించుచుండ మంగళ తూర్యధ్వనులు మిన్నుముట్టుచుండ చేతను పూర్ణ

కలశమును ధరించి బంధుమిత్రపుత్రాది సమస్త పరివారము వెన్నంటి వచ్చుచుండ గృహపతి గృహమును సమీపించి ముందుగా గృహప్రదక్షిణ మాచరింపవలెను. ఆ విధముగా ప్రదక్షిణ చేయుకాలమునందు ఈశాన్యము లగాయితు యెనిమిది దిక్కులయందు, వాస్తుపద బాహ్య దేవతలకు వాస్తుబలులు సమర్పించవలెను.

1. ఈశాన్యమున -చరకీ దేవత 2. తూర్పునందు - సర్వస్కంధ 3. ఆగ్నేయమున - విదారికా 4. దక్షిణమున - ఆర్యమదేవత 5. నైఋతి దిశయందు - పూతనా దేవత 6. పడమరయందు - జృంభక దేవత 7. వాయవ్యమున - పాపరాక్షసి 8. ఉత్తరమున - ఫిలిఫించక

ఈ పైని చెప్పిన యెనిమిది దిక్కులయందు ఆయా దేవతల పేరున ఎఱ్ఱని అక్షతలు, టెంకాయలు సమర్పించి పిమ్మట ప్రదక్షిణములు పూర్తిచేసి ఆ తరువాత నిర్ణయించుకొన్న సుమూహర్తమునకు యజమానుడు గృహసింహద్వారమును సమీపించి ఆయా ప్రాంతీయాచార విధులు నిర్వహించిన పిమ్మట గోవును ముందుగా ద్వారము దాటించి ఆ పిమ్మట పూర్ణకుంభములు ధరించిన ముత్తైదువలు ముందు నడువగా యజమానియు ధర్మపత్నీ కరగ్రహణము జేసి కుడిపాదము ముందుంచి నూతన గృహప్రవేశము చేయవలయును. దీనికే శాస్త్రములయందు నూతన గృహప్రవేశమని తెలిపియున్నారు.

అట్లు గృహప్రవేశమైన పిమ్మట సింహద్వారమును దాటి దంపతులిరువురు యింటికి కుడిపార్శ్వమున గల పడకగదియందు ప్రవేశించి సర్వాలంకార శోభితమగు తల్పమునకు నమస్కరించి దానిపై యిరువురు కూర్చుండవలెను.

ఆపిమ్మట యజమానుడు గృహమధ్యగల రంగమును ప్రవేశించి పురోహితుని పురస్కరించుకొని గణపతిని బూజించి ఆ పిమ్మట ఆగ్నేయ మూలయందలి గదియందు అగ్నిప్రతిష్ఠ చేయవలెను. ఆపిమ్మట వాస్తుమంటపారాధన హోమాదులు శాస్త్రోక్తముగా జరిపించి స్థపతిని, బ్రాహ్మణులను, బంధు మిత్రాదులను తాంబూలాది సత్కారముల చేత సంతుష్టపరచి ఆశీర్వచనమును బొంది పంచభక్ష్య పరమాన్నాదులతో సంతృప్తి పరుపవలయును.

ఈవిధముగా మయుడు గృహప్రవేశవిధి విధానమును వర్ణించి యున్నాడు. ఆధునిక కాలమున ఇట్లు రెండురోజుల కార్యక్రమము ఒకే దినమునకు సవరించుకొనినను, కార్యక్రమము మాత్రము శాస్త్రీయముగా క్రమము తప్పక జరిగించుట శ్రేయస్కరము.

ఈ గృహప్రవేశవిధిని గూర్చి ఒక గమనిక. కొన్ని ప్రాంతములయందు సుముహూర్త మునకు ముందుగా గృహప్రవేశము చేయించి ముహూర్తకాలమునకు అగ్నిప్రతిష్ఠ చేయించుటయో పాలలో పిడికెడు బియ్యము వేయించుటయో చేయుచున్నారు. ఇది శాస్త్రోక్తమగు గృహప్రవేశవిధి కాజాలదు. విజ్ఞులు గమనింపవలయును.

## గృహప్రవేశ యోగ్యకాలము :

గృహారంభమునకు యోగ్యమగు కాలము, గృహప్రవేశమునకు కూడ శుభప్రదమని శాస్త్రవచనము. కాలామృతము ననుసరించి వైశాఖ, జ్యేష్ఠ, మాఘ ఫాల్గుణ మాసములు మాత్రము గృహప్రవేశమునకు మిక్కిలి శుభదాయకములు. జ్యేష్ఠమాసము గృహారంభమునకు నిషిద్ధమైనను గృహప్రవేశమునకు మాత్రము మిక్కిలి శుభదాయకమైనదని శాస్త్రవేత్తల యభిప్రాయము. ఉత్తరాయణము గృహారంభ గృహప్రవేశములకు సర్వసంపత్కరమగు కాలము.

## గృహప్రవేశమునకు యోగ్యమగు నక్షత్రములు :

రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త, అనూరాధ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ 10 నక్షత్రముల యందు గృహప్రవేశము మిక్కిలి శుభప్రదమని కాలామృతకారుని మతము. పుష్యమి మధ్యమఫలప్రదము. కలశచక్రశుద్ధి ముఖ్యము. వృషభచక్ర శుద్ధియు చూడవలయును. వామరవి మొదలగు విషయములు గ్రంథాంతరములందు చూడగలరు. గ్రంథ విస్తరమగుట విడిచి పెట్టబడినవి.

గమనిక : అశ్విని, పునర్వసు, హస్త, స్వాతి, శ్రవణం ఈ 5 నక్షత్ర ముల యందు గృహప్రవేశము నిషేధింపబడినది. అష్టమశుద్ధిగ్రహబలాబలములు తదితర విషయములు ముహూర్త గ్రంథములయందు పరిశీలింపగలరు. స్వాతి, శ్రవణములు ప్రత్యేకయోగముల యందు చెప్పబడియున్నవి. కావున రెండవ పక్షముగా గ్రహింపవచ్చును.

## ఫలశ్రుతి :

కోటిఘ్నం తృణేపుణ్యం మృణ్మయే దశప గుణం
ఇష్టికేశతకోటిఘ్నం శైలేనంతం ఫలం లభేత్
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు
మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ఆయాది సాధన విధి

ఆయాది సాధన గృహాది నిర్మాణ కార్యములయందు ప్రాణతుల్యమని మయుడు విశ్వకర్మ మొదలగు శిల్పశాస్త్రవేత్తల అభిప్రాయము. ఈ ఆయాది వర్గసాధన విధిని గూర్చి మయుడు-

"ఆయాది సంపదర్థం వృద్ధిం హానించ యష్టిభిః కుర్యాత్
ఆయవ్యయర్క్షు యోన్యాయుభిః (ర్యంశే) రథతిథిభిశ్చ వారైశ్చ"
(మయమతం 9వ అధ్యాయం 61 పుట)

అని వివరించియున్నాడు. ఈ ఆయాది వర్గము గృహయజమాని యొక్క జన్మ నామ నక్షత్రములకు తారాబల యుక్తమగునట్లుగా సాధింపవలయును. అట్టి శుభప్రదమగు ఆయాది వర్గముల గృహము యజమానునకు సమస్త సంపదలను ప్రసాదింపగలదని మయుని అభిప్రాయము. మయమతము ననుసరించి ఆయాది వర్గమునందు 7 వర్గములు గ్రహింపబడినవి. "అంశము" యెనిమిదవదిగా వికల్పము చెప్పబడినది. మొత్తం యెనిమిది వర్గములు వివరింపబడినవి.

వాస్తువిద్య యందు మనుష్యాలయ చంద్రికయందు గూడ ఆయాది వర్గమునందు యేడు అంశములే చెప్పబడినవి. కాని వీటి సాధనాపద్ధతులయందు స్వల్పమగు భేదములున్నవి. మానసారము షడ్వర్గునే ప్రతిపాదించినది. కాని ఆంధ్రదేశమునందు మాత్రము మయుడు ప్రతిపాదించిన యెనిమిది అంశములతో బాటు దిక్పతి 9వదిగా గ్రహించి "నవర్గు"గా వాడుకలో నున్నది. మరియొక విశేషమేమనగా ఈ నవర్గు గణితము కాళిదాస కృతమగు కాలామృత పద్ధతి ననుసరించి గుణింపబడియున్నది. మయమత పద్ధతికిని ఈ కాలామృత పద్ధతికిని స్వల్ప భేదములున్నవి.

శస్త్రములయందు ఈ ఆయాది సాధనకు యితర విషయములందు వలె సాధారణ విధి, విశేషవిధి రెండును చెప్పబడినవి. సాధారణవిధి చేత శుభప్రదమగు ఆయాదికము సిద్ధింపని యెడల విశేషవిధి నాశ్రయించి ఆయాదికము సాధింపవలయును. దీనికే

మిశ్రమవిధియని చెప్పవచ్చును. మిశ్రమవిధియనగా భిన్నభిన్న అంశములను విభిన్న పద్ధతులలో సాధింపబడును. ఉదాహరణకు సాధారణవిధియందు ఒకే "పిండమును" ప్రాతిపదికగా గ్రహించి ఆయాదికము సాధింపబడును. విశేషవిధియందు భిన్న భిన్న విషయములు ప్రాతిపదికగా గ్రహించి ఆయాదికము గుణింపబడును.

## సాధారణ విధి :

ఆద్యశిల్పముని మయుని అభిప్రాయము ననుసరించి ఆయాది సాధనవిధి ఈ క్రింద పొందుపరచ బడుచున్నది. వాస్తు శాస్త్రవేత్తలు ఈ పద్ధతిని పరిశీలింతురు గాక.

మయమతమునందు ఆయాది వర్గసాధనకు ప్రాతిపదిక "పరిధి". పరిధి అవగా చుట్టు కొలతయని భావము. ఈ పరిధిని ప్రాతిపదికగా గ్రహించి ఈ క్రింది విధముగా ఆయాది వర్గమును సాధింపవలయును.

1. పరిధి × 8 ÷ 12 = ధనము
2. పరిధి × 9 ÷ 12 = ఋణము
3. పరిధి × 9 ÷ 7 = వారము
4. పరిధి × 30 ÷ 15 = తిథి
5. పరిధి × 8 ÷ 27 = నక్షత్రము
6. పరిధి × 3 ÷ 8 = ఆయము (యోని)
7. పరిధి × 21 ÷ 9 = అంశము
8. పరిధి × 8 ÷ 120 = వయస్సు

**ఒక ముఖ్య గమనిక -:** మయమతము నాకు లభించిన ప్రతియందు ఆయుర్దాయ సాధనను గూర్చి - "వసుభిర్గుణితే త్రినవాహత్యాఫలం వయః" అని యున్నది. సమస్త వాస్తు గ్రంథముల యందు వయఃపరిమాణము 120గా అంగీకరింపబడి యున్నందున పై పట్టిక యందు భాగహార సంఖ్య 120గా చూపడమైనది. విజ్ఞులు గమనింప ప్రార్థన.

విశేషవిధి :

మానసారము, సకలాధికారము, మనుష్యాలయ చంద్రిక మొదలగు గ్రంథముల యందు వివరింపబడియున్న మిశ్రమవిధి ననుసరించి ఈ విశేషవిధి చూపబడుచున్నది.

1. వైశాల్యము × 8 ÷ 12 = ధనము

2. పరిధి × 9 ÷ 8 = ఋణము

3. పాడవు × 3 ÷ 7 = వారము

4. పరిధి లేక పాడవు × 9 ÷ 30 = తిథి

5. వైశాల్యము × 8 ÷ 27 = నక్షత్రము

6. వైశాల్యము ÷ 8 = ఆయము

7. పరిధి × 27 ÷ 20 = ఆయువు

గమనిక : లబ్దమును బట్టి గత వయస్సును, దాని అవస్థయు శేషమును బట్టి వర్తమాన అవస్థలో గడచిన వయస్సును తెలియగలరు. అవస్థలనగా బాల్య, యౌవన, కౌమార, ప్రౌఢ, వృద్ధావస్థలు 5.

ఈవిధముగ భిన్న భిన్న విషయములకు ప్రాతిపదికగా గ్రహించి ఆయాది వర్గమును సాధించు పద్ధతులు గలవు. కాబట్టి నిపుణుడగు స్థపతి ఆయా దేశకాల పద్ధతులను సమన్వయ పరచుకొని గృహయజమాని జన్మనామ నక్షత్రములకు తారాబల యుక్తముగా గల ఆయాది శుభవర్గమును సాధించి గృహాది నిర్మాణములను సాగింపవలయును. గ్రంథవిస్తర భీతి వివాదాస్పదమగు తదితర విషయములు విడువబడినవి. ఆసక్తి గలవారు ఆయా గ్రంథ పరిశీలన చేయగలరు.



# ఆయాది సాధన సమన్వయవిధి

వాస్తుశాస్త్రాభిమానులకు మయుని సిద్ధాంతములన్న మిక్కిలి మక్కువ. ఆంధ్రులకు ముఖ్యముగా గ్రామీణ ప్రాంతములవారికి "మయవాస్తు" అంటే యెనలేని ఆదరమున్నది. కాని ఆ మయుని సిద్ధాంతములు మన దురదృష్ట వశమున ఆంధ్రప్రాంతమునందు అంతగా ప్రచారమునందు లేవు. ఈ లోపమును సవరింపవలసి యున్నది.

కాళిదాసు రచించిన కాలామృతము, జ్యోతిషగ్రంథములలో సుప్రసిద్ధమగు ప్రామాణిక గ్రంథము. యావద్భారతదేశమునను ఈ గ్రంథము ప్రామాణికమైనదిగా భావింపబడుచున్నది. అట్టి కాలామృతము ననుసరించి గుణించి సిద్ధపరచబడిన సువర్గగృహ పథకములు మిక్కిలి ప్రచారము నందున్నవి. ఇంచుమించుగా ఆంధ్రదేశమునందు చాలా ప్రాంతములయందు ఈ పథకములనే ఉపయోగించుచున్నారు. కాబట్టి ప్రస్తుతము ప్రచారమందున్న గృహపథకములను మయుని సిద్ధాంతములకు అనువుగా యెట్లు సమన్వయ పరచుకొనగలమో వివరించుటయే ఈ ప్రకరణము యొక్క లక్ష్యము.

మయముని, కాళిదాసు యిరువురి సిద్ధాంతముల యందు పిండసాధన విషయము భేదించినను, ఆయాది వర్గసాధనయందు స్వల్పమగు భేదములు మాత్రమే యున్నవి. ఈ అభిప్రాయ భేదములు యితర గ్రంథములలో యింకను అధికము. ఇట్టి అభిప్రాయభేదములకు కారణము ఒకే లక్ష్యమును సాధించుటకు గణిత శాస్త్రవేత్తలు విభిన్న రీతులు అవలంబించుటయే. కావున మయ కాళిదాసుల మూలసిద్ధాంతములకు భిన్నము లేని విధముగా ఈ క్రింది సూచన సమన్వయ విధి కాగలదు.

కాలామృత పద్ధతితో సాధించిన గృహసువర్గ పదములు ప్రస్తుతము వాడుకలో నున్నవి కదా! అందుండి గృహయజమాని జన్మనామ నక్షత్రములకు తారాబల యుక్తమై వర్గారూఢము చేత యజమానునకు యోగ్యమగు ఆయము గల మరియు ఆయా నిర్మాణ

స్థలమునకు యోగ్యమగు పరిమాణము గల పదమును గ్రహించి ఆ పదములు పరిధికి అవగా చుట్టుకొలతకు అనువగు రీతిలో పొడవు వెడల్పులను సాధించి గృహనిర్మాణ మొనర్చినచో సమన్వయ విధానము కాగలదు. ఇందు శాస్త్రదూష్యము గాని ఆక్షేపణగాని యుండరాదు. అంతేకాదు శిల్పమునందు మిశ్రమశైలి ననుసరించుట లోకానుభవమే. నాగర, వేసర, ద్రావిడ, గాంధారాది శిల్పశైలులు ఆ శిల్పి యొక్క నిర్మాణకళా కౌశలము ననుసరించి మేళవింపబడి దేశవిదేశములందు ప్రఖ్యాతినొంది యున్నవి. కాబట్టి వాస్తుశాస్త్ర పండితులు స్థపతులు, ఈ సమన్వయ పద్ధతియందలి ఔచిత్యము గ్రహించి ఆచరణలోనికి తేగలందులకు ప్రార్థితులు. ఈ పద్ధతియందు, యజమానునకు ఇష్టమగు పొడవు వెడల్పులను సాధించుట సులభము, మరియు శుభప్రదము కాగలదు.

## ఇష్టపదమును పొడవు, వెడల్పుగా విభజించుట :

గృహయజమానునకు నిర్మింపదలచిన యింటికి గర్భము ముందుగా నిర్ణయించుకొని పిమ్మట ఆ గర్భప్రమాణమును రెట్టించి పదము నుండి తీసివేసినచో మిగిలినది అనగా శేషము యింటియొక్క రెండు పొడవులగును. అందు సగము మనకు కావలసిన పొడవగును. ఈ విధముగా ఇష్టపదమునకు పొడవు వెడల్పులు సాధించుట బహు సులభము. దీనికి పెద్దగా గణిత శాస్త్రాభ్యాసము కూడ అవసరము లేదు. ఉదాహరణ గమనింపుడు.

## ఇష్టపదము - *30*

హస్తము - పాఠకుల సులభగ్రాహ్యముగా నుండుటకు హస్తమనగా 36 బ్రిటీషు అంగుళ ప్రమాణముగల బ్రిటీషుమానము "గజము" గ్రహింపబడినది. దీనికే ధనుర్ముష్టియని పేరు.

గృహనిర్మాణ స్థలమునకు యోగ్యమైన యజమానునకు అనువైన గర్భప్రమాణము 21 హస్తములు అని భావింపుడు. దీనికి రెట్టింపు అనగా 4 ఇంటు 2 = 8 హస్తములు అయినది. మనము గ్రహించిన పదము 39. దీనిని పరిధిగా భావించి 39నుండి 8 తీసివేయగా అనగా రెండు వెడల్పులు తీసివేయగా మిగిలిన శేషము = 31 ఉన్నది. ఈ శేషము యింటియొక్క రెండు పొడవులు, అందు సగము 15 అ. 18 అంగుళములు అగును. అనగా బ్రిటీషు మానములో-

| | | |
|---|---|---|
| | హ - అం | అ - అ |
| వెడల్పు = | 4 - 0 | 12 - 0 అంగుళములు |
| పొడవు = | 15 - 8 | 46 - 6 అంగుళములు |

ఈ పై విధముగా సమన్వయమును సాధించిన కొన్ని పదములు అనుబంధముగ చేర్చబడుచున్నవి. సులభతరము శాస్త్రబద్ధము అగు ఈ పదములు కొన్ని పొడవు వెడల్పులను విభజించి వ్రాయబడుచున్నవి. ఈ విధానమును వాస్తుశాస్త్రాభిమానులెల్లరు ఉపయోగించి మయుని సిద్ధాంతముల యందలి ఔచిత్యమును ఔన్నత్యమును దర్శింతురు గాక !

త్రిపుర పురత్రయ రచనా యత్నకరయోః కర్మచాతురీ జాతా
శిల్పవరంతీం దనుజైరర్చిత చరణం మయంమయం వందే
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు
మంగళం మహత్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# అనుబంధము

ప్రస్తుతము ఆంధ్రదేశమునందలి వాస్తుసిద్ధాంతులచే వినియోగింపబడుచున్న కొన్ని సువర్గ గృహగనిత పదములకు మయమతము ననుసరించి చుట్టుకొలతకు పరిచేయబడిన గృహగర్భ ప్రమాణములు.

గమనిక : ఈ కొలతలు 36 అంగుళముల "ధనుర్ముష్టి" అను హస్తమునకు అనగా బ్రిటీషు గజమునమసరించి అదుగులు అంగుళములలో చూపబడినవి.

**1. 83/4 పిండము 20-27**

| రోహిణి | సింహాయము |
|---|---|
| వెడల్పు | పొడవు |
| అ . అం. | అ . అం. |
| 9 - 0 | 22 - 1 1/2 |
| 9 - 3 | 21 - 10 1/2 |
| 9 - 6 | 21 - 7 1/2 |
| 9 - 9 | 21 - 4 1/2 |
| 10 - 0 | 21 - 1 1/2 |

**2. 21 పిండము**

| ఆరుద్ర | వృషభాయము |
|---|---|
| వెడల్పు | పొడవు |
| అ . అం. | అ . అం |

| | |
|---|---|
| 9 - 0 | 22 - 6 |
| 9 - 3 | 22 - 3 |
| 9 - 6 | 22 - 0 |
| 9 - 9 | 21 - 9 |
| 10 - 0 | 21 - 6 |

*3.* *49/2* పిండము *24 - 18*

| పునర్వసు | వృషభాయం |
|---|---|
| వెడల్పు | పొడవు |
| అ . అం. | అ . అం |
| 9 - 0 | 27- 9 |
| 9 - 3 | 27 - 6 |
| 9 - 6 | 27 - 3 |
| 9 - 9 | 27 - 0 |
| 10 - 0 | 26 - 9 |

*4* *25* పిండము

| పుబ్బ | ధ్వజాయము |
|---|---|
| వెడల్పు | పొడవు |
| అ . అం. | అ . అం |
| 9 - 0 | 28 - 6 |
| 9 - 3 | 28 - 3 |
| 9 - 6 | 28 - 0 |
| 9 - 9 | 27 - 9 |
| 10 - 0 | 27 - 6 |

## 5 139/4 పిండము 34 - 27

| పుష్యమి వెడల్పు అ . అం. | ధ్వజాయము పొడవు అ . అం |
|---|---|
| 9 - 0 | 43 - 1 1/2 |
| 9 - 3 | 42 - 10 1/2 |
| 9 - 6 | 42 - 7 1/2 |
| 9 - 9 | 42 - 4 1/2 |
| 10 - 0 | 42 - 1 1/2 |
| 10 - 3 | 41 - 10 1/2 |
| 10 - 6 | 41 - 7 1/2 |

## 6 35 పిండము

| మఘ వెడల్పు అ . అం. | సింహాయము పొడవు అ . అం |
|---|---|
| 9 - 0 | 43 - 6 |
| 9 - 3 | 43 - 3 |
| 9 - 6 | 43 - 0 |
| 9 - 9 | 42 - 9 |
| 10 - 0 | 42 - 6 |
| 10 - 3 | 42 - 3 |
| 10 - 6 | 42 - 0 |

7 37 పిండము

| | |
|---|---|
| ఉత్తరాభాద్ర | వృషభాయము |
| వెడల్పు | పొడవు |
| అ . అం. | అ . అం |
| 9 - 0 | 46- 6 |
| 9 - 3 | 46- 3 |
| 9 - 6 | 46 - 0 |
| 9 - 9 | 45 - 9 |
| 10 - 0 | 45 - 6 |
| 10 - 3 | 45 - 3 |
| 10 - 6 | 45 - 0 |
| 10 - 9 | 44 - 9 |
| 11 - 0 | 44 - 6 |
| 11 - 3 | 44 - 3 |
| 11 - 6 | 44 - 0 |
| 11 - 9 | 43 - 9 |
| 12 - 0 | 43 - 6 |

8 297/8 పిండము 37 - 4 1/2

| | |
|---|---|
| రేవతి | గజాయము |
| వెడల్పు | పొడవు |
| అ . అం. | అ . అం |
| 9 - 0 | 46- 8 1/4 |
| 9 - 3 | 46- 5 1/4 |
| 9 - 6 | 46 - 2 1/4 |

| | |
|---|---|
| 9 - 9 | 45 - 11 1/4 |
| 10 - 0 | 45 - 8 1/4 |
| 10 - 3 | 45 - 5 1/4 |
| 10 - 6 | 45 - 2 1/4 |
| 10 - 9 | 44 - 11 1/4 |
| 11 - 0 | 44 - 8 1/4 |
| 11 - 3 | 44 - 5 1/4 |
| 11 - 6 | 44 - 2 1/4 |
| 11 - 9 | 43 - 11 1/4 |
| 12 - 0 | 43 - 8 1/4 |

*9* *335/9 పిండము 37 - 8*

| అశ్వని వెడల్పు | గజాయము పొడవు |
|---|---|
| అ . అం. | అ . అం |
| 9 - 0 | 46- 10 |
| 9 - 3 | 46- 7 |
| 9 - 6 | 46 - 4 |
| 9 - 9 | 46 - 1 |
| 10 - 0 | 45 - 10 |
| 10 - 3 | 45 - 7 |
| 10 - 6 | 45 - 4 |
| 10 - 9 | 45 - 1 |
| 11 - 0 | 44 - 10 |
| 11 - 3 | 44 - 7 |
| 11 - 6 | 44 - 4 |
| 11 - 9 | 44 - 1 |
| 12 - 0 | 43 - 10 |